# అపరాధ పరిశోధన

రు.3 సెప్టెంబర్ '75



అపరాధ పరిశోధన అనుబంధం—21

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## అందమైన అమ్మాయిలు

రచన : శశిభూషణ్

## హత్యచేసి చూడు

రచన : కంచర్ల రమణ

## దెయ్యాల క్లబ్బు

రచన : దివాకర్ల సన్యాసిరాజు

## రహస్య దీవి

రచన : 'రాజా'

"ఖైదీ" సీరియల్ - 16 వ భాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్—21
సెప్టెంబర్, 1975
వెల : 3_00 రూపాయలు
ఏడాది చందా 39 రూపాయలు
ఉచిత చందా డిపాజిట్టు 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్ :
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం :
టెంపోరావ్
శ్యాంబాబు
రమణశ్రీ
ఏ. వీ. మోహన్రావ్
సుజనశ్రీ
వసుంధర
కంచర్ల రమణ

కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాద్_29
ఫోన్_36959

ముద్రణ : క్రాంతి ప్రెస్, మద్రాసు_1

గెద్దాం రంగారావు

# అందమైన అమ్మాయిలు

శశిభూషణ్

ఖలీల్ టిఫిన్ తినడం ముగించి, బిల్లు చెల్లించి హోటలోంచి బయటికి నడిచాడు. పేవ్‌మెంటు మీద నిలబడి సిగరెట్ వెలిగించుకున్నాడు. రెండు నిమిషాలు అక్కడే నిలబడి, సిగరెట్ త్రాగటం అయాక నెమ్మదిగా బయలుదేరాడు.

ఖాళీగా వెళ్తున్న టాక్సీని పిలిచి, ఎక్కి కూర్చున్నాడు.

"ఎక్కడికి కెళ్ళాలి సార్?" అడిగాడు డ్రైవర్ మీటరు మారుస్తూ.

"టి. నగర్. మోతీలాల్ స్ట్రీట్!" అని సీట్లో వెనక్కివాలి కళ్ళుమూసుకున్నాడు ఖలీల్.

టాక్సీ బయలుదేరింది.

ఇది తన తొలి ప్రయత్నం. తను ఎంతో జాగ్రత్తగా వ్యవహరించాలి. పదెనిమిదేళ్ళు వుంటాయి సుమతికి. చాలా అందంగా వుంటుంది. తను వెళ్ళే సమయానికి యింట్లో వుంటుందా? తన మాటల్ని నమ్ముకుంటే? నమ్మించాలి. యోచిస్తున్నాడు ఖలీల్ తీవ్రంగా — చాలా తీవ్రంగా.

కోడంబాకం హైరోడ్డు చేరుకుంది టాక్సీ. అక్కడ నుంచి ఉస్మాన్ రోడ్డు వైపు తిరిగి వేగంగా పరుగెత్తి సాగింది.

ఖలీల్ ఆలోచనలు తెగటంలేదు.

"సార్, ఇదే మోతీలాల్ స్ట్రీట్. ఈ వీధిలో ఎక్కడికి వెళ్ళాలి?"

డ్రైవర్ మాటలు విని ఈ లోకంలోకి వచ్చాడు ఖలీల్. మీటర్ ప్రకారం డబ్బు యిచ్చేసాడు. టాక్సీ దిగి, "దగ్గరేలే! నేను నడిచి వెళతానులే" అంటూ ముందుకు వెళ్ళాడు ఇళ్ళ నెంబర్లు చూసుకుంటూ.

టాక్సీ వెళ్ళిపోయింది.

ఓ యింటిముందాగి తలుపు తట్టాడు ఖలీల్.

అందమైన యువతి తలుపు తెరిచింది.

"మీ నాన్నగారి పేరు ధర్మారావ్ కదమ్మా!" అడిగాడు ఖలీల్.

"అవును" అందామె, ఖలీల్ ఎవరో అర్థంకాక.

"పతి అండ్ పతి ప్రొవిజినల్ స్టోర్స్‌లో అకౌంటెంట్‌గా పనిచేస్తున్నారు?"

అవునన్నట్లు తలూపిందామె.

"అయితే నేను యిల్లు వెతకడంలో పొరబడలేదన్న మాట!"

"నాన్నగారి కోసం వచ్చారా?" అడిగింది.

చిన్నగా నిట్టూర్చి, "కాదమ్మా! నీకోసమే వచ్చాను" అన్నాడు ఏదో తప్పుచేసినవాడిలా తల దించుకుంటూ.

"నాకోసమా!" ఆశ్చర్యపోయిందామె.

"అమ్మా! నీపేరు, ఇంకా కొన్ని వివరాలు మీ నాన్నగారే చెప్పి పంపించారు. నువ్వు నన్ను క్షమించాలి సుమతీ! నేను—" అంటున్నాడు ఖలీల్.

"అసలు సంగతి ఏమిటో చెప్పండి!" కాస్త విసుగ్గా అంది సుమతి.

"చెబుతానమ్మా! నా పేరు రాజగోపాల్. అడయార్‌లో వుంటున్నాను. డాక్టర్ని నేను. ఉదయం ఎనిమిది గంటలై వుంటుంది. రోడ్డుమీద పరధ్యానంగా నడుస్తున్న మీ నాన్నగారికి నా కారు ఢీకొన్నది. పెద్ద ప్రమాదం ఏం జరగలేదు దేవునిదయవల్ల. మీ నాన్నగారు—"

"నాన్నగారికేమైంది? ఇపుడెలా వుంది?" కంగారుగా అడిగిందామె, ఖలీల్ మాటలు పూర్తిగా విన్పించుకోకుండా.

"నాన్నగారికేం ఫర్వాలేదమ్మా! చిన్న చిన్న దెబ్బలు తగిలాయి. క్రింద పడగానే స్పృహ కోల్పోయారు."

సుమతి మొఖంనిండా చెమటపట్టేసింది.

"భయపడకమ్మా! నాన్నగారు యిపుడు క్షేమంగానే వున్నారు. నా డిస్పెన్సరీలోనే బెడ్ మీద పడుకుని వున్నారు, నిన్నే కలవరిస్తూ. వారికి ఇంజక్షన్ యిచ్చి,

నేనిలా వచ్చాను. త్వరగా బయలుదేరమ్మా!" అన్నాడు ఖలీల్ నెమ్మదిగా.

సుమతికి ఏడుపు రాబోయింది. బలవంతంగా దాన్ని దిగమింగుతూ, "నాన్నగారు మళ్ళీ మామూలు మనిషి కావటానికి ఎన్నిరోజులు పడుతుంది డాక్టర్?" అడిగింది.

"రెండు మూడు రోజుల్లో మళ్ళీ మామూలుగా తిరగ్గలరు."

సుమతి లోపలికి పరుగెత్తింది. ఐదు రూపాయలనోటు సూట్ కేస్ లోంచి తీసుకుని హేండ్ బ్యాగ్ లో పడేసుకుంది. కంగారుగా చెప్పులు తొడుక్కుని, "పదండి, డాక్టర్!" అంది ఖలీల్ దగ్గరగా వచ్చి.

"ఇంటికి తాళంవేసి బయలుదేరమ్మా!"

లోపలికి వెళ్ళి, వెంటనే తిరిగొచ్చింది సుమతి, అటు తిరిగి తలుపుమూసి, తాళం వెయ్యసాగింది యింటికి.

జేబులోంచి ఓ కవరు తీసి, వీధివైపు తెరిచి వుంచిన కిటికీగుండా లోపలికి జారవిడిచాడు ఖలీల్.

సుమతి తాళం వెయ్యటం పూర్తి కాగానే యిటు తిరిగింది.

"త్వరగా పదండి డాక్టర్!" అంది తండ్రికెలావుందో ననే కంగారులో.

సుమతిని తీసుకొని రోడ్డుమీదికి వచ్చాడు ఖలీల్. నాలుగు నిమిషాల తర్వాత ఖాళీ టాక్సీ దొరికింది. ఇద్దరూ కూర్చున్నారు.

సుమతి గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. రకరకాలుగా వూహిస్తోందామె మనసు.

ఖలీల్ క్రిందికి దిగాడు ఓచోట టాక్సీ ఆపించి. మీటర్

ప్రకారం డబ్బు యిచ్చాడు. చేసేది లేక సుమతి కూడా దిగింది.

టాక్సీ వెళ్ళిపోయింది.

అరవై గజాలు దాదాపు నడిచి, ఓ ఆవరణంలోకి తిరిగాడు ఖలీల్.

గేటుముందు ఘూర్ఖా లేడు.

అతను ఇంటిముందు కాకుండా, యింటికి కాస్త దూరంలోనే టాక్సీ ఎందుకు ఆపించాడో-అవన్నీ యోచన చెయ్యలేదు సుమతి. కంగారుగా అతని వెనకే వెళ్తోంది.

రెండంతస్తుల భవనమది. చుట్టూ ప్రహరీగోడ ఎత్తుగా వుంది. భవనానికి గేటుకి మధ్యలో ఒకవైపు చిన్న పూలతోట వుంది. పోర్టికోలో ఫియట్ కారొకటి నిలబడి వుంది. ప్రస్తుత నాగరికతకి చిహ్నంగా వుందా యిల్లు.

అవన్నీ పరిశీలనగా చూళ్ళేదు సుమతి. గబగబ ఖలీల్ వెంట నడిచిపోతోంది.

మేడమీదికి వెళ్ళిన తర్వాత ఒక గదివైపు చెయ్యి చూపిస్తూ, "నాన్నగారు ఆ గదిలో వున్నారమ్మా! వెళ్ళి చూడు" అన్నాడు ఖలీల్, మొఖానికి పట్టిన చెమటని జేబురుమాలుతో అద్దుకుంటూ.

సుమతి తలుపు తోసుకుని గదిలోకి పరుగెత్తింది.

గదిలో ధర్మారావ్ గారు లేరు. గది మధ్యలో ఒక సోఫా వుంది. దానిముందు చిన్న టీపాయ్ వుంది. అంతకుమించి మరెటువంటి ఫర్నిచర్ లేదా గదిలో.

సుమతి ఆశ్చర్యపోతూ వెనుదిరిగింది.

గది తలుపు బంధింపబడి వుంది అప్పటికే.

# 2

ఖలీల్ చాలా వీధులు తిరిగి మౌంట్ రోడ్డులోకి ప్రవేశించాడు. ప్రక్కలకు, వెనక్కి చూడటంలేదతను తలొంచుకుని నడుస్తున్నాడు పేవ్ మెంట్ మీద.

ఓ హోటల్ ముందాగి, సిగరెట్ వెలిగించుకున్నాడు. ట్రాఫిక్‌ని చూస్తూ సిగరెట్ కాల్చుకోసాగాడు. రెండు నిమిషాల తర్వాత సిగరెట్ పారేసి, హోటల్లోకి నడిచాడు. స్పెషల్ రూంలో కూర్చుని భోజనం చేశాడు.

సర్వర్ బిల్లు తెచ్చాడు.

ఆరు రూపాయలు అయ్యింది బిల్లు.

జేబులోంచి ఏడు రూపాయినోట్లు తీసి, సాసర్‌లో పడేసాడు ఖలీల్.

సర్వర్ వినయంగా విష్ చేసి, సాసర్ అందుకున్నాడు.

జేబులోంచి పిస్తోలు తీసాడు ఖలీల్.

పిస్తోలు చూసి గడగడ వణకిపోయాడు సర్వర్.

చిన్నగా నవ్వి, "భయపడక!" అన్నాడు ఖలీల్. "జాఫర్! ఇది ఎప్పుడూ వుంటుంది నా దగ్గర. మర్చిపోవద్దు!" అంటూ పిస్తోల్ని జేబులో పెట్టుకున్నాడు.

సర్వర్ జాఫర్‌కి అప్పటికి తగ్గింది ఒణుకు.

"జాఫర్! నీ సహకారంతో నా తొలి ప్రయత్నం దివ్యంగా ఫలించింది. సాయంత్రంలోగా మరో ఐదుగురు అమ్మాయిల ఎడ్రస్‌లు, వారి వివరాలు కావాలి నాకు. ఇదిగో ఈ రోజు నీ కూలి" అంటూ పదినోట్లు తీసి జాఫర్‌కిచ్చాడు ఖలీల్.

వందరూపాయలు జేబులో పడేసుకుని, ఇంకా ఖలీల్ చేతిలోవున్న నోట్లకట్టని చూస్తున్నాడు జాఫర్.

"పెళ్ళి అయి వుండకూడదు. అమ్మాయిలు అందంగా వుండాలి. తెల్సిందా?" అంటూ లేచి నిలబడ్డాడు ఖలీల్ నోట్లకట్టని కోటు జేబులో పడేసుకుని.

"అలాగే సార్!"

"జాఫర్! ఏమాత్రం పొరపాటు జరిగినా ఇద్దరం జైల్లో వుంటాము. జైలు జీవితం ఎలా వుంటుందో..."

"పొరపాటు జరగనివ్వను సార్!"

"గుడ్! రాత్రి ఇక్కడే ఫోంచేస్తాను. అపుడు యివ్వు ఎడ్రస్‌లు" అని బయటికి నడిచాడు ఖలీల్.

# 3

తలుపు తెరుచుకునేసరికి వులిక్కిపడి, సోఫాలోంచి లేచి నిలబడింది సుమతి.

ఖలీల్ లోపలికొచ్చాడు. వెంటనే తలుపుమూసి, లోపల్నించి లాక్ చేసి, తాళం చెవిని కోటుజేబులో పడేసుకున్నాడు.

తీక్షణంగా ఖలీల్‌ని చూసింది సుమతి.

చిన్నగా నవ్వాడు ఖలీల్. "ఆకలిగా వుందా?" అడిగాడు.

చెప్పు తీసుకుని అతని మొఖంమీద కొట్టాలని అన్పించింది సుమతికి. ఎలాగో వుద్రేకాన్ని అదుపులో పెట్టుకోగలిగింది.

"మా నాన్నగారికి దెబ్బలు తగిలాయని నమ్మించి, నన్ను యిలా తీసుకురావటంలో నీ వుద్దేశం ఏమిటసలు?" అరిచింది కోపంగా.

"నిన్ను మోసగించానని చెప్పటానికి చింతిస్తున్నాను సుమతీ!" అన్నాడు ఖలీల్ సోఫాలో కూర్చుని.

"సిగ్గులేదూ! ఒక ఆడపిల్లని మోసం చేసింది చాలక మళ్ళీ వాగుతున్నావా?"

"సిగ్గా? అది వుండవల్సింది నీకు, నువ్వు ఆడదానివే కాని, చిన్న పిల్లవుకాదు. పద్దెనిమిదేళ్ళు వుంటాయి నీకు."

"రాజగోపాల్! మర్యాదగా నన్ను మా యింటివద్ద.."

ఆమె మాటలకు అడ్డుపడ్డాడు ఖలీల్.

"సారీ సుమతీ! నా పేరు రాజగోపాల్ కాదు- ఖలీల్. నాది భారతదేశంకాదు- పాకిస్తాన్."

ఉలిక్కిపడింది సుమతి.

"నన్నేం చేస్తావు?" అడిగింది భయంభయంగా.

"నేను గూఢచారిని. నీతో కొంచెం పనివుండి నిన్నిలా తీసుకొచ్చాను."

గూఢచారికి తనతో ఏం అవసరం కలిగింది? పాకిస్తాన్ అంటున్నాడు- భారత ప్రభుత్వానికి తెలిస్తే? ఏదేదో వూహిస్తోందామె.

"కూర్చో సుమతీ!"

సుమతికి వుక్రోషము, ఏడుపు ముంచుకొచ్చాయి. ఏడవటం యిష్టంలేక లేని ధైర్యాన్ని తెచ్చుకుంది. ముందు వెనుకలు ఆలోచించకుండా చెప్పుతీసుకొని ఖలీల్ దవడలు వాయించేసింది.

"నువ్వు గూఢచారివో, గూండావో నా కనవసరం. మర్యాదగా నన్ను వదిలిపెట్టు మా యింటివద్ద!" అంది చెప్పు కాలికి తొడుక్కుంటూ.

"సుమతీ!" గదిలో ప్రతిధ్వనించింది ఖలీల్ అరుపు.

"ఈ గది సవుండ్ ప్రూఫ్. నువ్వు ఏడ్చినా, అరచినా ఎవరికీ తెలియదు చుట్టుపక్కలి యిళ్ళవాళ్ళకు," అంటూ లేచి ఆమె మీదపడ్డాడు.

"ఛీ. వదులునన్ను" అరిచింది, పెనుగులాడింది.

ఖలీల్ మరింతగా విజృంభించాడు. ఆమెని ఎత్తి సోఫా లోకి విసిరాడు.

"నీకు దండం పెడతాను- నన్ను వదిలిపెట్టు!" అంది ఏడుస్తూ.

పకపకా నవ్వాడు ఖలీల్.

"నన్ను చెప్పుతో కొట్టినప్పుడు ఈ ఏడుపుని ఎక్కడ దాచుకున్నావ్?" అంటూ లేచి మీదికిదూకే పులిలా- ఆమె మీదికి దూకాడు.

## 4

అర్ధరాత్రి అయ్యింది.

న్యూ ఐలెండ్ మౌనంగా నిద్రపోతూంది. వెన్నెల ద్వీపమంతా సమంగా కురుస్తుంది. ఆ రోజు పౌర్ణమి కావటంతో ఆహ్లాదకరంగా వుంది వాతావరణం.

పగలంతా కష్టపడిన కూలీలు హాయిగా నిద్రపోతున్నారు గుడారాల్లో.

ప్రఖ్యాత పాకిస్తాన్ రహస్య గూఢచారి రహిమాన్ తన గుడారంలో ఒంటరిగా పడుకునివున్నాడు కేంప్ కాట్ మీద. అతను నిద్రపోవటంలేదు. ఏదో ఆలోచిస్తున్నాడు దీర్ఘంగా. అతని మస్తిష్కంలో ప్రొఫెసర్ జలాలుద్దీన్ డైరీల్లోని విషయాలు మెరిసి- అంతలోనే మాయమై పోతున్నాయి.

గుడారాలకు కావలి కాస్తున్నవాడు, కునికిపాట్లు పడుతున్నాడు ఓ చెట్టుకు ఆనుకుని నిలబడి. వాడి చేతిలో మెషిన్ గన్ వుంది.

స్టీమ్‌బోట్ యింజను ఆఫ్ చేసి, క్రిందికి దిగాడు గఫార్. బోటు అలల తాకిడికి దూరంగా వెళ్ళిపోకుండా ఒడ్డునే

వున్న కొయ్యదిమ్మకు బిగించేశాడు గఫార్.

ఆ స్టీమ్‌బోట్‌లో సుమతి వుంది, కాళ్ళు చేతులు బంధింపబడి. అరవడానికి వీల్లేకుండా నోటికి టేపు అతికించబడివుంది.

సుమతి కట్లు ఊడదీసేసాడు గఫార్. నోటికున్న టేపు కూడా తీసేశాడు.

"దిగు!" అన్నాడు కర్కశంగా.

అప్పటివరకు సముద్రంమీద స్టీమ్‌బోట్‌లో బందీగా ప్రయాణం సాగించిన సుమతి కిక్కురుమనకుండా గఫార్ వెంట నడిచి న్యూఐలెండ్ భూభాగంమీద కాలుపెట్టింది.

కాపలావాడు చూసేశాడు సుమతిని, గఫార్‌ని.

"ఎవరు?" అరిచాడు మెషిన్‌గన్‌ని సరిచేసుకుంటూ.

"సీక్రెట్ ఏజంట్ ఎక్స్ 8" చెప్పాడు గఫార్.

కాపలావాడు కర్రలా బిగుసుకుపోయి, గఫార్‌కి సెల్యూట్ చేసాడు.

సుమతిని తీసుకుని రహిమాన్ వున్న గుడారంలోకి వెళ్ళాడు గఫార్.

మొత్తం ఆరు గుడారాలు.

మిగిలిన ఐదు గుడారాల్లోనూ పాతికమంది కూలీలు నిద్రపోతున్నారు. కాపలా పని మూడు గంటల కొకడు చూస్తాడు. తన షిఫ్టు అయిపోయిన వెంటనే వెళ్ళి మరొకడిని లేపుతాడు. ప్రస్తుతం న్యూ ఐలెండ్ భూభాగంమీద ఇరవై తొమ్మిదిమంది వున్నారు సుమతితో కల్సి.

కూలీల గుడారాల్లో కలకలం బయలుదేరింది. అందరూ నిద్రలేచి సుమతివున్న గుడారంకేసి రాసాగారు.

రహిమాన్ గుడారం వెలుపలికెళ్ళి నిలబడ్డాడు.

"ఆవేశాన్ని అణచుకోండి! గఫార్ ఒకే ఒక యువతిని తీసుకొచ్చాడు. మీ రందరూ జంతువుల్లా ప్రవర్తించారంటే ఆమె చనిపోవటం ఖాయం" అంటున్నాడు రహిమాన్.

కూలీలు విన్పించుకునే స్థితిలో లేరు. వారు స్త్రీ మొఖం చూసి ఆరు నెలలు అయ్యింది. ఆ ద్వీపంమీదే పడివున్నారు, యంత్రాల్లా పనిచేస్తూ. పెద్దగా కేకలు పెడుతూ రహిమాన్ని తోసుకుంటూ గుడారంలోకి జొరబడ్డారు.

అప్పటివరకు ప్రశాంతంగా వున్న న్యూ ఐలెండ్ కేకలతో, ఈలలతో, నవ్వులతో మారుమోగి పోయింది. దిక్కుతోచక గుడారంలోంచి వెలుపలికి వచ్చేసాడు సుమతిని అక్కడే వదిలేసి.

సుమతి అరుపులు హృదయ విదారకంగా విన్పిస్తున్నాయి గుడారంలోంచి.

రహిమాన్ భయపడినంతా జరిగింది చివరికి.

సుమతి ప్రాణాలు గాల్లో కల్సిపోయాయి, రెండు గంటల్లోనే.

## 5

ఏడ్చి ఏడ్చి నిద్రపోయింది వనజ.

నేలమీద పడుకుని అమాయకంగా నిద్రపోతున్న వనజని చూసి నిట్టూర్చింది జుబేదా.

ఆ గదిలో వాళ్ళిద్దరు మాత్రమే వున్నారు.

"వనజా! వనజా!" వనజని తట్టిలేపింది జుబేదా.

ఉలిక్కిపడి, లేచి కూర్చుంది వనజ.

"ఏమిటక్కయ్యా?" అంది.

"ఎలాగైనా ఇక్కణ్నుంచి తప్పించుకోవాలి! ఇద్దరం కల్సి ఆలోచిస్తే ఎవరికో ఒకరికి ఏదో ఒక ఐడియా రాక

పోదు. నువ్వు కూడా ఆలోచించు,'' అని సోఫాలో వెనక్కి వాలింది జుబేదా.

''ఆకలేస్తోందక్కయ్యా!'' అంటూ లేచివెళ్ళి సోఫాలో కూర్చుంది వనజ.

''పిచ్చిపిల్లా! ఇది మన యిల్లు కాదు—''

తలుపు తెరుచుకుంటున్న చప్పుడు విని యిద్దరూ అటు చూశారు.

ఖలీల్ లోపలికి వచ్చాడు.

''మిస్టర్ రాజగోపాల్! మమ్మల్ని ఎందుకిలా మోసచేసి తీసుకొచ్చావు? ఇంకా ఎంతమందిని తీసుకొస్తావు? అడిగింది జుబేదా సాధ్యమైనంతవరకు కోపాన్ని తగ్గిం కుంటూ.

''మిస్ జుబేదా! అయామ్ వెరీ సారీ! నా అసలు పే ఖలీల్. మిగిలిన వివరాలు మరోసారి చెబుతాను. ఇది ఇవి తినండి!'' అంటూ చేతిలోని బిస్కట్ పేకట్లు మీదికి విసిరాడు.

''ఇద్దరికీ చెపుతున్నాను జాగ్రత్తగా వినండి! వి వచ్చిన తర్వాత ఇక్కణ్ణుంచి ఓ అమ్మాయిని తీసుకెళా ఆమె పేరు సుమతి. సుమతి ఇప్పుడెక్కడుందో వి రంటే మీ గుండెలు పగిలిపోతాయి. పిచ్చివేషాలు కుండా వున్నారంటే మీ కొచ్చిన ప్రమాదం ఏంటే

''ఇంతకూ మమ్మల్ని ఏం చేస్తావు?'' సాలో అడిగింది జుబేదా.

''పెళ్ళి'' అని నవ్వి—''పెళ్ళి చేస్తాను మీకు. నమ్మినా నమ్మకపోయినా జరగబోయేది మాత్రం ఇంకా కొందరు యువతులు కావాలి నాకు. యు

సేకరించడం పూర్తయిన వెంటనే మనం ఇక్కడనుంచి వెళ్లిపోతాం! ఈ రోజుకి ఎలాగో బిస్కట్స్‌తో సరిపెట్టుకోండి! రేపటినుంచి మీకు అన్ని సౌకర్యాలు కలిగిస్తాను" అన్నాడు ఖలీల్.

"నాన్ సెన్స్! మా పెళ్లిళ్లు చెయ్యడానికి నీ వెవరు?" అర్చింది జుబేదా.

"సిస్టర్, జుబేదా! రవిని మర్చిపోక తప్పదు నువ్వు—" అంటున్నాడు ఖలీల్.

చిన్నగా ఏడుపు మొదలుపెట్టింది వనజ.

"ఇప్పుడు రాత్రి ఒంటిగంట అయ్యింది. కాసేపు ఏడవటం ఒంటికి మంచిదే! గంటల తరబడీ ఏడవకుండా, అరగంటపాటు యిద్దరూ ఏడ్చుకుని, ఆ తర్వాత నిద్రకు పడండి! గుడ్ నైట్!" అంటూ గదిలోంచి వెళ్ళిపోయాడు ఖలీల్. అతని వెనకే తలుపు మూసుకుంది.

"ఏడవకు వనజా! వీ డెవడో పెద్ద గూండాలా వున్నాడు. తప్పకుండా వీడి పాపం పండిపోతుంది. రవి ఎవరో నీకు తెలియదు కదూ!" అంటూ వనజ కళ్లు తుడిచి, యిలా అంది జుబేదా.

"నా కాబోయే భర్త పేరు రవి. అతను నేను ప్రేమించుకున్నాం. నేను అదృశ్యమైన సంగతి ఇదివరకే అరమై వుంటుంది రవికి. తప్పకుండా అతను పోలీసు రిపోర్టు యిచ్చి వుంటాడు. అదృష్టం కల్సివస్తే ఇక్కణ్ణుంచి పారిపోవటం పెద్ద కష్టమేమీ కాదు. నా మాట విని ఈ బిస్కట్లు తిను___" అంటూ ఏవేవో మాటలతో ధైర్యం చెప్తూ వనజకి కాసిన్ని బిస్కట్లు యిచ్చి, తనూ కొన్ని తిన్నది జుబేదా.

# 6

"కూర్చోండి!" అన్నాడు డిటెక్టివ్ అజిత్.

"నా పేరు రవి. మీ యిద్దరిలో డిటెక్టివ్ అజిత్ గారు ఎవరో నాకు తెలియదు" అన్నాడు రవి, అజిత్ చూపించిన కుర్చీలో కూర్చుని.

అజిత్ చిన్నగా నవ్వి—"నేనే!" అన్నాడు.

"వీరు—" అన్నాడు రవి.

"నా అసిస్టెంట్—పేరు ప్రతాప్" చెప్పాడు అజిత్.

రవి జేబులోనుంచి ఓ కవరుతీసి బల్లమీద పడేశాడు.

"ఇది నాకు ఈ రోజు వుదయం పోస్టులో వచ్చింది' అన్నాడు.

అజిత్ కవరులోని కాగితాన్ని తీసి చదువుకున్నాక యధాప్రకారం కాగితాన్ని కవరులో పెట్టేస్తూ—"డబ అందిందా—ఆ వుత్తరంలో వ్రాసిన ప్రకారం?" అడిగా

తలూపి, పాంటు బాక్ పాకెట్ లోంచి ఓ నోట్ల తీసి, అజిత్ కందించాడు రవి.

పది రూపాయల నోట్లు. అప్పుడే రిజర్వ్ బ్యా నుంచి డ్రాచేసి తీసుకొచ్చినట్టు—చాలా కొత్తగావున్నా నోట్లు.

మొదటి, ఆఖరు నెంబర్స్ చూసి, నోట్లకట్టని రవి కిచ్చేశాడు అజిత్. "అపహరింపబడిన జుబేదా మవుతుంది?" అడిగాడు.

"ఆమె నా ప్రియురాలు" తడబడకుండా చె రవి. "ఇద్దరం ప్రేమించుకున్నాం. మా అమ్మ ఒప్పుకుని వుంటే ఆర్నెల్ల క్రితమే నా అర్ధాం వుండేది జుబేదా."

"మీరు చదువుకుంటున్నారా?" అడిగాడు అజిత్.

రవి ఆశ్చర్యపోయాడు క్షణకాలం. "ఎలా వూహించ గలిగారు నేను స్టూడెంట్ నని!" అడిగాడు తెప్పరిల్లి.

చిన్నగా నవ్వాడు అజిత్.

"ఇంతటి చిన్న విషయాన్నే వూహించి తెల్సుకో లేకుంటే ఈ వృత్తి చెయ్యలేము మేము అట్టేకాలం. మీ మాటల్లో, చూపుల్లో ఉడుకురక్తపు ఛాయలు స్పష్టంగా తెలుస్తూనే వున్నాయి. సహజంగా విద్యార్థుల్లోనే అటు వంటి లక్షణాలు కన్పించేది. మీకు పెళ్ళికాలేదని మీరే చెప్పారు. జుబేదాగారిని చేసుకోలేక పోయారు మీ యింట్లో ఎదిరించి. అంటే ఆర్థికంగా మీరు అస్వతంత్రులు. వ్యాపారమో, వుద్యోగమో వుండివుంటే మిస్ జుబేదా మీ అర్థాంగి అయివుండేది ఏనాడో. మీ వేషాన్ని, మాటల్ని, చూపుల్ని, దృష్టిలో వుంచుకుని హేతు వాదంతో ఆలోచించి చూశాను. అంతే!"

చిన్నగా ఊపిరి పీల్చుకుని, ఒక్కసారిగా వదిలేశాడు రవి.

"జుబేదాని మీరు రక్షించగలరనే నమ్మకం ఏర్పడింది నాకు" అన్నాడు నవ్వుతూ.

"ఇంతకూ మీరేం చదువుతున్నారో చెప్పనేలేదు" నోరు విప్పాడు.

"మెడిసన్—నాలుగో సంవత్సరం" చెప్పాడు రవి.

ఆ ఉత్తరం, డబ్బు అతనికెలా అందాయో అడిగి తెల్సుకున్నాడు అజిత్. ఇంకా కొన్ని సంగతులు అడిగి తెల్సుకున్నాడు. జుబేదా చిరునామా, రవి చిరునామా తీసుకుని, రవిని పంపేశాడు.

రివాల్వింగ్ ఛెయిర్‌లో వెనక్కి వాలి కళ్ళు మూసుకున్న అజిత్‌ని పలకరించలేకపోయాడు ప్రతాప్.

# 7

కాలింగ్ బజర్ "బర్ర్" మంటూ మ్రోగింది.

అజిత్, ప్రతాప్ వైపు చూశాడు.

గదిలోంచి బయటికెళ్ళి, ఇన్‌స్పెక్టర్ ప్రవీణ్‌ని వెంట బెట్టుకొచ్చాడు ప్రతాప్.

"అజిత్ జీ! విచిత్రమైన ఓ కేసులో మీ సహాయం కోసం వచ్చాను" అన్నాడు ప్రవీణ్, అజిత్ చూపించిన కుర్చీలో కూర్చుంటూ.

"చెప్పండి!" అన్నాడు అజిత్, సిగరెట్ వెలిగించుకుని ప్రవీణ్‌కి ఆఫర్ చేస్తూ.

"రాజగోపాల్ అనే వ్యక్తి వనజ అనే ఒక యువతిని తన వెంట తీసుకెళ్ళాడు. ఆమె అతని వెంట యిష్టపడి వెళ్ళలేదని ఆమె తరఫువాళ్ళు చెప్తున్నారు. సహజంగా కిడ్నాప్‌లు డబ్బుకోసం జరుగుతాయి. ఈ కేసు అందుకు పూర్తి విరుద్ధం. కిడ్నాప్ చేసిన ఆ వ్యక్తి ఆమె తరఫు వాళ్ళకు కొంత డబ్బు పంపాడు. అతను పాత నేరస్తుడు కాదు—" అంటున్నాడు ప్రవీణ్.

"పాత నేరస్తుడు కాదని మీకెలా తెల్సింది?" అడిగాడు అజిత్.

"అతను పంపిన వుత్తరం మీద, నోట్ల కట్టమీద వేలి ముద్రలు దొరికాయి. వాటిని పరిశీలించాము," చెప్పాడు ప్రవీణ్.

తల పంకించి, తర్వాత చెప్పమన్నట్లు చూశాడు అజిత్.

"అంతే! ఈ కేసులో మీ సహాయం కావాలి!"

"మిస్టర్ ప్రవీణ్! ఇలాంటి కేసులే నావద్దకు ఇప్పటికి రెండు వచ్చాయి" అంటూ సుమతి, జుబేదా కేసుల వివరాలు చెప్పాడు.

"మైగాడ్!" ఆశ్చర్యపోయాడు ప్రవీణ్.

బల్లమీదున్న ఫోన్ మ్రోగింది.

అజిత్ రిసీవర్ ఎత్తుకుని—"యస్!" అన్నాడు.

"డిటెక్టివ్ అజిత్ గారితో మాట్లాడాలి!" అంటున్నాడు అవతలి వ్యక్తి.

"మీకు కావల్సిన వ్యక్తినే మాట్లాడుతున్నాను" అన్నాడు అజిత్.

"అజిత్ జీ! నా పేరు సారధి. ఈరోజు వుదయం నా చెల్లెలు అపహరింపబడింది. నేను కాస్త పనుండి బజారు కెళ్ళి వచ్చేసరికి—"

"మీ చెల్లెలు పేరు?"

"వాణి."

రెండు నిమిషాలు మాట్లాడి రిసీవర్ పెట్టేశాడు అజిత్.

"తిరిగి మరో యువతి మాయమైంది. ఈమె తరఫు వాళ్ళకు కూడా అందరికీ అందినట్టే డబ్బు, వుత్తరం అందాయి—"

"ఎవరతను? ఆమె పేరేమిటి?"

"అతను అంటే నాకు ఫోన్ చేసిన అతనా?" అడిగాడు అజిత్.

అవునన్నట్లు తలూపాడు ప్రవీణ్.

"అతని పేరు సారధి. అతని చెల్లెలు పేరు వాణి. వాణి మాయమైంది. రాజగోపాల్ పేరు మీద వుత్తరం,

డబ్బు అందాయి సారధికి. అందరికిలాగే ఆ వుత్తరంలో తాము ప్రేమించుకొని దూరంగా వెళ్ళిపోతున్నామని వుందట."

"అజిత్ జీ! నా బుర్ర వేడెక్కిపోతోంది ఈ కేసుని తల్చుకుంటుంటే. ఎలా ప్రొసీడ్ కావాలో అంతుబట్టడం లేదు. ఇంకా ఎంతమంది యువతుల్ని ఆ రాజగోపాల్ మాయంచేస్తాడో వూహించలేను. కమీషనర్ వరకు ఈ విషయం వెళ్ళకముందే రాజగోపాల్ని పట్టుకోవాలి నేను. దయచేసి నాతో కల్సి పని చెయ్యమని అడుగుతున్నాను," అని మౌనం వహించాడు ప్రవీణ్.

"ఈ కేసులో మీతో కల్సి పని చెయ్యటానికి నాకెటువంటి అభ్యంతరమూ లేదు," చెప్పాడు అజిత్.

"థాంక్స్! ఇపుడు నేనేం చెయ్యాలో చెప్పండి!" బల్లమీద కాస్త ముందుకు ఒంగాడు ప్రవీణ్.

"మిస్టర్ ప్రవీణ్! యువతుల్ని మాయంచేస్తున్న ఆ వ్యక్తిని పట్టుకునే బాధ్యత నేను వహిస్తాను. అతను పారిపోకుండా చూసుకునే బాధ్యత మీది."

"మీరు చెప్పేది నాకు సరిగా అర్థంకావటం లేదు అజిత్ జీ! అతను ఎక్కడున్నాడని? ఎప్పుడు పారిపోతాడని?" అడిగాడు ప్రవీణ్.

"మిస్టర్ ప్రవీణ్! తన పేరు రాజగోపాల్ అని వుత్తరంలో వ్రాశాడతను. అతని అసలు పేరు అది అవునో కాదో మనకు తెలియదు. మనకతను పట్టుబడనంత వరకు అతని పేరు అదే అనుకుందాం. ఉదయం పది గంటల ప్రాంతంలో వాణి అనే యువతిని అపహరించిన రాజగోపాల్ ఇప్పుడప్పుడే మద్రాస్ వదిలి వెళ్ళివుండడు. మిస్టర్ ప్రవీణ్! ఈ నిమిషంనుంచి జాగ్రత్తగా కాపలా

కాయండి. మద్రాస్‌నుంచి వెళ్ళే అన్ని రూట్లూ వెయ్యి కళ్లతో గమనిస్తుండాలి మీ శాఖ. పటిష్టమైన మీ కాపలా ఏర్పాట్లు చూసి రాజగోపాల్ కొద్ది రోజుల పాటు మద్రాస్‌లోనే వుండిపోతాడు. అపుడు మనకు తగినంత సమయం వుంటుంది_అతన్ని పట్టుకోవడానికి," అంటూ ప్రవీణ్‌కి ఏవేవో ఆదేశాలివ్వసాగాడు డిటెక్టివ్ అజిత్.

# 8

రాధ ఒంటినిండా సబ్బు రాసుకుంది. వీపు సరిగా అందటం లేదు చేతులకు. ఎలాగో తంటాలు పడుతోంది.

"రాధా!"

తృళ్ళిపడింది రాధ. అమ్మ పిలుస్తోంది అనుకుంటూ గబగబ స్నానం పూర్తిచేసుకుంది.

"ఈ రోజుకు కాదేమిటే?"

"ఇదిగో_వచ్చేస్తున్నా!" అరిచి చెప్పింది రాధ. గబ గబ ఒంటిమీదున్న నీళ్ళ తేమని టర్కీ_టవల్‌తో తుడుచుకుని, కట్‌డ్రాయర్ వేసుకుంది. టవల్‌ని ఒంటినిండా చుట్టుకుని, బాత్రూంలోంచి బయటపడింది.

"నీకోసం ఎవరో వచ్చారు. హాల్లో కూర్చోబెట్టాను" చెప్పింది రాధ వాళ్లమ్మ శాంతమ్మ.

హతోస్మి! తను సినిమాకెళ్లాలని అనుకుంది. ఇదే సమయానికి ఎవరో వూడిపడటం_నిజంగా ఇది తన అదృష్టమే! వచ్చింది మరో ఆడో మరి! అనుకుంటూ__

"ఎవరమ్మా, ఆ వచ్చిన పుణ్యాత్ములు?" అడిగింది రాధ తల్లిని.

"ఎవరో డాక్టరట."

తర్వాత మాట్లాడలేదు రాధ. వంట గదిని ఆనుకుని వున్న తన గదిలోకి వెళ్ళి, పది నిమిషాల్లో ముస్తాబు ముగించుకుని, హాల్లోకి వెళ్ళింది.

"నమస్తే! నేనే రాధని." అంది హాల్లో కుర్చీలో కూర్చునివున్న ఖలీల్ ని చూస్తూ.

ఖలీల్ ప్రతి నమస్కారం చేశాడు.

"సిస్టర్! నువ్వు నన్ను క్షమించాలి!" అన్నాడు దీనంగా మొఖం పెట్టి.

"విషయం ఏమిటో చెప్పండి తప్పకుండా క్షమిస్తాను" అంది రాధ నవ్వేసి.

"లేడీ డాక్టర్ సునంద గంట క్రితం నా కారు క్రింద పడింది. ప్రమాదం వెంట్రుక వాసిలో తప్పిపోయింది."

"ఇపుడెలా వుంది సునందగారికి?" ఆత్రుతగా అడిగింది రాధ.

"పెద్ద ప్రమాదం ఏం జరగలేదు దేవుని దయవల్ల· స్పృహలోకి వచ్చి నీ పేరు చెప్పి పంపింది నన్ను."

"ఇంతకూ సునందగారు ఇపుడు ఏ హాస్పిటల్లో వున్నారు?"

"నా డిస్పెన్సరీలోనే వున్నారమ్మా! నేను డాక్టర్ని. అడయార్ లో వుంటున్నాను" చెప్పాడు ఖలీల్.

రాధ జనరల్ హాస్పిటల్లో నర్సుగా వుంటోంది. లేడీ డాక్టర్ సునంద అదే హాస్పిటల్లో ఐ స్పెషలిస్ట్. సునంద సహాకారంతోనే రాధ నర్సు కాగలిగింది.

"మీ పేరు?" అడిగింది రాధ.

"శ్రీనివాస్."

"పదండి!" రాధ గుమ్మంవైపు నడిచింది,

ఖలీల్ ఆమె వెనకే వెళ్లాడు.

కాఫీ కప్పులతో హాల్లోకొచ్చిన శాంతమ్మకి కూతురు గాని, కొత్త వ్యక్తిగాని అగుపించలేదు. ఆశ్చర్యపోతూ వీధివరండాలోకెళ్ళి నిలబడి, వీధి చివరికంటూ చూసింది శాంతమ్మ.

ఖలీల్, రాధ వెళ్తున్న ఫియట్ కారు వీధి మలుపు తిరుగుతోంది అప్పుడే.

ఏదో గొణుక్కుంటూ ఇంట్లోకొచ్చేసింది శాంతమ్మ.

ఆదివారం కావటంతో సినిమా కెళ్ళాలని ప్రోగ్రాం వేసుకున్న రాధ, ఖలీల్ చేతిలో చిక్కిపోయింది.

"శ్రీనివాస్‌గారూ!" పిల్చింది రాధ.

"ఏమిటమ్మా!" అన్నాడు ఖలీల్ వెనుదిరిగి చూడకుండా. డ్రైవింగ్ మీదే వుందతని దృష్టి మొత్తం.

"మీకు డ్రైవింగ్ సరిగా రాదా?" అడిగింది రాధ.

ఖలీల్ నవ్వి, "పది సంవత్సరాలనుంచీ నాకు కారు వుందమ్మా!" అన్నాడు.

"అయితే సునందగారి మీదికి కావాలనే కారు నడిపారా?"

"నువ్వు పొరబడుతున్నావమ్మా! తప్పు నాదికాదు. పరధ్యానంగానడుస్తూ ఆవిడే నా కారు క్రిందపడింది.'

రాధ ఏదో మాట్లాడబోయి, ఆగిపోయింది - కారు ఓ ఆవరణంలోకి తిరిగే సరికి.

ఖలీల్ క్రిందికి దిగాడు.

తోటలో నవ్వుతున్న గులాబీలను చూసి, అటువైపు నడిచింది రాధ. ఒక గులాబీని కోసుకుని వాసన చూసింది.

పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ వెళ్తున్నాడు ఖలీల్.

అతని వెనకే పరుగెత్తింది రాధ మేడమీదికి.

“సునందగారిని గదిలోవుంచి తాళం వేశారా?” అ
గింది రాధ, గది తాళం తీస్తున్న ఖలీల్ ని చూస్తూ.

బదులు చెప్పలేదు ఖలీల్. ఒకచేత్తో తలుపు తెరి
పట్టుకుని, రెండోచేత్తో రాధ మెడమీద చేయివేసి గ
లోకి తోశాడు.

విసురుగా వెళ్ళి నిలదొక్కుకోలేక తూలిపడిపోయిం
రాధ, సోఫాకి కాస్త దగ్గరగా. వెంటనే లేచి నిలబడ
దామె, శ్రీనివాస్ ఎందుకు తోశాడోనని ఆలోచిస్తూ.

“ఇలా వచ్చి కూర్చో! మేమూ నీలాగే మో
పోయాము” చెప్పింది జుబేదా. జుబేదాతోపాటు
గదిలో మరో ముగ్గురు యువతులున్నారు. ఆశ్చర్యం
చూస్తూ వాళ్ళవైపు సాగింది రాధ.

# 9

“శాంతమ్మగారికి__

రాధ నేను లేచిపోతున్నాము. మా కోసం వెతి
ప్రయత్నాలు చెయ్యకండి! ఎప్పుడో తిరిగివచ్చి మిమ
చూడగలము. అప్పటివరకు మీరు మౌనంగా వుం
మీకే మంచిది. ఈ విషయాన్ని నలుగురికీ చెప
అల్లరి పడకండి! అలాచేస్తే నవ్వులపాలు అయ్యేది :

శ్రీనివ

ఉత్తరాన్ని మడిచి బల్లమీద పడేశాడు ప్రతా
అజిత్, శాంతమ్మ మొఖంలోకి చూశాడు.

“ఈ వుత్తరంతోపాటు ఏదైనా డబ్బు అ
మీకు?”

తల అడ్డంగా వూపింది శాంతమ్మ.

"ఎవడో కుర్రాడు తెచ్చి ఈ కాగితం యిచ్చాడు నాయనా! ఏం చెయ్యాలో తోచక పక్కింటి ఆసామిని అడిగేసరికి మీ పేరు చెప్పి పంపించాడు" అంటూ ఆ సాయంత్రం డాక్టర్ శ్రీనివాస్ అనే యువకుడు తన యింటికి రావటం, రాధ అతని వెంట వెళ్ళిపోవటం వివరంగా చెప్పిందామె.

నాలుగైదు ప్రశ్నలు అడిగి శాంతమ్మకి ధైర్యం చెప్పి, పంపేశాడు అజిత్.

"ప్రతాప్! ఈ శ్రీనివాస్‌కి ఆ రాజగోపాల్‌కి ఏదైనా సంబంధం వుందంటావా?" అడిగాడు అజిత్ కుర్చీలో వెనక్కి వాలుతూ.

"ఎంతమాత్రం లేదు" అన్నాడు ప్రతాప్.

"పొరబడుతున్నావు ప్రతాప్! ఈ శ్రీనివాసే ఆ రాజగోపాల్. కాస్త లోతుకు దిగి ఆలోచించు. రాజగోపాల్, శ్రీనివాస్ ఒకే వ్యక్తి అనే దృష్టితో ఆలోచించు."

కాసేపు బుర్రకి పదును పెట్టాడు ప్రతాప్.

"ఏం అంతుబట్టడంలేదు" అన్నాడు చివరికి.

అజిత్ కళ్ళు మూసుకుని చెప్పసాగాడు.

"మద్రాసులో యువతుల్ని మాయం చేస్తున్న వ్యక్తి పేరు రాజగోపాల్ అని తెల్సు మనకు, అతని అసలు పేరు వేరే ఏదో వుండొచ్చు! ఇక్కడ అప్రస్తుతం. రాజగోపాల్ యువతుల్ని మాయం చేస్తున్నాడు ఎందుకో పెళ్ళి చేసుకోవడానికంటూ వుత్తరాల్లో తెలియజేశాడు. సుమతి మొదలుకుని వాణివరకు ఆయా యువతులకు సంబంధించిన వాళ్ళకి వుత్తరాలతోపాటు డబ్బు కూడా పంపాడు. శాంతమ్మకి డబ్బు పంపలేదు రాజగోపాల్, ఎందుకు?

శాంతమ్మ రాజగోపాల్ ని చూసేసింది. అతని ఆకారము ఇంకా కొన్ని వివరాలు తెల్సిపోయాయి శాంతమ్మకి, చిన్న ట్రిక్ చేశాడు రాజగోపాల్, తను ఎంత వద్దని వుత్తరాల ద్వారా వారించినా, తను అపహరించిన యువతుల తరఫు వాళ్ళు డిటెక్టివ్ ల సహాయమో, పోలీసుల సమాచారమో తీసుకుంటారని తెల్సు రాజగోపాల్ కి మనల్ని తికమక పెట్టాలని అలా చేశాడు. అంతే!'' అని కళ్ళు తెరిచాడు అజిత్.

''రాజగోపాల్ ఏ క్షణంలో ఏ యువతిని అపహరిస్తాడో అర్థం కావటం లేదు—'' అంటున్నాడు ప్రతాప్.

''ప్రతాప్! రాజగోపాల్ సాధారణమైన నేరస్తుడు అయివుండడు. అయివుంటే ఇంత విచ్చల విడిగా డబ్బు వెదజల్లడు. నా అనుమానం నిజమైతే అతని వెనక ఏదో పెద్ద పథకం వుంది. అదేమిటో తెల్సుకోవాలి మనం. మద్రాసులోని యువతుల్ని అందరినీ కాపాడ్డానికి ప్రయత్నించేకంటే రాజగోపాల్ ని పట్టుకోవటానికి శ్రమించడం వుత్తమం. అతను పట్టుబడితే అతని పథకం నిల్చిపోవటంతోపాటు అదేమిటో కూడా తెల్సిపోతుంది—'' అని ఆగాడు అజిత్.

''ఆడవాళ్ళని అమ్మే వ్యాపారానికి సంబంధించిన ముఠా వాడేమో రాజగోపాల్?'' తన అనుమానాన్ని బయటపెట్టాడు ప్రతాప్.

''నీ అనుమానం సరైనది కాదు. అటువంటి ముఠాకు సంబంధించినవాడై వుంటే డబ్బు ఎందుకు పంపుతాడు?''

నిజమే! తను ఆ పాయింటు మర్చిపోయాడు. తీవ్రంగా చాలా తీవ్రంగా ఆలోచనల్లో మునిగిపోయాడు ప్రతాప్.

## 10

రిజర్వు బ్యాంక్ లోంచి వెలుపలికి వచ్చాడు ప్రతాప్. టాక్సీ ఎక్కి జార్జిటౌన్ చేరుకున్నాడు. మింట్ స్ట్రీట్ లో ఓ యింటి ముందుకెళ్ళి తలుపు తట్టాడు.

సేఠ్ ధర్మిచంద్ తలుపు తీశాడు. ప్రతాప్ ని చూస్తూ- "ఎవరు మీరు?" అన్నాడు.

"ధర్మిచంద్ మీరేనా?" ప్రతాప్ అడిగాడు.

తలూపాడు ధర్మిచంద్.

"నా వెంట పోలీస్ స్టేషన్ కి రావాలి మీరు," చెప్పాడు ప్రతాప్, ధర్మిచంద్ ని పరిశీలనగా చూస్తూ.

ధర్మిచంద్ బెదిరిపోయాడు.

"ఇంతకూ మీ రెవరు?" అన్నాడు తడారిన గొంతుతో.

"ప్రయివేట్ డిటెక్టివ్ ని. నా పేరు ప్రతాప్."

"ప్రతాప్ జీ! లోపలికి రండి! వివరంగా మాట్లాడుకోవచ్చు" అంటూ వెనుదిరిగాడు ధర్మిచంద్.

ప్రతాప్, ధర్మిచంద్ ని అనుసరించాడు. ఇద్దరు మేడ మీదికి చేరుకున్నారు.

"కూర్చోండి ప్రతాప్ జీ!" అన్నాడు ధర్మిచంద్ ఓ గదిలోకి వెళ్ళిన తర్వాత ప్రతాప్ కి కుర్చీ చూపిస్తూ.

ప్రతాప్ కూర్చున్నాడు. ఎదురుగా నున్న కుర్చీలో ధర్మిచంద్ ని కూర్చోమని చెప్పి-"మీరు పోయిన నెల అంటే ఆగస్టు పదిహేనవ తారీఖున రిజర్వ్ బ్యాంకునుంచి మూడు లక్షల రూపాయలు డ్రా చేశారు. ఆ డబ్బు ఏం చేశారు?" అడిగాడు కర్కశంగా.

"వ్యాపారంలో పెట్టాను."

"వివరంగా చెప్పండి!"

చెప్పాడు ధర్మిచంద్.

"ప్రతాప్ జీ! ఖలీల్ అనే వ్యక్తి నా వద్దకు కొన్ని వజ్రాలు తీసుకొచ్చాడు. డబ్బు యిచ్చి అతనివద్ద వజ్రాలు కొనుక్కున్నాను. అలా చెయ్యటం నేరం కాదు."

"నాన్ సెన్స్! అధిక ప్రసంగం మాని ఖలీల్ ఎడ్రస్ చెప్పండి!"

"సారీ ప్రతాప్ జీ! మా బిజినెస్ టరమ్స్‌లో అది చెప్పటానికి లేదు. ఆ విధంగా ప్రమాణాలు చేసుకున్నాం మేము."

"సేఠ్ జీ! మీరు యిచ్చిన డబ్బుతో ఖలీల్ కొన్ని నేరాలు చేశాడు. అవి మీకూ చుట్టుకోక మునుపే అతని ఎడ్రస్ చెప్పండి!"

ధర్మిచంద్ విధిలేనట్లు నోరు తెరిచాడు.

"నా యింట్లోనే వుంటున్నాడు ఖలీల్. అడయార్‌లో వుంది ఆ యిల్లు. ఆ యింటిని అతనికి నేనే అమ్మాను."

ధర్మిచంద్‌ని యింకా ఏవో రెండు మూడు ప్రశ్నలు అడిగి, ఆ యింట్లోంచి బయటపడ్డాడు ప్రతాప్.

* * * *

కుర్చీలో కూర్చునివున్న ఖలీల్ చెంప ఛెళ్ మంది.

"చెప్పు! సుమతిని ఏం చేశావు?" అడిగాడు ప్రతాప్.

ఖలీల్ సమాధానం చెప్పలేదు.

తిరిగి బలంగా చెంపమీద కొట్టాడు ప్రతాప్. "ఇంతటితో వదిలెయ్యము. చిత్రహింసచేసి అయినా సరే నీ నోటి వెంట నిజం పలికిస్తాము. ఏం చేశావు సుమతిని? నీవు అప

హరించిన యువతులందరూ వున్నారు. సుమతి మాత్రమే లేదు. ఊఁ! మాట్లాడు."

అప్పటికీ నోరెత్తలేదు ఖలీల్.

తిరిగి చేయి ఎత్తాడు ప్రతాప్.

"అతన్ని కొట్టి నిజం చెప్పించలేవు ప్రతాప్! నీలాగే శిక్షణపొందివున్న గూఢచారి అతను" అజిత్ చెప్పాడు.

"అతను గూఢచారా?" ఇన్‌స్పెక్టర్ ప్రవీణ్ ఆశ్చర్య పోయాడు.

అవుననట్లు తలూపాడు అజిత్.

"ప్రతాప్! వచ్చి కూర్చో!"

అజిత్ మాట కెదురు చెప్పలేక వెనుదిరిగాడు ప్రతాప్.

ఆ గదిలో యింకా కమీషనర్ ఆఫ్ పోలీస్, మరో ఇద్దరు అధికారులు వున్నారు.

"మిస్టర్ ఖలీల్!" నెమ్మదిగా పిలిచాడు అజిత్.

అజిత్ వైపు చూశాడు ఖలీల్.

"మీరు ఆరితేరిన గూఢచారులు. బెదిరింపులకు, దెబ్బలకు లొంగడు గూఢచారి. ఆ సంగతి నాకు తెల్సు. దయ చేసి ఒకే ఒక ప్రశ్నకు సమాధానం యివ్వండి! సుమతిని ఏం చేశారు?" అడిగాడు అజిత్.

"మిస్టర్ అజిత్!" ఖలీల్ నోరు విప్పాడు. "మిమ్మల్ని చూడటం యిదే ప్రథమం. ముందు నా ప్రశ్నలకు మీరు బదులివ్వండి! నేను ఎక్కడా ఎటువంటి పొరపాటూ చెయ్యలేదు. మీరు, నేను యువతుల్ని దాచిన యింటి నెలా కనుక్కోగలిగారో ఎంత వూహించినా అర్థం కావడం లేదు. అభ్యంతరం లేకుంటే చెప్పండి!"

"మిస్టర్ ఖలీల్! మీరు యువతుల్ని మాయంచేస్తూ పంపిన నోట్లకట్టలు మా చేతుల్లో పడ్డాయి. వాటిని దృష్టిలో వుంచుకుని ఆలోచించాము. ఆడవాళ్ళని అదృశ్యం చేస్తున్న ఆ వ్యక్తికి పెద్ద పెద్ద బ్యాంకుల్లో అకౌంటు వుండి వుంటుందని తీర్మానించుకున్నాం. మీరు పంపిన నోట్లు చూసి, ఆ సీరియల్ నెంబర్ మీద సేట్ ధర్మిచంద్‌కి మూడు లక్షల రూపాయలు యిష్యూ చేసినట్టు రిజర్వ్ బ్యాంక్ వాళ్ళు చెప్పారు. ధర్మిచంద్‌ని బెదిరించేసరికి మీ చిరునామా బయటపడింది."

"దట్సాల్ రైట్! నన్నేం చేస్తారు? చంపేస్తారా?" అడిగాడు ఖలీల్.

తల అడ్డంగా వూపాడు అజిత్.

"సుమతిని ఏం చేశారో చెప్పండి!" అన్నాడు.

ఒక్క క్షణం ఆలోచించి, "సుమతిని న్యూ ఐలెండ్‌కు పంపించాను..." అంటూ అన్ని విషయాలు వివరంగా చెప్పాడు ఖలీల్.

"కమీషనర్‌జీ! తగిన బందోబస్తులో వెళ్లి న్యూ ఐలెండ్ భూభాగం మీదున్న శత్రువుల్ని వెంటనే కస్టడీలోకి తీసుకోండి మీరు. ఆ న్యూ ఐలెండ్ మన సరిహద్దుల్లోనే వుంది. సో–దానిమీద పాకిస్తానీయులకు ఎటువంటి హక్కూ లేదు–" అని చెప్పాడు అజిత్.

"ఇంతకూ ఆ ద్వీపం ప్రత్యేకత ఏమిటి అజిత్‌జీ!" అప్పటివరకు మౌనంగా వున్న ఇన్‌స్పెక్టర్ ప్రవీణ్ అడిగాడు.

"ఆ ద్వీపంనిండా వజ్రాల గనులు వున్నాయని తన పరిశోధనలో కనుక్కోగలిగాడు ప్రొఫెసర్ జలాలుద్దీన్.

అతను యిపుడు జీవించిలేదు. ప్రొఫెసర్ జలాలుద్దీన్ డైరీల సహాయంతో పాకిస్తాన్ ప్రభుత్వం పెద్ద పథకాన్ని తయారుచేసింది. న్యూ ఐలెండ్‌లో దొరికే వజ్రాల్ని అమెరికాకి ఎగుమతిచేసి, అక్కడనుంచి యుద్ధ పరికరాల్ని తెప్పించుకుని_తిరిగి మరోసారి మన దేశంమీద విరుచుకు పడాలని పన్నాగం పన్నింది పాకిస్తాన్. అయినా నీతి ముందు అవినీతి ఎప్పుడూ ఓడిపోతూనే వుంటుంది_" అని ఆ గదిలోంచి బయటికి నడిచాడు డిటెక్టివ్ అజిత్. ★

—: ఐపోయింది :—

# హత్యచేసి చూడు!

## కంచర్ల రమణ

"మిస్ లీనా బేబీ!" నా స్వరంలో అనురాగం ఒలక బోస్తూ అన్నాను ఫోనులో.

"యస్ సార్" అంది లీనా ఆ వైపు నుంచి. ఆమె నే నుంటున్న హోటల్ ఎల్లో యెక్స్టసీ రిసెప్షనిస్టు.

"'యస్ సార్' అంటున్నావు. నేనెవర్నో పోల్చుకున్నావా బేబీ?" అన్నాను, మేటింగ్ సమయంలో పక్షిలా తీయగా.

"అదేమిటి సార్! పోల్చుకోకపోతే 'యస్ సార్' అని ఎందుకంటాను తెలిసినట్టు!...మీరు ఫేమస్ క్రైం కథా రచయిత మిస్టర్ వినాశ్. రూం నెంబరు ముప్పై మూడు నుంచి మాట్లాడుతున్నారు...మీకు ఆకలి బాగా వేస్తోంది.

హోటల్ బాయ్‌ద్వారా డిన్నరు పంపించమంటారు... అవునా?" అంది చిలకలా కిలకిల నవ్వుతూ.

"వెరీగుడ్ బేబీ! ప్రొప్రయిటర్ రమాకాంతం నిన్నెందుకు వదలడం లేదో నా కర్థమయింది." అన్నాను, మెచ్చుకోలుగా.

"థేంక్యూ సార్! థేంక్యూ" అంది లీనా ఫోను పెట్టేస్తూ.

హోటల్ రూం సర్వీసు కోసం ఆమెకు నేను ఫోను చేసినప్పుడల్లా యీ తతంగం జరుగుతుంది.

హోటల్ ఎల్లో యెక్స్‌ప్రెసీలో నాలా పెర్మనెంట్‌గా వుండే కస్టమర్స్ గొంతుకలన్నీ మిస్ లీనాకు పరిచితమే. ఫోనులో మా గొంతుకలు మ్రోగగానే, మేమెవరమో పోల్చుకోగలదు.

అయితే, నేను ఫోను చేసినప్పుడల్లా 'నన్నూ పోల్చుకున్నావా బేబీ?' అని నేను అడగడంలో స్వార్థం, గడుసుతనం ఉన్నాయి. నేను ఆర్డర్ చేసిన సరుకు నాకే చేరడం ఒకటి. యింకొకరికి అందిన సర్వీసుకు నా ఖాతాలో కర్చు బడకుండా జాగ్రత్తపడ్డం రెండు. మూడు కాస్త కాలక్షేపం.

డిన్నరుకోసం ఎదురు చూస్తుంటే, నా కళ్ళల్లో లీనా రూపం ఆడింది. ఒంటి మీద బట్టలు లేకుండా, పెద్ద వత్తాలతో నా ప్రక్కలో కదులాడే ఆమె శరీరం సాక్షాత్కరించింది నా కళ్ళముందు.

నా ఒళ్లు ఒక్కసారిగా వెచ్చగాఅయిపోయినట్టయింది. నరాల్లో టెన్షన్, ఆమె కావాలన్న తపన ఉధృతమైంది.

మళ్ళా ఫో నెత్తాను. లీనా అటువైపునుంచి పలికింది,

"ఇవాళ కొంచెం ఓవర్ టైం చెయ్యగలవా బేబీ?" అన్నాను.

'ఓవర్ టైం' అంటే అర్థం ఆమెకు తెలుసు.

"ఇవాళా?..." అంటూ ఆగిపోయింది, ఆలోచిస్తున్నట్టు.

అలా ఆగిపోతే, దాని అర్థం నాకు తెలుసు. రాత్రికి నా ప్రక్కలో పొర్లి, వందరూపాయలు కొట్టుకు పోవడానికి ఆమె సిద్ధమే!

ఆమెకు అర్జంటు పనులేమన్నా ఉంటే 'ఓవర్ టైం' పేరెత్తగానే, చప్పున చెప్పేసేది, తనకున్న ఎంగేజ్ మెంట్స్ గురించి.

"మా ఫాదరు అర్జంటుగా రమ్మన్నారు డ్యూటీ అయిపోయిన వెంటనే...అయినా ఫరవాలేదు...ఏదో చెప్తాను లెండి" అంటూ ఫోను పెట్టేసింది.

ఆమె అలా అనడం మామూలే!

రూం సర్వీసు కుర్రాడు తెచ్చిన డిన్నరు తింటున్నానన్న మాటేగాని, లీనా గురించే ఆలోచిస్తున్నాను.

పచ్చని ఒళ్ళు, బంగారపు బంతుల్లాంటి ఆమె వక్షాలు, తల్చుకుంటుంటే, ఆగలేనేమోననిపిస్తోంది, ఆమె వచ్చేంత వరకు.

ఇంకో గంటకుగాని ఆమె డ్యూటీ అయిపోదు. ఆ తరువాత ఆమె తిన్నగా నా గదికే వచ్చేస్తుంది. అయితే, అంతవరకూ, నరాల్ని కండిషనులో వుంచాలి.

డిన్నరు పూర్తయింది. డిన్నరు పూర్తయ్యాక, కాఫీ త్రాగడం అంటే నాకు మహా యిష్టం. బాయ్ తెచ్చిన కాఫీ కూడా త్రాగాక, రోత్ మన్స్ సిగరెట్టు వెలిగించి కాలుస్తూ, గదిలో పచార్లు చెయ్యసాగాను.

భోజనం చేసిన వెంటనే కొంతమందిలా 'అమ్మయ్య' అని అనుకుంటూ ప్రక్కమీదో, వాలు కుర్చీలోనో జేరగిల బడడం అంటే నాకు అసహ్యం.

కడుపులో భోజనం సర్దుకుని, జీర్ణం అయేందుకు వీలుగా పావుగంటయినా బయటకుపోయి నడవడమో, అది వీలు గాక పోతే, గదిలో పచార్లు చెయ్యడమో ప్రాక్టీసు చేసాను ఏళ్ళబట్టి.

అందుకే నాకు యేభై దాటుతున్నా, బొజ్జగాని, ఊబ శరీరంగాని రాలేదు.

లీనా వచ్చేంతవరకూ పచార్లు చేస్తూ, ఆమెను నా ఆలో చనల్లోంచి తప్పించడానికి నిశ్చయించుకున్నాను.

"మర్డర్ ఈజ్ ఎ గేమ్" అన్న నవల రాసి ప్రచురణ కర్తలకు పంపి నెలరోజులయింది. నా పుస్తకం ఆమోదించ బడినట్టు వారి వద్దనుంచి వర్తమానం ఎప్పుడొస్తుందా అని నెర్వస్‌గా ఎదురు చూస్తున్నాను.

"మాకో నవలరాసి పంపరూ!" అంటూ ఉత్తరాల మీద ఉత్తరాలు రాస్తారు ప్రచురణ కర్తలు. నా రచనల్ని వాళ్ళు తిరస్కరించడమంటూ వుండదు, యెప్పుడూ.

అయినా మనస్సులో ఏదో మూల బితుకు; నా రచన్ని తిప్పి కొడతారేమోనని.

కాని అలాంటి బెదురుండడం రచయితకు ఎంతో మేలు. ఒళ్ళు దగ్గర పెట్టుకుని రచనలు సాగిస్తాడు.

ఈ నెల రోజులు ఆ నవల రాసినప్పటి అలుపు తీర్చు కోవడంలో గడిపేసాను. త్వరలో ఇంకో నవల మొదలు పెట్టాలనుకున్నాను.

ఈసారి మాస్టర్ పీస్ రాయాలి. సంవత్సరం అయినా, మంచి ఇతివృత్తాన్ని ఎన్నుకుని మరీ రాయాలి.

దీర్ఘాలోచనలో పడి గదిలో పచార్లు చేస్తున్నాను.

తలుపుమీద టకటకమని చప్పుడు అయ్యింది. లీనాను నేను రమ్మన్న విషయం గుర్తొచ్చింది.

రిస్టువాచీ చూసుకొన్నాను. తొమ్మిదయింది.

"కమిన్" అన్నాను.

మొహమంతా నవ్వులతో లీనా లోనికొచ్చింది, తలుపు తెరుచుకుని.

"వెరీ నైస్ ఆఫ్ యూ. యూ హేవ్ కమ్." అన్నాను ఆమె శరీరం వంపుల మీదకు ఆకలి చూపులు పోనిస్తూ.

నేను రచనా వ్యాసంగంలో మునిగి వున్నప్పుడు, నన్ను ఎవరయినా డిస్టర్బ్ చెయ్యడం సహించను.

అందుకు "సారీ! డోంట్ డిస్టర్బ్ మి" అని చిన్న బోర్డు తయారుచేయించి వుంచాను బయట తగిలించడానికి.

లీనా ఆ బోర్డు తీసుకెళ్ళి బయట తలుపులకు తగిలించి వచ్చింది. తరువాత లోపలనుంచి లాక్ చేసింది.

స్లీపింగ్ సూట్ లోపల నేను నగ్నంగా, సిద్ధంగానే ఉన్నాను.

రెండు నిముషాల్లో లీనా వివస్త్ర అయి, మంచంమీద తలగడల దొంతర్లకు చేరబడి "కమాన్! క్రష్ మి" అంటూ చేతులుచాచి కవ్వింపుగా పిలవగానే, స్లీపింగ్ సూట్ ఒక్క ఊపుతో లాగిపారేసి, ఆమెమీద విరుచుకుపడ్డాను.

అలవాటుగా వేళకు యింత తినాలన్న నియమం అంటే నాకు పరమ అసహ్యం. పేగులు అరిచేంత ఆకలి వేసేంత వరకూ భోజనం చెయ్యను.

సెక్స్ తృప్తి విషయంలో కూడా నా భావాలు అంతే శరీరంలోని ప్రతీ అణువూ ఆడదాని పొందుకోసం ఆక్రో

శించేంత వరకూ ఆడదాన్ని తలవను.

ఏభై దాటిపోతున్నా పెళ్ళి విషయం తలవకపోవడానికి కారణం అదే! సెక్సు రొటీను వ్యవహారం కావడం భరించలేను. ఇహా, వంశాభివృద్ధి వగైరా చెత్త నేను విశ్వసించను.

అరగంట తర్వాత అలసిపోయిన నరాలతోటి, తృప్తి పడిన మనస్సుతోటి లేచాను.

ఒళ్ళంతా తేలిగ్గా సుఖంగా ఉంది. మెదడంతా, ప్రశాంతంగా, నిర్మలంగా వుంది.

నేను బాత్ రూంకి నడుస్తుంటే "యూ వాంట్ మీ సెకండ్ టైం?" అడిగింది లీనా మత్తుగా మంచంమీంచి.

"నో. థేంక్యూ" జవాబిచ్చాను.

బాత్ రూంనుంచి నేను తిరిగి వచ్చాక, ఆమె వెళ్ళింది.

బట్టలు వేసుకుని లీనా బయలుదేరుతుంటే పది పదులు మడిచి ఆమె హేండ్ బేగ్ లో పడేసి "గుడ్ నైట్" అన్నాను.

లీనా వెళ్ళిపోయింది, గుడ్ నైట్ చెప్పి.

## 2

లీనా వెళ్ళాక, సిగరెట్ వెలిగించి పీలుస్తూ, సోఫాలో వాలిపోయాను.

నా మెదడిప్పుడు పదునుగా పని చేస్తోంది. నేను రాయబోయే నవల గురించి మళ్ళా ఆలోచనలు మొదలయ్యాయి.

ఈసారి మాస్టర్ పీస్ రాయాలి! ఆ విషయంలో మార్పు లేదు. గట్టిగా నిశ్చయించుకున్నాను.

క్రైం కథలు ఎన్నో తరహాలుగా రాసాను. ఓసారి రాసిన పద్ధతిలో రాయకుండా రాసాను.

ఈసారి యింకా వినూత్నంగా వుండాలి నా రచన!

కల్పిత కథలు రాసిరాసి విసుగు పుడ్తోంది నాకు.

అయితే, యీసారి నా రచన యెలాంటిదైతే బావుం టుంది? ఆలోచించసాగాను తీవ్రంగా.

ఈసారి యధార్థగాథను దేన్నైనా తీసుకుని నవలగా రాస్తేనో?

ఆ ఆలోచన బాగానే వున్నట్టనిపించింది. అదేమంత కష్టంకాదు కూడా.

ఎన్నో కేసుల్లో నేను పోలీసు డిపార్టుమెంటుకు సాయం చేసాను, క్లిష్టమైన కేసుల్ని పరిష్కరించి, నేర స్తుల్ని అరెస్టు చెయ్యడంలో.

ఫలానా కేసు గురించి ఓ పుస్తకం రాయదల్చు కున్నాను అని నేను చెప్పాలేగాని, పోలీసు డిపార్టుమెంటు తమ ఫైళ్లు యిచ్చి నాకు కావలసినంత సహాయం అంది స్తారు.

కాని—ఒక్కటంటే ఒక్కటి—నాకు జ్ఞాపకం ఉన్నంత వరకూ, గట్టి కేసు—పోలీసుల మేధాశక్తిని పరీక్షించింది లేదు.

నూటికి ఎనభై కేసులు ఎటువంటి వంటే—క్షణికోద్రే కంలో హత్యలు చేసేసి—తామెలాగూ పట్టుబడిపోతామన్న భయంవల్లనో, మరెందువల్లనో—హంతకులు తిన్నగాపోయి పోలీసులకు లొంగిపోతారు.

ఇంకో పది కేసుల్లో, హత్యచేసాక, హంతకులు పారిపోతారు. అయితే, వాళ్లు వెళ్ళిపోతూ, కాయితం

మీద సంతకం చేసినట్టు, హత్యా ప్రదేశంలో తమ వస్తువులు జారవిడుచుకోవడమో, అక్కడున్న వస్తువులమీద తమ వేలిముద్రలు స్పష్టంగా వదలడమో చేసి వెళ్ళిపోతారు.

ఇలాంటి వాటిలోపోలీసుల పని మహాసులువు. 'ఫలానా అప్పారావు ఫలానా పాపారావుని పొడిచి చంపేసాడు. ఉన్నపళంగా కనిపించగానే అరెస్టు చెయ్యవలసింది' అని అన్ని పోలీసు స్టేషన్లకు దేశమంతటా వర్తమానం పంపుతారు.

అంతే! తన కోసం పోలీసులు గాలిస్తున్నారనగానే, అతడి గుండెలు సగం దిగజారిపోతాయి. పోలీసు నిఘా తప్పించుకు తిరగడం కష్టమైపోతుంది, రోజు రోజుకీ.

ఒక రోజున పోలీసులకు తనంతట తానుగా వచ్చి లొంగిపోవడమో, తెలివితక్కువగా చిన్న పొరపాటుచేసి, తన ఉనికి బయటపెట్టుకోవడమో చేసేస్తాడు.

కట్టుదిట్టమైన ఓ పథకం తయారుచేసి, దాని ప్రకారం హత్య చేసేవాళ్ళు బహుఅరుదు.

'మోటివ్' లేకుండా, హత్య జరగడమంటూ వుండదు. 'మోటివ్' ఒక్కటి చాలు, హంతకుడ్ని బయట పెట్టేయడానికి. ఒక వేళ, ఒక హతుడి విషయంలో నలుగు రయిదు గురికి ఒకే సమయంలో 'మోటివ్' ఉన్నా, హంతకుడు పట్టుబడ్డం పెద్ద కష్టంగాదు.

అనాలోచితంగా హత్యాప్రదేశంలో తన వస్తువులు జారవిడుచు కోవడమో, ఒక్కోసారి, యింకొకరిమీద హత్యానేరం నెట్టే ప్రయత్నంలో ఆ వ్యక్తి తాలూకు వస్తువులు వదిలివెళ్లడంలో ఏవో చిన్న తప్పులు చెయ్యడమో హంతకులు చేస్తారు. అవి వారిని పట్టించేస్తాయి.

అలాంటప్పుడు, జరిగిన హత్యే ఆధారంగా నవల రాస్తే, పాఠకుల్ని నిరుత్సాహపరచడమే అవుతుంది.

అయితే, యేమిటి కర్తవ్యం?

యథార్థ గాథ ఆధారంగా నవల రాయాలన్న నా ఆశ నిరాశ కావలసిందేనా? ఏ నిర్ణయం తీసుకోలేక పోయాను.

# 3

ఆమెను ఓసారి చూసాను లిఫ్టులో, నాతోపాటుగ పైకి వెళ్తుండగా.

ఆమె అందం నన్ను దిగ్భ్రాంతుడ్ని చేసింది. నేను యువకుడిగా కలలుగన్న అందాలన్నీ ఆమెలో ఉన్నాయి. పచ్చగా నునుపుదేరిన ఒళ్ళు, ఎత్తుగా ఎదిగి బరువుగా ఊగేవక్షాలు. సగం విచ్చుకున్న కలువల్లా కళ్ళు. పలకరిస్తే చాలు పిలిచినట్టుగా మొహంమీద ప్రత్యక్షమయ్యే చిరునవ్వు.

అంతకుముందెన్నడూ ఆవిడ్ని నేను చూళ్ళేదు. ఆవిడ హోటలుకు వచ్చి, మహా అయితే వారంరోజులయ్యుంటుందేమో!

ఆవిడ నాలాగ పెర్మనెంట్ కస్టమరా? లేక నాలుగు రోజులుండి వెళ్ళిపోయే మనిషా?

రూం సర్వీసు కుర్రాడు అప్పారావును పిలిచాను నా గదికి. పదిరూపాయల నోటు వాడికి అందించాను. వాడు తీసుకోబోతుంటే వెనక్కిలాగేసి "ఒరేయ్! యీ పదీ నీవి కావాలంటే, నాకు కాస్త భోగట్టా కావాలి. చెప్తావా?" అన్నాను.

"అదేమిటి సార్! అలాగంటారు. ఏం కావాలో చెప్పండి. నాకా పది అక్కర్లేదు" అన్నాడు అప్పా

రావు. కాని, వాడికళ్ళల్లో పదిరూపాయలమీద ఆశ తాలూకు మెరుపుపోలేదు.

"ఈ మధ్య మన హోటలుకు కొత్త మొహాలేవో వచ్చినట్టున్నాయిరా?" అన్నాను నేను అడగవలసిన దానికి ఉపోద్ఘాతంగా.

"అదేమిటోనండి. ప్రతి గదిలో ఉన్న బాబులు యిదే అడుగుతున్నారండి నాలుగురోజుల్నుంచి" అన్నాడు అప్పారావు.

"అఁ" అంటూ ఆశ్చర్యం వెలిబుచ్చి, ఆమె గురించి మరో ప్రశ్న అడుగుదామనుకుంటుంటే, "ఆవిడ యే నిమషాన యీ హోటల్లో అడుగుపెట్టిందోగానండీ, మూడో అంతస్తులో మగరాయుళ్ళ రద్దీ యెక్కువయ్యిందండి. వాళ్ళకు తెలీకుండానే 202 నెంబరు గది ముందు, వాళ్ళ కాళ్ళు ఆగిపోతున్నాయండి," అన్నాడు అప్పారావు.

ఆమె మూడో అంతస్తులో 202 నెంబరు గదిలో ఉందన్న విషయం, నేను అడగకుండానే, అప్పారావు చెప్పేసాడు. ఇహ, ఆమె పేరు, ఆమెతో ఎవరెవరు ఉంటున్నారో మొదలైన వివరాలు తెలుసుకుంటే, నేను సంగ్రహించాలనుకున్న భోగట్టా దొరికినట్టే.

నేను అడగ్గానే, అప్పారావు ఆ వివరాలు కూడా చెప్పాడు.

తీరా అడిగాక, నాకేమనిపించిందంటే, ఆమెతో పరిచయం పెంపొందించుకోవడానికి, అప్పారావు అందించిన భోగట్టా ఎందుకూ పనికిరాదు.

ఆమె పేరు వినీల. వరహాలరాజు అనే వ్యాపారస్తుడు తెచ్చి ఉంచాడు. గదిలో ఆమెతోపాటుగ యింకెవరూ

లేరు. కనీసం రోజుకోసారి, ముఖ్యంగా రాత్రుళ్ళు, ఆమెను చూసిపోవడానికి వస్తుంటాడు వరహాల్రాజు.

వరహాల్రాజుకు ఆమె అంటే ఎంతో మక్కువ. ఆమె కోరడమే తడవుగా, ఆమె కోరిక తీర్చి పారేస్తున్నాడు.

మరి, ఆమెను నేను లొంగదీసుకోవడం ఎలా?

ఆమె యిష్టాయిష్టాలు, మన స్తత్వం గురించి కొంతయినా తెలిస్తేగాని, ఆమెతో మామ్మూలు పరిచయం కూడా యేర్పరుచుకోలేను.

"చూడు అప్పారావు! ఆమె గురించి నువ్వు చెప్పే భోగట్టా చాలదు. యింకా కావాలి" అంటూ, వాడి జేబులో పదిరూపాయల నోటు కుక్కి, నాకింకా వినీల గురించి యే సమాచారం కావాలో చెప్పాను.

"అలాగే సార్!" అంటూ వాడు గెంతుకుని వెళ్ళిపోబోతూంటే "ఒరేయ్! నేనిలా అడిగినట్టు ఎవరికీ తెలియకూడదు సుమా! జాగ్రత్త!" అన్నాను, వాడి చొక్కా పుచ్చుకుని ఆపి.

"అదేంటి సార్. అలాగంటారు? నేను చచ్చినా యీ రహస్యం యింకొకరికి చెప్పను" అంటూ నాచేతిలో చెయ్యేసి ఒట్టుపెట్టి వెళ్ళిపోయాడు అప్పారావు.

రోత్మన్స్ సిగరెట్టు వెలిగించి కాలుస్తూ, సోఫాలో వెనక్కి జారగిలబడి, ఆలోచనల్లో పడ్డాను.

ఒంటిమీద ఒక్క నూలుపోగుకూడా లేకుండా చేసి, వినీలను రాక్షసరతి చేస్తుంటే ఆమె నా ప్రక్కలో ఎలా కదుల్తుందా అని ఊహించుకుంటున్నాను.

నగ్నంగా ఉన్న వినీల అప్పుడే భూమిలోంచి మొలుచుకొచ్చిన దేవతలా నాకు చేరువుగా వస్తుంది. ఆమె మెడ

చుట్టూ చేతులు వేసి, మరి కేవాంఛతో ఆమెను కౌగలించుకుంటాను.

మొదట సున్నితంగా ఆ తరువాత పోనుపోను బలంగా దృఢంగా, గాఢంగా, బిగియార కవుగిలించుకుంటాను.

పారవశ్యంవల్లనో, మరెందువల్లనో, ఆమె కళ్ళు మూసుకుంటుంది. నా కౌగిలిసడలించి చూస్తాను.

అరే! అదేమిటి? ఆమె అలా వెనక్కి పడిపోతోందేం? ...ఆమె వెనక్కి వాలిపోయింది చేతనారహితంగా.

ఆమె ముక్కువద్ద వేళ్ళాడిస్తాను. ఆమెలో ప్రాణం లేదు! ఆమె చనిపోయింది!...నా మనస్సు అదోలా అయిపోయింది.

విసీలను తల్చుకున్నప్పుడల్లా యీ దృశ్యం కళ్ళముందాడుతోంది. కారణమేమిటి? ప్రశ్నించుకున్నాను నిశితంగా నన్ను నేను.

అదేసమయంలో, నేనో యధార్థ హత్య గురించి రాయాలని నిశ్చయించుకున్న విషయాం గుర్తుకొచ్చింది.

అవును! ఆమెను నేను హత్య చేస్తేనో?...నా గుండెలు గుభేలుమన్నాయి, నా కళ్ళముందు_నేను హత్య చెయ్యడం పోలీసులు అరెస్టు చెయ్యడం వగైరా దృశ్యం కనిపించగానే.

కాని, ఆలోచించాను.

ప్రపంచ సాహిత్య చరిత్రలో యిలాంటి సాహసం ఏ రచయితా చెయ్యలేదు! చెయ్యబోడు! చెయ్యడు!

విజయవంతమైన హత్య చెయ్యడానికి పాటించాల్సిన సూత్రాలన్నీ అవలంబిస్తే, హత్యచేసి శిక్ష తప్పించుకోవచ్చునో లేదో రుజువయిపోతుంది.

ఇది సాహిత్య ప్రపంచంలోనే కొత్తప్రయోగం!

అతిసులువుగా వినీలను హత్యచేసి తప్పించుకోవడానికి నాకు అవకాశాలు యెక్కువ వున్నాయి.

అశేషంగా క్రైం కథలు రాసి గడించుకున్న అపార అనుభవంతో వినీలను నేను హత్య చెయ్యగలను, పోలీసులకు యేక్లూ దొరక్కుండా.

పైగా, ఆమెను హతమార్చడానికి నాకు 'మోటివ్' లేదు. అందునా, హోటల్లో హత్య జరుగుతుందాయె!

తల క్రిందులుగా తపస్సు చేసినా, నా మీద అనుమాన లేశం కూడా పోలీసులకు కలగడానికి అవకాశం లేదు.

పైగా, కేసు పోనుపోను మరింత క్లిష్టమయ్యే అవకాశం వుంది.

వినీలను యెలాగయినా పొంది తీరాలని, కొంతమంది యువకులు, ఆమె గదిలో జొరబడి, బలాత్కారంగా అనుభవించి, ఆమె బ్రతికివుంటే తమను పోలీసులకు పట్టిఇస్తుందేమోనన్న భయంతో, ఆమెను చంపి పారెయ్యవచ్చు.

కేసు అలా తప్పుత్రోవ పట్టుతుంది.

చివరకు, వినీలను హత్య చెయ్యాలని నిశ్చయించుకున్నాను.

# 4

సరిగ్గా రెండు రోజులు పోయాక, అప్పారావు నా గదికి భోజనం తెస్తూ, వినీల గురించి నే నడిగిన అదనపు భోగట్టా అందించాడు.

ఆమెకు త్రిల్లర్స్, క్రైం స్టోరీస్ అంటే ఎంతో యిష్టమట. ఆడా మగా అన్న తేడా పాటించకుండా అంద

రితో అతిచనువుగా మాట్లాడుతుంది, తిరుగుతుంది.

స్నేహంగా పిలిస్తే చాలు, ఎవరి గదికయినా నిస్సంకోచంగా వెళ్తుందట. అలాగే యితర్లని తన గదికి ఆహ్వానించడానికి జంకదు.

అయితే, ఆమె చూపే చనువు ఆసరాగా తీసుకుని, ముగ్గురు ఆమెకు యింకా దగ్గరవబోతే, వాళ్ళని భంగపరిచిందట.

దాంతో తతిమ్మా మగవాళ్ళు జాగ్రత్తగా వుండనారంభించారు. వినీలను ఆరాధించి పలవరించాల్సిందే గాని అనుభవించి ఆనందించడానికి అలవిగాదని తెలుసుకున్నారు.

వినీలను పరిచయం చేసుకోవడానికి కావలసిన వాతావరణం వుందని గ్రహించాను.

కల్పించుకుని, ఆమెతో పరిచయం చేసుకొన్నట్టుగా గాకుండా, అతిసహజంగా ఆమెతో పరిచయం కావాలని అనువైన సమయంకోసం యెదురుచూస్తున్న సమయంలో_ ఓ రోజు ఆమె వున్న అంతస్తు వైపే వెళ్లాను.

ఆమె అదే సమయంలో తన 202 నెంబరు గదిలోంచి బయట కొచ్చింది.

ఆమె చేతిలో ఏవో పుస్తకాలున్నాయి. ఆమె నాకెదురుగా వస్తోంది.

ఆమెను దాటి వెళుతోంటే, ఆమె చేతిలోని పుస్తకాలు జారిపడ్డాయి నేలమీద.

ఆమెను పరిచయం చేసుకునే చక్కని అవకాశం దొరికిందనుకుని, చటుక్కున నేలమీదకు వంగి, పడిన పుస్తకాల్ని తీసాను.

ఆమెకు తిరిగి అందించేముందు, అందులో ఒక పుస్తకం వైపు చూసాను.

ఆ పుస్తకం నేను రాసిందే! పేరు 'జాలిగల హంతకుడు'. పాఠకుల్నించి బ్రహ్మాండమైన మెప్పుపొందిన నవలల్లో ఒకటి.

ఆమె వినీల కాకపోయివుంటే, ఆమెతో పరిచయం కావాలన్న ఉబలాటం నాకు లేకపోయుంటే, ఆమె చేతిలోంచి పడిన పుస్తకాల్ని యెత్తేవాడ్ని కాదు. యెత్తినా, గమ్మున ఆ పుస్తకాల్ని యిచ్చేసి వెళ్ళిపోయేవాడ్ని.

నన్ను నేను యిలా తమాషాగా పరిచయం చేసుకొనేవాడ్ని కాదు.

"చరిత్రలో సువర్ణాక్షరాలతో రాయాల్సిన క్షణం యిది" అన్నాను నవ్వుతూ.

"ఎందుకో చెప్తారా?" అందామె తిరిగి నవ్వుతూ.

"అందమైన ఓ జత చేతుల్లోంచి పుస్తకాలు జారిపడ్డాయి" అన్నాను ఆరంభిస్తూ.

"ఓస్! యింతేనా" అందామె నా మాటల్ని మధ్యతుంచేస్తూ.

"చూడండి! మీకు దేవుడు అందాన్ని హక్కుగా ప్రసాదించాడుగాని, తొందరపడ్డాన్ని మాత్రం కాదు" అన్నాను, తాపీగా, దర్జాగా.

"అబ్బో!" అంటూ ఆమె కళ్ళు గుండ్రంగా కాసేపు త్రిప్పి "చూస్తే మీరు సినిమా డైలాగ్ రైటరులా గున్నారే!" అంది.

"నేను రైటర్ని మాత్రం అవును. కాని సినిమా డైలాగ్స్ మాత్రం రాయను" అన్నాను హుందాగా, ఉత్సాహంగా.

"మీ పేరు?"

"రైటర్‌గా నా పేరు వినాశ్. లోకంలో మాత్రం రాజేశ్వర్రావు."

"ఓహ్!...మీరా వినాశ్!...ఈ పుస్తకం రాసింది మీరే కదూ! వాట్ ఎ సర్‌ప్రైజ్!...వెరీ గ్లాడ్! వెరీ గ్లాడ్! రండి! రండి!" అంటూ ఆమె కంగారుపడిపోతూ నన్ను తన గదికి లాక్కెళ్ళింది.

"ఇప్పు డర్థమయిందా మీకు?...ఈ క్షణం సువర్ణాక్షరాలతో లిఖించదగిందని ఎందుకన్నానో" అన్నాను ఆమె చూపిన సోఫాలో కూర్చుంటూ.

ఆమె సంతోష సంభ్రమాలకు హద్దులు లేవు. ఏవేవో మిఠాయిలు అందించింది తినమని. తినడానికి మొహమాటం చూపితే, ఆమె ఊరుకోలేదు. బలవంతంగా తినిపించింది.

కనీసం రోజు కోసారయినా ఆమె గదికి నేను వెళ్ళి తీరాలి. లేదా ఆమే నా గదికి వస్తుంది. అదీ ఆమె పెట్టిన షరతు.

అంత సులువుగా, ఆమెతో పరిచయం ఏర్పడుతుందని అనుకోలేదు నేను.

## 5

అవాళనుంచి ఆమెను హతమార్చడానికి అనువైన అవకాశంకోసం అతి జాగ్రత్తగా ఎదురుచూడ సాగాను.

నాకు తెలిసినంతవరకూ, వరహాల్రాజు ఆమెను ప్రాణాధికంగా చూసుకుంటున్నాడు.

ఎక్కువ చనువు తీసుకోవడానికి ప్రయత్నించి, ఆమె చేత భంగపాటుపడ్డ యువకుల గురించి జనానికి యిప్పుడు తెలుసు కాబట్టి, ఆమెతో చలాకీగా మాట్లాడ్డానికి మించి

ఎవరూ ఎక్కువ చనువు తీసుకోవడానికి ప్రయత్నించడం లేదు.

ఆరు నెలలు గడిచిపోయాయి. ఈ లోపున ఆమెతో నా సాన్నిహిత్యం పెరిగింది. ఆమె ద్వారా నాకు కొంత మంది స్నేహితులు కూడా తయారయారు.

ఇప్పుడు హోటల్ ఎల్లో రెయెక్స్ సీలో ఆమె లేని పార్టీ లేదు.

ఆమె చెప్పే కులాసా కబుర్లకోసం, ఆమె కోసమే పార్టీలు యిచ్చినవారు మాలో కొంతమంది లేరనను గాని, ఆమె ఉంటేనే పార్టీకి కళ, జీవం అని ఆమెను విధిగా ఆహ్వానిస్తారు అందరూ తాము యిచ్చే యే పార్టీల కయినా.

రోజులు గడిచిపోతున్నాయి నిస్సారంగా.

నా పథకం మురిగిపోతోందేమోనని నేను లోలోపల బాధపడుతున్న సమయంలో, మా మధ్యకు శ్యాంబాబు అనే రంగేళీ యువకుడు ప్రవేశించాడు.

అతడి వృత్తేమిటో, అతని తల్లిదండ్రు లెవరో, నీళ్లలా ఖర్చు చెయ్యడానికి అతనికంత డబ్బు ఎక్కడ్నుంచి వస్తోందో మాకు తెలీలేదు, పరోక్షంగా, ప్రత్యక్షంగా కూడా అతడ్ని అడిగినప్పటికీ.

ఒక్కొక్కరికి ఒక్కో విధంగా జవాబిచ్చేవాడు శ్యాంబాబు. వామనరావు అడిగితే తాను దొంగనోట్లు అచ్చు వేస్తున్నానన్నాడు. కమలాకరమూర్తి అడిగితే 'నాకు లంకెల బిందెలు దొరికాయి' అని జవాబిచ్చాడు.

మాకు చెప్పకపోతే పోనీ, వినీలకయినా చెప్పడా అని ఆ ప్రశ్న ఓసారి వినీలచేతే వేయిస్తే "ఒప్పు. మీ తోడు.

నేను స్టేంటుబేంకులో మాత్రం దొంగతనంచేసి తీసుకు రాలేదు'' అని ఆమెకూ కొంటె సమాధానం చెప్పాడు.

అతడు చెప్పకపోతే పోనీ, అతడి గురించి ఆమాత్రం సమాచారం సేకరించలేకపోతామా అని మాలో కొందరు అతడి మువ్ మెంట్స్ పరిశీలించ నారంభించారు.

అతడు నెల రోజుల కోసారి, దూరంగా ఏదో వూరు పోయి డబ్బు తెచ్చుకుంటుంటాడు. ఊరికి వెళ్ళేముందర ఒక రోజు, వచ్చిన తరువాత ఒక రోజు అతడి మొహంలో ఎందుకో చెప్పలేని దిగులు, బాధ కనిపిస్తుంది.

అంతకుమించి శ్యాంబాబు గురించి యింకే వివరాలు సేకరించలేకపోయారు.

అతడు మా హోటలుకు వచ్చిన మొదటి రోజునే, వినీలవైపు గాఢంగా ఆకర్షింపబడ్డాడు.

రోజులో మూడువంతులు ఆమె సాన్నిధ్యంలోనే గడపసాగాడు.

వాళ్ళిద్దరి మధ్య యేదో వ్యవహారం సాగుతోందని నా అనుమానం.

వాళ్ళిద్దర్నీ నిశితంగా పరిశీలించడానికి తీర్మానించు కున్నాను.

# 6

అవాళ ఉదయం పదీ పదిన్నర కావస్తుండగా ఓ దిక్కుమాలిన స్టేషనులో రైలు దిగాడు శ్యాంబాబు.

అత దేవూరినుంచి వచ్చాడో, హోటల్లో వుండి అంత జల్సాగా కర్చు చెయ్యడానికి డబ్బెక్కడ్నించి వస్తోందో మొదలైన వివరాలు సంగ్రహించడానికి అతడ్ని రహస్యంగా వెంబడిస్తున్న నేను కూడా అతని వెనువెంటనే రైలు దిగాను.

తలొంచుకుని నడుస్తూ అతడేం ఆలోచిస్తున్నాడో గాని, అతడ్ని నేను అనుసరిస్తున్నానన్న స్పృహే లేదు అతనికి.

స్టేషను బయటకొచ్చి, పొలాల మధ్యనుంచి పోతున్న చిన్న బాటుతోవ పట్టాడు అతడు.

మెల్లగా నేను కూడా అతడి వెనకనే పాతిక, యేభై గజాల దూరంలో నడుస్తున్నాను.

శ్యాంబాబు మొదట తోటలో ప్రవేశించాడు. చెట్లను అడ్డం పెట్టుకుంటూ నేనూ లోనికి వెళ్ళాను.

తోట మధ్య చిన్న తాటాకుల గుడిసె ఉంది. శ్యాంబాబు రెండు నిముషాలసేపు గుడిసెలోకి వెళ్ళి బయటకు వచ్చాడు. తోట నలువైపులా చూసి "రామయ్యా! రామయ్యా!" అంటూ గొంతు చించుకుని కేకేసాడు.

రామయ్యకు పిలుపు అందినట్టుంది. "ఎవరూ?" అంటూ అతడు పెట్టిన కేక విన్పడింది జవాబుగా.

"నేనూ...శ్యాంబాబుని" బదులిచ్చాడు శ్యాంబాబు.

ఆ మాట వింటూనే రామయ్య పరుగెత్తుకొచ్చాడు అక్కడకు ఒక్క అంగలో.

"ఎంతసేపయింది బాబూ! మీరొచ్చి?" అని రామయ్య వేసిన ప్రశ్నకు "ఇదే రావడం" అని జవాబిచ్చాడు శ్యాంబాబు.

"పదండి బాబూ! పాకలో కూచుందాం" అంటూ శ్యాంబాబుని పాకవైపు తీసుకెళ్ళాడు రామయ్య.

"అన్నయ్య యింకా రాలేదా?" దోవలో అడిగాడు శ్యాంబాబు.

"వస్తారు బాబూ! గడియకో, గంటకో" చెప్పాడు రామయ్య.

నాకు పాక చాలా దూరంలో ఉంది. వాళ్లు లోపల యేం మాట్లాడుకుంటున్నారో వినబడే అవకాశం లేదు.

వాళ్ళు లోనికి వెళ్ళగానే, నేను చప్పున కదిలి, పాక వెనుకకుపోయి, ఓ చెట్టుచాటున నిలుచున్నాను.

"యేమిటి బాబూ. ఎన్నాళ్ళీ అజ్ఞాతవాసం?" అడుగుతున్నాడు రామయ్య.

శ్యాంబాబు దీర్ఘంగా నిట్టూర్చాడు తప్ప వెంటనే జవాబీయలేదు.

ఒక్క నిముషం పోయాక మళ్ళా రామయ్యే అన్నాడు: "దానికి రోజులునిండి అది చచ్చింది. ఏమిటయితే అదే అవుతుంది. ధైర్యంగా తిరగండి బాబూ. హత్య మీరు చెయ్యనపుడు మీ కెందుకు భయం?"

"అని నీకు తెలుసు. దేవుడికి తెలుసు. కాని లోకులకు తెలీదు. వాళ్ళకు తెలిసిందంతా; దాని శవంవద్ద పడివున్న నా వస్తువులు. నాచేతి వేలిముద్రలు. ఎక్కడబడితే అక్కడ పడివున్న ఆమె గదిలో సామానులు. నేను పోలీసులకు లొంగిపోయి శిక్ష అనుభవించడం తప్ప యింకోమార్గం లేదు" అన్నాడు శ్యాంబాబు.

శ్యాంబాబు చరిత్ర నాకిప్పుడు అర్థమయింది పూర్తిగా. శ్యాంబాబు ప్రేయసినో లేక ఉంచుకున్నదాన్నో ఎవరో ఒకామెను ఎవరో హత్య చేసారు. ఆమె చనిపోయిన గదిలో సామాన్లనిండా శ్యాంబాబు వేలిముద్రలు, అతని వస్తువులు ఉన్నాయి.

లోకం దృష్టిలో, పోలీసుల రికార్డులో శ్యాంబాబు హంతకుడు. అందుకే యింటికి దూరంగా, అజ్ఞాతంగా బ్రతుకుతున్నాడు.

శ్యాంబాబుమీద హంతకుడి ముద్ర ఉంది. ఇవాళ కాకపోతే రేపు పోలీసులకు చిక్కి శిక్ష పొందక తప్పదు.

"తమ్ముడూ! ఎంత సేపయిందిరా వచ్చి?" శ్యాంబాబు అన్న వచ్చినట్టున్నాడు. అతనిగొంతు వినగానే, నా దృష్టి మళ్ళా పాకలోని సంభాషణవైపుకు మళ్ళింది.

"ఇప్పుడే అన్నయ్యా!..." అని ఒక్క క్షణం ఆగి "అమ్మా... నాన్నా ఎలాగున్నారన్నయ్యా?" అడిగాడు శ్యాంబాబు.

"అమ్మ యివాళో రేపో చచ్చిపోయేటట్టుందిరా. నీ గురించి దిగులుతో మంచం యెక్కిపోయింది. నిన్ను చూడాలని వుంది ఆమెకు. ఆమె చచ్చిపోతే... నాన్న గూడా..." ఇహ చెప్పలేక అతడిగొంతుక పూడుకు పోయింది.

"ఇదంతా నావల్లనే...ఇదంతా నావల్లనే" శ్యాంబాబు బాధగా రోదించసాగాడు.

"ఊరుకోండి బాబూ! ఊరుకోండి బాబూ!" రామయ్య సముదాయించసాగాడు.

"ఉండు రామయ్యా! నన్ను ఊరుకోబెట్టవద్దు. అందమైన ఆడవాళ్ళను చూసి పొంది తీరాలన్న నా కోర్కె నన్నీస్థితికి దింపింది. ఇంత జరిగినా, అందమైన ఆడవాళ్ళను చూస్తే నా మనస్సు నిలవదు.........అమ్మను చూడాలని వుంది నాకు. వెళ్ళి చూసానా దొరికిపోవడం ఖాయం. నా ఆచూకీ ఎక్కడ దొరికిపోతుందో అన్న భయంవల్లనేగదా యీ రోజువరకూ యింటికి ఉత్తరాలు రాయడం గాని, మీ చేత రాయించుకోవడం గాని చెయ్యడంలేదు" అన్నాడు శ్యాంబాబు ఏడుస్తూనే.

"బాధపడకు తమ్ముడూ! జరగాల్సిందెలాగూ జరుగుతుంది...ఇదిగో డబ్బు!...మళ్ళా రైలుకు ఆలస్యమవుతుందేమో బయలుదేరు" అన్నాడు శ్యాంబాబు అన్న.

"అలాగే అన్నయ్యా! వస్తాను రామయ్యా!" అంటూ శ్యాంబాబు వెలుపలికి వచ్చి బయలుదేరాడు.

శ్యాంబాబు అన్నయ్యను కూడా వెళ్ళిపోనిచ్చి, నేను కూడా తిరుగుప్రయాణం మొదలుపెట్టాను.

తోవలోనే, నా ఆలోచనలకు పరిణితి వచ్చింది.

శ్యాంబాబుకూ వినీలకూ ఎక్కువ స్నేహం ఉంది. వారిద్దరిమధ్య ఉన్న సంబంధం వట్టి స్నేహమేకాదని కొంతమందిలో అనుమానం కూడా ఉంది. ఇందుకు తోడుగా శ్యాంబాబుమీద హత్యానేరం ఉంది.

నేను వినీలను అంతం చెయ్యడమే సంభవిస్తే, ఆ నేరం కూడా అతడిమీదకే వెళ్తుంది.

వినీలను అంతం చెయ్యడానికి ఇంతకుమించిన అనువైన సమయం యేముంది?

# 7

ఉదయం పదకొండు గంటలవుతుండగా వినీల గది వైపుకు వెళ్ళాను.

వరహాలరాజు లోన ఉన్నాడు. సగం తెరచి వుంచిన తలుపు సందులోంచి అవుపించాడు.

అతడెక్కడికో పై వూరువెళ్తున్నట్టున్నాడు "మళ్ళా యెప్పుడొస్తారు తిరిగి?" అడుగుతోంది వినీల.

"ఎల్లుండిరాత్రికి వస్తాను" అంటున్నాడు వరహాల్రాజు.

నా మెదడులో చిన్న గంట మోగింది. అంటే, యీ

రెండు రోజులు రాత్రిపూట వరహాలరాజు ఆమె గదిలో ఉండడు. ఆమె ఒంటరిగా ఉంటుంది.

వినీలను హత్య చెయ్యడానికి చక్కని తరుణం అని అనుకున్నాను.

వరహాలరాజు ఊరు వెళ్ళి పోయాడు.

ఆమెను హతమార్చడానికి అనువైన అవకాశం కోసం యెదురు చూస్తూ, ఆమె గదికి వచ్చేపోయేవారిని గమనిస్తూ, ఆమె గది చుట్టు ప్రక్కలే గడపసాగాను.

ఆ మరుసటి రోజు రాత్రిగాని, నేను కోరిన అవకాశం రాలేదు.

రాత్రి పదకొండు గంటల వరకూ, నేనూ, శ్యాంబాబు యింకో ముగ్గురు యువకులూ, ఆమె గదిలో కబుర్లు చెప్పు కుంటూ కూచున్నాం.

పదకొండున్నర కావస్తుంటే, ఆ ముగ్గురు యువకులు తమకు నిద్ర వస్తోందంటూ వినీలకు గుడ్ నైట్ చెప్పి వెళ్ళిపోయారు.

నేను శ్యాంబాబు ఆఖరుకు మిగిలిపోయాం. ఇంక ఆ రాత్రికి వినీల గదికి యెవరూ రారు, మేం వెళ్ళిపోతే.

శ్యాంబాబు వెళ్ళిపోయేవరకూ ఉండి, ఆ తరువాత నా పని ముగించుకుని వెళ్ళిపోవాలని నా ఆలోచన.

కాని, ఆఖరి క్షణంలో నా మనసు మార్చుకున్నాను.

రేపొద్దున్న వినీల హత్య గురించి దర్యాప్తు ఆరంభ మైతే, ఆమెను ఆఖరిసారి బ్రతికుండగా చూసిందెవరు అన్న ప్రశ్న వస్తుంది.

నన్ను వినీలతో వదిలి, తను వెళ్ళిపోయానంటూ శ్యాంబాబు చెప్తాడు, దర్యాప్తుకొచ్చిన పోలీసులతో,

అనుమానం అనవసరంగా నా మీదకు మళ్ళి, వినీలను ఆమె గదిలో సజీవంగా వదిలి వెళ్లినట్టు రుజూ చేసుకునే బాధ్యత, బాధ నాకు తగులుకుంటాయి.

అదంతా దేనికి?

నేను అతనికన్నా ముందు వెళ్ళినట్టుగానో, లేదా అతనితో కలిసి వెళ్ళిపోయినట్టు సాక్ష్యాధారాలుగానీ ఉంటే, నామీద కనీసం పోలీసుల అనుమానపు నీడ కూడా పడదు.

గట్టిగా ఆవలించి, చటుక్కున లేచి, 'గుడ్ నైట్ వినీల' అన్నాను. ఆమె బదులు 'గుడ్ నైట్' చెప్పింది.

నావైపో చూపు పారేసి ఊరుకున్నాడు శ్యాంబాబు. అతడికింకా, ఆమెతో కబుర్లు చెపుతూ కూచోవాలని ఉందని అర్థం చేసుకున్నాను.

"మీరు రారా?" అన్నాను అప్పటికీ.

"కాసేపుంటాను. ఇంకా నాకు నిద్ర రాలేదు" అన్నాడు శ్యాంబాబు.

"అయితే, నేవెళ్తా. గుడ్ నైట్" అన్నాను నేను, మనస్సులో ఎంతో ఆనందపడ్తూ. నే నాశించినట్టుగానే జరుగుతోంది.

నా గదికి వెళ్ళాను. బట్టలు ఆరవెయ్యడంకోసం కొనుక్కొని వచ్చిన నైలాన్ తాడులోంచి కోసిన రెండు బారల ముక్కను జేబులో వేసుకొన్నాను. గ్లవుజుకూడా రెండో జేబులో వేసుకొని, తొందరగా, మళ్ళా మూడో అంతస్తుకు వచ్చి, కారిడార్ వంపులో స్తంభాలచాటున నక్కి నిలుచున్నాను.

నా గదికి వెళ్ళడానికి మాత్రం లిఫ్టు ఉపయోగిం

చాను. కాని, తిరిగి రావడానికి మాత్రం మేడ మెట్లు ఉప యోగించాను.

లిఫ్టులోగాని, మేడ మెట్లమీద గాని ఎవరూ నాకంట బడలేదు. అంచేత, నేను కూడా ఎవరికంటా బడలేదని నా నమ్మకం.

సరిగ్గా పన్నెండుంపావు కావస్తుండగా శ్యాంబాబు వినీల గదిలోంచి వచ్చాడు బయటకు.

తలొంచుకుని, ఏదో ఆలోచిస్తూ లిఫ్టువద్దకు వెళ్ళాడు.

రెండు నిముషాలు అక్కడ ఆగేసరికి, లిఫ్టు వచ్చింది. లోనికిపోయి, అయిదవ అంతస్తుకు వెళ్ళిపోయాడు.

క్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా, వినీల గదికి వచ్చి డోర్ బెల్ నొక్కాను.

రెండు సెకన్లుపోయాక, రెండోసారి బెల్లు నొక్కుదా మనుకుంటుంటే వినీల వచ్చి తలుపు తెరిచింది.

అయితే, తలుపు పూర్తిగా తెరచి నన్ను లోనికి రానీ లేదు చైన్ తగిలించింది.

"మీరా?...యేం పిలిచారు?" అడిగింది.

ఇలా జరుగుతుందని నేనెన్నడూ ఊహించలేదు. డోర్ బెల్ మోగించగానే, తలుపు తెరచి లోనికి రానిస్తుం దని అనుకున్నాను.

చరచకా ఆలోచించాను.

"నా పర్స్ మీ గదిలో పడిపోయిందని నా అను మానం," అన్నాను. లోలోన చక్కని అబద్ధం ఆడ గలిగినందుకు పొంగిపోతూ.

"తెల్లవారేవరకూ ఆగితే, అది తీసి దాచేసి, నాకేమీ తెలియదంటానని భయమా?" అందామె, మొహంమీద

నవ్వు మొలిపించుకుంటూ, మనస్సులోని చిరాకు కప్పి పుచ్చుకుంటూ.

"అబ్బెబ్బే. అది కాదు. అందులో నా బీరువా తాళాలు ఉండిపోయాయి. నైట్ డ్రెస్ బీరువాలోంచి తీయాల్సి ఉంది" ఇంకో అబద్ధం జోడించాను మొదటి దానికి.

ఆమె చేత యెలాగోలా తలుపు తీయించాలన్న పట్టు దల పెరిగింది నాలో.

"సరే రండి! చూసుకోండి. ఎక్కడపడిపోయిందో మీ పర్సు" అంటూ ఆమె తలుపుకున్న చెయిన్ తప్పించి, తలుపు బార్లా తెరిచింది.

'అమ్మయ్యా' అనుకుంటూ నేను లోనికి అడుగు పెట్టాను. ఆమె నా ముందు లోనికి నడిచింది.

నేను చప్పున వెనక్కు తిరిగి, తలుపు లాక్ చేసి తాళం జేబులో పడేసుకున్నాను.

క్లిక్‌మన్న శబ్దంవిని, ఆమె వెనక్కుతిరిగి "అదేమిటి?" అంది పాలిపోతూ.

"ఏం లేదు" అన్నాను యెలాగో జాగ్రత్తగా నిగ్రహించుకోబట్టిగాని, నా గొంతులోని వణుకు ఆమెకు తెలిసి పోయి వుండేది.

నాలో ఆవేశం పరవళ్ళు తొక్కుతోంది.

చక, చక జేబులోంచి గ్లవుజుతీసి ధరించి, నైలాన్ తాడు బయటకు తీసాను. తాడు కొసలు నా రెండు చేతు లకూ చుట్టుకుని పట్టుకుని ఆమెకు చేరువగా వెళ్ళసాగాను.

ఆమె కళ్ళల్లో భీభత్సం తొంగిచూస్తోంది.

"ఏమిటిది? ఎందుకిలా వింతగా ప్రవర్తిస్తున్నారీవేళ?" ఆమె కంఠం వణుకుతోంది, ఆమెలాగే,

ఒకవేళ ఆమె అరిచినా, ఆమె కేకలు బయటకు విన్పడవు. అది ఎయిర్ కండిషన్డు గది. ఆ నిబ్బరం ఉంది మొదటే.

ఆమెను చంపి తీరాలన్న పంతం, కసి నాలో వెర్రి ఆవేశంగా మారింది.

ముందుకు కదిలాను పట్టుదలతో.

భయంతో కాళ్ళూ చేతులు ఆడకపోవడం మూలాన్న కాబోలు, ఆమె నన్ను తప్పించుకునే ప్రయత్నం చెయ్యలేదు.

ఆమె మెడచుట్టూ నైలాన్ తాడుచుట్టి, బుల్ వర్కరు లాగినట్టుగా లాగాను.

ఆమెది మరీ బడుగు ప్రాణమో లేక అప్పటికే భయంతో సగం చచ్చిందో యేమో తెలీదుగాని నిముషాల్లో ఆమె ప్రాణాలు కోల్పోయింది సునాయాసంగా.

ఆమె శవం అసహ్యంగా తెరుచుకున్న నోరు, కళ్ళతో నేలమీద పడిపోయింది.

ఆమెను అలాగే వదిలి వచ్చేస్తుంటే, వినీల హత్యానేరం శ్యాంబాబుమీద నెట్టేందుకు, హత్యలో 'మోటివ్' అవుపించేలా చెయ్యడం అవుసరం అనిపించింది నాకు.

వెనక్కి వెళ్ళాను.

ఆమె ఒంటిమీద బట్టల్ని ఊడలాగేసి, ఆమె స్తనాల మీద, తొడలమీద గాయాలు చేసాను.

నేను చేసిందంతా సవ్యంగానే వుందని ఓసారి జాగ్రత్తగా చూసుకొని, తాళంతో తలుపు తెరిచి తాళంలోనికి గిరవాటేసి, తలుపు దగ్గరగా చేరవేసి, బయటకువచ్చాను దడదడ లాడిపోతున్న గుండెలతో.

కారిడార్ నిర్మానుష్యంగా వుంది యెప్పటిలా. చప్పుడు చెయ్యకుండా త్వరత్వరగా మెట్లు దిగివచ్చి నా గదికి చేరుకొన్నాను.

# 8

మర్నాడు ఉదయం ఆరు గంటలకే లేచాను.

బాత్ రూంకు కదులుతుంటే వినీల గుర్తుకొచ్చింది. నా చేతుల్లో ప్రాణాలు కోల్పోయి తెరుచుకున్న కళ్ళతో నేలమీద పడిపోయిన ఆమె శవం అవుపించింది నా కళ్ల ముందు.

ఈ రోజునుంచి నాకూ పోలీసు డిపార్టుమెంటుకూ మేధాయుద్ధం. అనిర్వచనీయమైన ఉత్తేజంతో నిండింది నా శరీరం.

కాని, మరుక్షణంలో ఎందుకో దిగులు కలిగింది. కొంప దీసి, సూత్ర ప్రకారంగా వినీలను హత్య చెయ్యడంలో అనాలోచితంగా నేనేమైనా తప్పులు చెయ్యలేదుగదా? అనుకున్నాను.

ఒక్కసారి గడచిన రాత్రి సంగతులన్నీ గుర్తుకుతెచ్చుకొన్నాను.

లేదు! ఒక్క తప్పుకూడా దొర్లలేదు. సోఫాలో నేను కూచున్నప్పటి వేలిముద్రలు తప్ప యింకెక్కడా అవి పడకుండా చేతికి గ్లవుజు తొడుక్కున్నాను. రక్తపాతం వగైరా చీదరలేకుండా, ఆమెను నైలాన్ తాడుతో పీక నులిమి చంపాను.

అంతేగాదు!

హత్య శ్యాంబాబు మీద కెళ్లేందుకు వీలుగా, ఆమెను కామించి, కోరిక తీరక బలవంతంగా అనుభవించి చంపినట్టుగా ఆమె ఒంటిమీద గాయాలు చేసాను,

అయితే నేను చెయ్యవలసింది యింకొక్కటుంది. హత్యకు వుపయోగించిన గ్లవుజు, నైలాన్ తాడు యింకా నావద్దే వున్నాయి. ఎవరూ చూడకుండా వాటిని ప్రక్కనే వున్న సముద్రంలో పారేసి రావాలి.

స్నానాదికాలు ముగించి, ఫలహారం వగైరా కానిచ్చి, సముద్రంలో ఆ వస్తువులను పారేసి వచ్చేసరికి, నే నూహించినట్టుగానే, హోటలు అట్టుడికినట్టు వుడికిపో తోంది, వినీల హత్యతో.

హోటల్లో అప్పటి కలవరానికి కారణం నాకు తెలుసు. అయినా అడిగాను, నాకు దోవలో కనిపించిన వ్యక్తిని.

ఉదయం ఆరింటికి బెడ్ కాఫీ త్రాగే అలవాటుంది వినీలకు.

ఎప్పటిలా వినీల గదికి బెడ్ కాఫీ తీసుకెళ్ళిన రూం బాయ్‌కు, ఆమె శవం దర్శన మిచ్చింది.

కాఫీ ట్రే అక్కడే వదిలేసి దెయ్యంపట్టిన వాడిలా, పిచ్చెత్తిన వాడిలా అరుచుకుంటూ వచ్చి, మేనేజరుకు రిపోర్టు చేసాడు.

ఈ మధ్య మేనేజరు యింటిలో చిచ్చురేగింది. కాలేజీలో చదువుతున్న అతని యిరవై ఏళ్ళ కూతురు ఎవరి వల్లనో గర్భిణి అయింది. ఆ సంగతి కూతురు యెంత జాగ్రత్తగా దాచుదామని ప్రయత్నించినా, తల్లి కని పెట్టేసింది.

పరువూ ప్రతిష్ఠా పోకుండా, కూతురి భవిష్యత్తుకు దెబ్బ తగలకుండా, ఆమెకు గర్భస్రావం యెక్కడ యెలా చేయించాలా అని మేనేజరు బుర్ర బద్దలుకొట్టుకుంటున్న సమయంలో వినీల హత్య సంగతి చెప్పాడు రూంబాయ్.

ఇంచుమించు మేనేజరు పిచ్చివాడయ్యాడు.

నేను మేనేజరు గదికి వెళ్లేసరికి, మేనేజరు చిందులు వేస్తున్నాడు.

నన్ను చూసిన వెంటనే సర్వసాధారణంగా విష్ చెయ్యడమో, పలకరింపుగా నవ్వడమో చేసే మేనేజరు నేను అతనికి చేరువగా పోయి కూచున్నా, పట్టించుకోనే లేదు నన్ను.

"చూడండి. మేనేజర్" అన్నాను మెల్లగా.

గిరుక్కున నా వైపుకు తిరిగి, కోపంగా చూపొకటి పారేసాడు. అంతేగాని, యింకేం మాట్లాడలేదు.

"ఎందుకండీ అంత కంగారు పడిపోతారు?" అన్నాను లాలనగా.

"ఎందుకా?...యీ హోటలు పరువు యింకేమన్నా ఉంటుందా అని! నా జీవితంలో యెరుగను యిలాంటిది" అన్నాడు ఆందోళనగా.

"చూడండి. మీరు చెయ్యగలిగింది చెయ్యలేకపోతే విచారించండి, గాని మీ చేతుల్లో లేని దానికెందుకిలా బాధపడిపోతారు? ఇంతకూ పోలీసులకు రిపోర్టుయిచ్చారా, లేదా?" అన్నాను అతని కర్తవ్యాన్ని గుర్తు చేస్తూ.

"ఆఁ...చేసాను. వస్తారు కొద్ది క్షణాల్లో" అన్నాడు విసుగ్గా, కోపంగా, దిగులుగా.

"సరే! వాళ్లే చూసుకుంటారు మిగతాదంతా. మీరేం కంగారు పడకండి" అంటూ మేనేజరు మీంచి నా చూపుల్ని గ్లాసు తలుపుల్లోంచి అవతలకు పోనిచ్చాను.

ముందు సబిన్స్పెక్టరు సీతాపతి, వెనకాల నలుగురు పోలీసులు, ఒక ఫొటోగ్రాఫరు వగైరా మందిమార్బలం హోటల్లోకి వస్తూ కన్పడ్డారు.

వాళ్ళను చూడగానే, నాకు తెలియకుండానే గుండెల్లో వణుకుపుట్టుకొచ్చింది.

సబిన్‌స్పెక్టరు సీతాపతి నాకు బాగా తెలుసు, భలే తెలివైనవాడు. మహాటక్కరి. విపరీతమైన బాహుబల సంపన్నుడు. లోకంలోని న్యాయ, ధర్మాల్ని ఉద్ధరించడానికే పుట్టాడేమో అనిపిస్తుంది.

అయితే చాలా కేసుల్లో నా సహాయం అర్థించాడు. నేనంటే ఎంతో గౌరవం కూడా.

సీతాపతి తిన్నగా మేనేజరు గదిలోకి వచ్చాడు. అటూ యిటూ పచార్లుచేస్తున్న మేనేజర్ని చూసి, ఆ వెంటనే నన్ను కూడా చూసి "అరే! మీరు కూడా యిక్కడే ఉన్నారే!" అని పలకరించి "యేమిటి సార్! మీరున్న హోటల్లోనే హత్య జరిగింది" అన్నాడు ఛలోక్తిగా.

"యేముంది. మీకు యీ మధ్య బుర్ర పదునుపెట్టే కేసులు లేవని ఎవడో పుణ్యంకట్టుకుని వుంటాడు" అన్నాను, బలవంతంగా నా మొహంమీదకు నవ్వు తెచ్చుకుంటూ.

మేనేజరు క్షణం ఆలస్యం చెయ్యకుండా మమ్మల్నందర్నీ విసీల గదికి తీసుకెళ్ళాడు.

"ఈ కేసులో కూడా మీరో చెయ్యి వెయ్యాలి" అన్నాడు సీతాపతి త్రోవలో నా భుజంమీద అప్యాయంగా చెయ్యివేసి నొక్కుతూ.

"అలాగే! మీ డిపార్టుమెంటు అణామత్తు పద్దులోంచి ఓ రెండువేలు యిలా పారేయించండి" అన్నాను.

"దానిదేముంది సార్!" అన్నాడు సీతాపతి కులాసాగా నవ్వుతూ.

నాకు మహదానందంగా వుంది. నాకు కావలసింది యిలాంటి యేర్పాటే. హత్యకు సంబంధించిన ఆచూకీ పోలీసులకు ఎంతవరకు చిక్కిందో, దర్యాప్తు ఏ పద్ధతిలో సాగుతోందో ఎప్పటికప్పుడు తెలుస్తూ వుంటుంది. దాన్ని బట్టి పోలీసుల్ని తప్పుత్రోవ పట్టించే పథకం వేయడమో, వీలయితే కన్ఫ్యూజ్ చెయ్యడమో చెయ్యొచ్చు.

వినీల గది చేరుకొన్నాం.

రాత్రి ఆమెను యేస్థితిలో వదిలి వచ్చానో అలాగే పడివుంది. తాము వచ్చేంతవరకూ శవాన్ని కదల్చడంగాని, ఆ గదిలోని వస్తువులు ఉపయోగించడంగాని చెయ్యకూడదని పోలీసులు ముందే చెప్పి ఉంచడంవల్ల, ఆగదికి తాళాలు వేయించి ఓ కుర్రాడ్ని కాపలా వుంచాడు మేనేజరు.

మమ్మల్ని చూడగానే ఆ కుర్రాడు తాళాలు తీసి తలుపులు తెరిచాడు. ఆ క్షణంవరకూ కుతూహలం పట్టలేక, అక్కడే తారట్లాడుతున్న జనం, తలుపులు తెరవగానే ఒక్కసారిగా లోపలికి త్రోసుకు రాబోయారు.

అయితే, పోలీసులు వాళ్ళని అదిలించి అదుపులో పెట్టారు.

ఈలోపున పోలీసుల ఆదేశానుసారం, వినీలను వుంచుకున్న వరహాలరాజుకు వినీల హత్య గురించి టెలిగ్రాం ద్వారా తెలియపర్చడం జరిగింది.

ఒక ప్రక్క ఫోటోగ్రాఫరు శవాన్ని, శవం వున్న పరిసరాల్ని వివిధకోణాల్లో ఫోటోలు తీస్తుంటే పౌడరు చల్లి లభ్యమైనంతవరకు వేలిముద్రలకోసం వెతికారు పోలీసులు.

సాయంకాలం అయిదు అయ్యాకగాని, శవాన్ని మార్చ్యురీకి తరలించడం జరగలేదు.

శవాన్ని, శవం వున్న పరిసరాల్ని పోలీసులు పరిశీలిస్తుండగా నేనూ వున్నాను. నన్ను వేలెత్తి చూపించేదేదీ వాళ్ళకు చిక్కలేదు. నా వేలిముద్రలు మాత్రం దొరుకుంటాయి. అయితే, నా వేలిముద్రలతోపాటుగ, వినీల మిగతా స్నేహితులందరివి కూడా దొరుకుతాయి. వాటివల్ల నాకే ప్రమాదంలేదు.

నాకు మహదానందంగా వుంది!

# 9

మర్నాటినుంచి వినీల హత్యకేసు దర్యాప్తు ఆరంభమైంది.

"గురువుగారూ! మీతోనే దర్యాప్తు ఆరంభిద్దాం. ఏమంటారు?" అన్నాడు సీతాపతి.

"అలాగే కానివ్వండి" అన్నాను.

"ఆఖరుసారిగా మీరు వినీలను యెప్పుడు చూసారు?" అడిగాడు సీతాపతి.

"హత్య జరిగిన నాటిరాత్రే...అంటే... మొన్నరాత్రి పదకొండుం పావు...సుమారు కావచ్చు" చెప్పాను జాగ్రత్తగా.

అయినా నా గుండెలు గాభరాగా కొట్టుకోవడం మానలేదు.

ఇలాంటి దర్యాప్తులు చాలా చూసాను. సర్వసాధారణంగా పోలీసులు వేసే ప్రశ్నలు యెలా వుంటాయో నాకు తెలుసు. నెమ్మదిగా జవాబు లీయసాగాను.

"మీరామెను ఆఖరుసారిగా చూసినప్పటి దృశ్యాన్ని వర్ణించండి" అన్నాడు సీతాపతి.

రాత్రి పదకొండుగంటలవరకూ ఎలా ఆమెతో కబుర్లతో గడిపానో, ఆ తరువాత ఎలా ఆమె సెలవు తీసుకుని, శ్యాంబాబును వెనక్కి వదిలేసి వచ్చానో వివరంగా చెప్పాను.

నేను విసీలకు గుడ్ నైట్ చెప్పి వచ్చాక, నా తరువాత శ్యాంబాబు ఆమెతో వున్నాడన్న విషయం అతి నేర్పుగా, అతి స్పష్టంగా పోలీసుల మనస్సులోకి యెక్కించాను.

ఆ అంశాన్ని సీతాపతి ప్రత్యేకంగా నోట్ చేసుకుని అండర్ లైన్ కూడా చేసుకున్నాడు.

"ఇక చాలెండి సార్! మీరొచ్చి యిలా నా ప్రక్కన కూర్చోండి. మిగతావాళ్ళని ప్రశ్నిద్దాం" అన్నాడు తన ప్రక్కనున్న ఒక ఖాళీ కుర్చీ చూపిస్తూ.

గుండెలమీంచి యేదో బరువుదించేసినట్టుగా, బరువుగా నిట్టూర్చి, లేచి, సీతాపతి చూపిన కుర్చీలో కూచున్నాను.

హోటలువాళ్ళు పంపించిన కాఫీ త్రాగాకగాని, నా మనసు కుదుటపడలేదు.

ఖాళీ కాఫీ కప్పులు తీసుకుపోతున్న కుర్రాడ్ని ఆపి "శ్యాంబాబుని నేను రమ్మన్నానని చెప్పు" అన్నాడు సీతాపతి.

"అలాగే సర్!" అని చెప్పి కుర్రాడు వెళ్ళిపోయాడు.

నేను ఆలోచనల్లో పడ్డాను.

శ్యాంబాబు చీకాకుల్లో పడ్డం ఖాయం. దర్యాప్తులో అతడి ఊరు, పేరు మొదలైన వివరాలన్నీ చెప్పకతప్పదు.

ఇంకా దూరంపోయి, పోలీసులు ఆరాతీయడం ఆరంభిస్తే, అంతకుముందే అతడిమీద ఓ హత్యాకేసు ఉందని తెలియవస్తుంది. వినీల హత్యానేరం కూడా సహజంగా అతనిమీదే మోపబడుతుంది. పైగా వినీల బ్రతికుండగా చూసిన ఆఖరు వ్యక్తి శ్యాంబాబు.

మేం ఉన్న గదిలోకి మేనేజరు రాగానే, నా ఆలోచనలు ఆగిపోయాయి.

"శ్యాంబాబు కోసం అడిగారుట కదూ?" అన్నాడు మేనేజరు, సీతాపతికి ఎదురుగా వచ్చి నిలుచుంటూ.

"అవును. యేం?" అన్నాడు సీతాపతి, మేనేజరు మొహంలోకి ప్రశ్నార్థకంగా చూస్తూ.

"ఆయన...ఆయన..." నసుగుతున్నాడు మేనేజరు.

"అలా నీళ్ళు నములుతారేం. చెప్పండి" గద్దించాడు సీతాపతి.

"ఆయన నిన్నటినుంచి గదిలో అవుపించడం లేదండి" చెప్పాడు మేనేజరు.

"ఏమిటీ? గదిలో లేడూ?" తను కూర్చున్న కుర్చీలోంచి దూకినట్టుగా లేచాడు సీతాపతి కంగారు పడ్తూ.

"లేడు" చెప్పాడు మేనేజరు.

"ఎక్కడికి వెళ్లాడో ఎవరితోనయినా చెప్పాడా?"

"లేదండి."

"ఆయన గదితాళాలు మీ వద్ద వున్నాయి కదూ?"

"ఉన్నాయండి."

"పదండి. ఆయన గది చూడాలి" అన్నాడు సీతాపతి లేచి బయలుదేరుతూ.

పట్టరాని సంతోషంగా వుంది నాకు. శ్యాంబాబు

హోటలు వదిలిపోయి వినీల హత్యానేరం పూర్తిగా తన మీదకు తెచ్చుకున్నాడు.

శ్యాంబాబు గదికి వెళ్లాం. మేనేజరు తాళం తీసాడు. బోసిగావున్న గది వాలకంబట్టి, శ్యాంబాబు వున్నఫళంగా హోటలు విడిచి వెళ్ళిపోయాడని అర్ధమవుతోంది.

"శ్యాంబాబు మీకేమన్నా బాకీ వున్నాడా?" అడిగాడు సీతాపతి మేనేజరు వైపు తిరిగి.

"లేదు. గదికి ఓనెల అద్దె అడ్వాన్సుగా యిచ్చాడు. ఇహ, యేరోజు కారోజు నగదుచెల్లించి గాని, భోజనం వగైరా తీసుకోడు" చెప్పాడు మేనేజరు.

"అయినా, మీకు తెలియకుండా ఆయన ఆ గది ఖాళీ చెయ్యడం ఎలా జరిగింది?"

"సింపుల్! ఊరుకెళ్ళి వస్తానని ఎప్పటి మాదిరిగా తన పెట్టెలు తీసుకుని బయలుదేరాడు. ఆ తరువాత, ఓ కుర్రాడి ద్వారా గది తాళం మాకు అందజేసాడు."

"సరేలెండి" అని చెప్పి సీతాపతి గది బయటికి వచ్చేసాడు అతనితోపాటుగ మిగతావారం కూడా వచ్చేసాం వెలుపలికి.

"ఈ కేసులో మీ అభిప్రాయం యేమిటి?" అడిగాడు సీతాపతి త్రోవలో.

"ముందు మీ ఆలోచనా ధోరణి చెప్పండి" అన్నాను, వెంటనే అతనికి జవాబీయకుండా.

"నేరసుడు తనను తానే బయటపెట్టుకున్నాడు. మీరేమంటారు?" అన్నాడు సీతాపతి, నా కళ్ళల్లోకి నిశితంగా చూస్తూ.

"నేనూ అదే అనుకుంటున్నాను. మా అందరికన్నా, వినీలతో ఎక్కువగా చనువుగా వుంటాడు శ్యాంబాబు.

ఒకనాడు మేం కూడా వినీలను పొందాలని అర్రులుచాచిన వాళ్లమే. అయితే, ఆమె గగన కుసుమమనీ, లేచి వచ్చిందయినప్పటికీ, ఆమెకూ ఓ నీతి వుందని అర్థం చేసుకుని, ఆమెతోటి సాహచర్యమే పదివేలనుకుని ఊరుకున్నాం. అయితే, శ్యాంబాబు యువకుడు. ఆడది మృదువుగా తిరస్కరిస్తే పోనీ లెమ్మని ఊరుకునే రకంకాదు, అతడు. నా ఉద్దేశంలో, ఆమెతో వ్యవహారం సాగిస్తూ వుండాలి. అది బెడిసికొట్టగానే యీ అకృత్యానికి పాల్పడివుండాలి" అన్నాను అతి నేర్పుగా, సీతాపతి మనస్సులోని అస్పష్టంగా వున్న అనుమానాన్ని దృఢపరుస్తూ.

ఆ తరువాత ఆ రాత్రి వినీల గదికెళ్ళి వచ్చిన వాళ్ళందర్నీ ప్రశ్నించాడు సీతాపతి. ఇంచుమించు నా అభిప్రాయాలకు సమానమైనవే వారూ చెప్పారు.

"అంటే, మనం శ్యాంబాబు గురించి వెతకాలి" అన్నాడు సీతాపతి, చివరకు ఓ నిర్ణయాని కొచ్చినట్టు.

"అంత సులువుగా దొరుకుతాడనుకోను. అతన్ని పట్టి తెచ్చి యిచ్చినవారికి గాని, అతని ఆచూకీ అందించిన వారికి గాని, పెద్ద బహుమానమే యిస్తామని పేపర్లలో ప్రకటన వేయించడం మంచిది" సలహా యిచ్చాను.

అవాల్టికి దర్యాప్తు ముగిసింది.

# 10

వినీలను వుంచుకున్న వరహాల్రాజు ఊర్లోకి వచ్చాడనగానే, సబిన్స్పెక్టరు సీతాపతి అతడ్ని హోటలుకు పిలిపించాడు.

వరహాల్రాజుని ప్రశ్నిస్తున్నప్పుడు నేను కూడా వున్నాను.

"ప్రాణానికి ప్రాణంగా మీరు ప్రేమించిన వినీల హత్య చెయ్యబడినందుకు, మీరెంతో విచారిస్తున్నారనుకుంటాను. మేం వేసే ప్రశ్నలకు జవాబులిచ్చి మాతో సహకరిస్తే, హంతకుల్ని పట్టి జైలుకి పంపించవచ్చు" అంటూ ఆరంభించాడు సీతాపతి.

"చూడండి సబిన్స్పెక్టరుగారూ! ఎన్నివేలు ఖర్చయినా సరే వెనుకాడకండి. నా వినీలను హతమార్చిన వాణ్ని పట్టి ఉరికంబం యెక్కించండి. అప్పుడుగాని నాకు తిండి సహించదు. నిద్రరాదు. నేను మామూలు మనిషిని కాలేను" అన్నాడు వరహాలరాజు ఆవేశంగా.

"ఆవేశపడకండి వరహాలరాజుగారూ! మేమూ అదే ప్రయత్నంలో వున్నాం......వినీల యెవరు? ఆమెను ఎలా యీవూరుకి తీసుకొచ్చారు మొదలైన వివరాలు చెప్పండి" అన్నాడు సీతాపతి అసలు వ్యవహారంలోకి వస్తూ.

"ఆమెను నేను ఓ లాడ్జింగు హౌస్‌లో చూశాను. సరికొత్తసరుకు అంటూ లాడ్జింగువాడు చెప్పి తీసుకెళ్ళాడు. ఆమెను చూడగానే, నా ఆశ్చర్యానికి అంతులేదు. ఆమె అందం అపూర్వం. గొప్పింటినించి వచ్చిన ఆమెలా వుంది. ఆమెను అన్ని విషయాలూ కనుక్కోవాలని పూనుకొన్నాను. కాని, నాకు ఒక్క విషయమూ చెప్పింది కాదు. 'నాకు గతం, వర్తమానాలు లేవు. నాకు భవిష్యత్తు ఒక్కటే వుంది' అని అంది.

"ఆమెను ఆ నరకకూపంలోంచి బయటకు లాక్కొచ్చేంతవరకూ నాకు శాంతిలేదనిపించింది. ఆమెను నాకు వదిలెయ్యాలంటే యేం యిమ్మంటావని లాడ్జి యజమానిని

అడిగాను. 'రెండువేలిచ్చి ఆమెను తెచ్చాం. పైగా దానిమీద వడ్డీ. ఆమె మీతో వెళ్ళిపోవడంవల్ల మాకు కలిగే వ్యాపారనష్టం మొత్తం అయిదువేలు యివ్వండి' అన్నాడు లాడ్జింగు యజమాని. వాడు కోరిన అయిదువేలు వాడి మొహానకొట్టి, ఆమెను యిక్కడకు తెచ్చాను.

"అయితే, గత రెండు నెలల్నుంచీ, మా మధ్య కొన్ని అభిప్రాయభేదాలు తలెత్తాయి. అందుకు కారణం కొంత వరకూ నేనే. 'నన్ను పెళ్లి చేసుకోండి. ఎన్నాళ్ళీ దొంగ బ్రతుకు? సంఘంలో నేను గర్వంగా తలెత్తుకు తిరిగే అవకాశం యివ్వండి' అని రోజూ అనడం ప్రారంభించింది. 'అదిగో! ఇదిగో!' అంటూ దాటి వేస్తున్నాను.

"వినీల కోరికను వెంటనే తీర్చలేక పోవడానికి కారణం నా కుటుంబ వ్యవహారాలు. వినీలకు కబుర్లు చెప్పడమన్నా, ఎవరైనా చెబుతుంటే వినడమన్నా మహా సరదా. ఆమె సరదాని అపార్థం చేసుకున్న వాళ్లెంతమందో ఉన్నారు. ఆమెకు అందమైన మగాళ్ళంటే వెర్రి అనుకుని కొంతమంది ఆమెను లోబరుచుకోబోయారు. ఆమె తిరస్కరించింది వారిని సుతిమెత్తగా.

"అందుకు ప్రతిగా, మగాళ్లతో స్నేహం తగ్గించుకోమని నేను నిత్యమూ పోరసాగాను. 'నేను సంతలో చింత పండులాంటి దాన్ని. ఎవరైనా బేరమాడి కొనుక్కోవచ్చు' అని పెళుసుగా జవాబిచ్చేది. అందుకు నేను కోపం తెచ్చుకోబోతే 'చూడండి! పెళ్ళయిన ఆడదాని వైపు కళ్ళెత్తి చూడాలంటే, ఏ మగాడయినా ఒకటికి పది గాళ్లు ఆలోచిస్తాడు. కాబట్టి నన్ను పెళ్ళి చేసుకోండి అని నేది" అని ముగించాడు వరహాలరాజు వినీల వృత్తాంతం.

"ఆమెకు మగాళ్లతో స్నేహం యెక్కువంటున్నారు. అటువంటప్పుడు, మీకు ప్రత్యేకంగా యే మగాడి మీదన్నా అనుమానం వుందా?" ప్రశ్నించాడు సీతాపతి రెండు నిముషాలు పోయాక.

"అనుమానించాల్సి వస్తే యీ హోటల్లోవున్న మగాళ్ల నందర్నీ అనుమానించాలి. ఆఖరుకు యీ రచయిత గార్ని కూడా" అన్నాడు వరహాల్రాజు నా వైపు చెయ్యి చూపించి.

నా గుండె గుభేలుమంది, నాకు తెలియకుండానే.

"కాని" వరహాల్రాజే మళ్లా చెప్పసాగాడు. "వినీల చనిపోయాక, శ్యాంబాబు పారిపోవడంతో, నాలో పొడ చూపిన కొన్ని అనుమానాలు యిప్పుడు నిజమేనేమోనని అనిపిస్తున్నాయి."

"ఏమిటవి?" మధ్యలో అడ్డు తగిలి అన్నాడు సీతాపతి.

"పగలనక, రాత్రనక, ఎప్పుడూ మా గదిలోనే వుండేవాడు శ్యాంబాబు వినీలతో కబుర్లు చెప్పతూ. నేను వుంటే మాత్రం వుండేవాడు కాదు. అయితే, నేనలా బయటికి వెళ్ళిపోయానని తెలియగానే, మరుక్షణంలో తయారయ్యేవాడు. చూపుల్లోనూ, చేష్టల్లోనూ, తన కోరిక వ్యక్తపరిచేవాడు శ్యాంబాబు మొన్న మొన్నటివరకూ. ఈ మధ్యనే, నోటితో చెప్పాడట వినీలకు. 'అందుకే, మగాళ్లతో స్నేహం తగ్గించుకోమని చెప్పాను' అని వినీలను మందలించాను. ఎందుకో వూరుకుంది. ఆ ప్రస్తావన మరి యెత్తలేదు. సుతిమెత్తగా అందరికిలాగే, అతడ్ని మంచి మాటలతో బుజ్జగించి వుంటుంది. అతడి గురించి

మరి యే ఫిర్యాదు చెయ్యలేదు ఆ తరువాత," చెప్పాడు వరహాలరాజు.

"ఇంకా మీ మనస్సులో యేమన్నా రహస్యాలు దాగి వుంటే, అవి వినీల కేసును పరిష్కరిస్తా యనుకుంటే చెప్పండి" అన్నాడు సీతాపతి.

"ఇంకేం లేవండి" అన్నాడు వరహాలరాజు, రెండు నిముషాలు దీర్ఘంగా ఆలోచించి.

"అయితే మీరిక వెళ్ళవచ్చు" అని సీతాపతి అనగానే, అతనికి నమస్కరించి వెళ్ళిపోయాడు వరహాలరాజు.

"వరహాలరాజు మీద మీ అభిప్రాయం యేమిటి?" అడిగాడు సీతాపతి నా వైపు తిరిగి వరహాలరాజు వెళ్ళి పోగానే.

వెంటనే నేను యే జవాబు చెప్పలేదు.

నాలుగయిదు నిముషాలు ఆలోచించాను.

వినీలకూ, వరహాలరాజుకు అభిప్రాయ భేదాలున్న విషయం నాకింతవరకూ తెలీదు. ప్రస్తుతం శ్యాంబాబు హంతకుడు అన్న దిక్కుగా సాగుతోంది పోలీసుల ఆలోచన.

వరహాలరాజు చెప్పిన సంగతుల్ని ఆధారం చేసుకుని కేసుని మరింత గజిబిజి చేస్తేనో?

అవును! అలా చెయ్యడంవల్ల కొన్ని ప్రత్యేక లాభాలున్నాయి!

శ్యాంబాబు దొరికినా, దొరక్కపోయినా, కేసు అనుమానాల సుడిగుండంలో పడుతుంది. ఎటూ తేలదు.

మెల్లగా చెప్పసాగాను.

"వరహాలరాజు కథవల్ల మనకు మరికొన్ని కొత్త విషయాలు తెలిసాయి. వినీల, వరహాలరాజుల మధ్య మనం

అనుకుంటున్న సామరస్య సంసారం సాగడం లేదు. వినీల లేచివచ్చిన బాపతు. ఆమె అందానికి ఆకర్షింపబడో, యింకో కారణంవల్లనో, క్షణికోద్రేకంలో లాడ్జింగ్ నుంచి, ఆమెను తీసుకొచ్చాడు వరహాల్రాజు. అయితే, వినీల దూరాలోచనగల ఆడది. వరహాలరాజును పెళ్లి చేసుకోవాలన్న ఆశతో వుంది. వినీల అలా పట్టుబడుతుందని అనుకోలేదు వరహాల్రాజు. సంఘంలో అతడి గౌరవజీవితం దెబ్బతినే అవకాశం వుంది. వినీల రోజు రోజుకీ అతడికో తలనొప్పిగా తయారయ్యింది. ఆమెను వదిలించుకోవాలని యీ సాహసం చేసాడేమో? ఇది నా అనుమానం ఆలోచనా రీతి మాత్రమే'' అన్నాను.

''అయితే'' అందుకున్నాడు సీతాపతి. ''మీ ఆలోచనల్లో చిన్న లోపం వుంది. ఇద్దరు పెళ్లాలుంటేనే, తన గౌరవజీవితం దెబ్బతింటుందని భయపడ్డ వరహాల్రాజు, హత్యకు సిధపడగల డంటారా? అంతేగాదు. పరపురుషులతో చనువుగా తిరిగే ఆమెను వారించేవాడు కాదు. పైగా ప్రోత్సహించేవాడు. ఎవడ్నో ఒకడ్ని తగులుకుని ఆమె వెళ్లిపోతే, వరహాల్రాజు యిబ్బంది సునాయాసంగా తొలగిపోతుంది.''

సీతాపతి తెలివితేటలు చూసి నా గుండెలు గుభేలుమన్నాయి. నా వాదనలోని లోపాలన్నీ ఒక్క క్షణంలో ఏరిపారేసాడు.

''అబ్బెబ్బె! నా ఉద్దేశం వినీలను వరహాల్రాజు హత్య చేసాడని కాదు. అతడి కదలికల్ని కూడా పరిశీలించి చూడాలని'' సర్దాను.

''అవునవును! అది నిజమే. అతడ్ని అనుసరించి, అతడి గురించి భోగట్టా సేకరించమని యిద్దరు పోలీసుల్ని నియ

మిస్తాను" అన్నాడు సీతాపతి.

నా గుండెలు స్థాయినబడ్డాయి, సీతాపతి అలా అనడంతో.

# 11

రెండు నెలలు గడిచిపోయాయి. వినీల హత్య కేసు ఎటూ తేలలేదు.

వారానికి రెండుసార్లయినా హోటలుకివచ్చి, ఎవర్నో ఒకర్ని ప్రశ్నించి, నా సలహా అడిగి వెళ్లిపోతున్నాడు సబిన్స్పెక్టరు సీతాపతి.

శ్యాంబాబు పోలికలు యిచ్చి ఓ ప్రకటన వేయించింది పోలీసు డిపార్టుమెంటు, దేశంలోని ప్రముఖ పత్రికల్లో.

దాని ప్రకారం శ్యాంబాబుని బంధించి తెచ్చిన వారుగాని, లేదా అతని ఉనికికి సంబంధించిన ఆచూకీ యిచ్చిన వారుగాని, వెయ్యిన్నూటపదహార్ల బహుమానం పొందుతారు.

శ్యాంబాబు గురించి ఏవో రెండు మూడు వర్తమానాలు వచ్చాయిగాని, తీరా పోలీసులు వెళ్లిచూసేసరికి, ఆ వ్యక్తి ఎవరో అక్కడ్నుంచి అదృశ్యంకావడమో ఒక వేళవున్నా ఆ వ్యక్తి, శ్యాంబాబు కాకపోవడమో సంభవించింది.

వ్యాపారరంగంలో వరహాలరాజుకు పెద్ద పేరుంది. అతని తండ్రి బంగార్రాజు దేశంలోని అనేక సంస్థలకు భూరివిరాళాలు యిచ్చాడు. ప్రతి స్కూల్లోనూ, ప్రతి కాలేజీలోనూ అటు పేదవిద్యార్థులకూ, యిటు తెలివైన విద్యార్థులకూ సహాయం చెయ్యడంకోసం, వరహాలరాజు గారి పేర, అతని భార్య పేర, అతని తండ్రి పేర స్కాలర్ షిప్స్ వున్నాయి.

అయితే, అతడికో బలహీనత వుంది. అదే స్త్రీలో లత్వం! ఆ సంగతి భార్యకు తెలుసు. పిల్లలకు తెలీదు. వినీలను తెచ్చి హోటల్లోవుంచి పోషిస్తున్న సంగతి భార్యకు తెలుసు.

"పోన్లెండి! ముక్కూ మొహం తెలీని ఆడవాళ్ళవద్దకు పోయి రోగాలు అంటించుకుని బాధపడ్డంకన్నా యిది నయం" అందిట ఆమె, వినీల గురించి వార్త ఆమె వినగానే.

అంతటి సహనశీలను వదిలెయ్యడంగాని, ఆమె హోదా తగ్గించడంగాని వరహాల్రాజుకు యిష్టంలేదు. అందుకే వినీలను పెళ్లి చేసుకోలేదు.

సీతాపతి హోటలుకు వచ్చి రెండు వారాలకుపైగా దాటింది. వినీల హత్యకేసు గురించి కొత్త విషయాలు తెలియడంలేదు.

కేసు ఎంతవరకూ వచ్చిందో, యేం కొత్త విషయాలు వెలుగులోకి వచ్చాయో తెలుసుకోవాలన్న కుతూహలం పట్టలేకపోయాను.

నేనే పోలీసు స్టేషనుకు వెళ్ళాను. నేను వెళ్లేసరికి, సీతాపతి లోనికి ఆహ్వానించాడు నన్ను. తన కెదురుగా వున్న కుర్చీ చూపించాడు కూర్చోమని.

"ఏమిటీ మధ్య హోటలుకు రావడం మానేసారు?" అన్నాను మెల్లగా.

"ఇంక రావడం అనవసర మనిపిస్తోంది" చెప్పాడు సీతాపతి.

"ఏం అలాగ?" ఆశ్చర్యంగా అడిగాను.

"నిన్నసంటే నిన్న స్వయంగా వచ్చాడు శ్యాంబాబు పోలీసు స్టేషనుకు."

"వచ్చి?" అన్నాను కుతూహలంగా మధ్యలో కల్పించుకుని.

"తనెందుకు పారిపోవాల్సి వచ్చిందో చెప్పాడు. కావలిస్తే దర్యాప్తు చేసుకోమన్నాడు."

"ఏం చెప్పాడు?"

ఆవేశంతో గుబగుబలాడిపోతున్న గుండెల్ని అదుపులో పెట్టుకోలేక పోతున్నాను.

"తనమీద యింకో హత్యానేరముంది. దర్యాప్తులో ఆ విషయం యెలాగూ బయటకు వస్తుంది. విసీలను తను హత్య చెయ్యలేదని యెంత గోలపెట్టినా, మేం వినమని పారిపోయాడట."

"అయితే, ఆ కేసేమయింది?"

హత్య జరిగి ఆ నేరం ఓసారి ఒకడిమీద మోపడమే జరిగితే, అందులోనుంచి వాడు బయటపడ్డం ఒకటా?

ఏం జరిగుంటుంది? కుతూహలం పట్టలేకపోతున్నాను.

"శ్యాంబాబు తల్లి చనిపోతూ కొడుకు పేరే తలుచుకుని తలుచుకుని ప్రాణాలు వదిలిందట. కొడుకును చూడాలన్నది ఆవిడ చివరికోరికట. అయితే కొడుకు అక్కడకుపోలేదు. అతని మీద పోలీసుల నిఘా ఉంది. కొడుకును తలుచుకుంటూ, ప్రాణాలు పోగొట్టుకున్న ఆ తల్లి హృదయవిదారక స్థితి చూశాడు శ్యాంబాబు ప్రేయసిని హత్యచేసిన హంతకుడు. ఆ క్షణం వరకు అతనిలో మరుగుపడ్డ మానవుడు అతనిలోని రాక్షసాంశమీద ఎదురు తిరిగాడు, వెంటనే జరిగిందంతా చెప్పేస్తూ, శ్యాంబాబు నిర్దోషిత్వాన్ని తెలుపుతూ, ఒక స్టేట్‌మెంట్ యిచ్చి, తనంతట తను పోలీసులకు లొంగిపోయాడు అవ్యక్త" అంటూ ముగించాడు సీతాపతి శ్యాంబాబు వృత్తాంతాన్ని.

నేనాశించని మలుపు తిరిగింది కథ. శ్యాంబాబుమీద ఓ హత్యానేరం ఉంది కాబట్టి, వినీల హత్యానేరం కూడా అతడి మీదకే వెళ్తుందనుకున్నాను. కొద్ది రోజులపాటు అలాగే జరిగిందికూడా.

అయితే పాత నేరం విషయంలో అతడు నిర్దోషిగా నిరూపింపబడ్డాడు. ఇహ, వినీలనుకూడా అతడు చంపలేదు. ఈ కేసులోకూడా తను నిర్దోషని శ్యాంబాబు వాదిస్తే, అతడి వాదానికి బలం వస్తుంది, పోలీసు డిపార్టుమెంటు, కోర్టు, లోకం అతడి గోడు వింటుంది, నమ్ముతుంది.

ప్రస్తుతానికి పోలీసువాళ్ళ ఆలోచనలు ఎలా ఉన్నాయో తెలుసుకోవడం తప్ప నేను వేరే చెయ్యగలిగిందేమి లేదు.

"అయితే, యేంచేద్దామనుకుంటున్నారు?" అడిగాను, రెండు నిమిషాల మవునానంతరం.

"యేముంది...అటు వరహాల్రాజుకు వినీలని చంపడంలో 'మోటివ్' లేదు. ఇటు శ్యాంబాబు, దొరికిన దొంగ— దొంగ కాడు, మొదట అనుమానించినట్టుగా. కేసు మళ్ళా మొదటి కొచ్చింది. హంతకుడెవరోగాని, మహా తెలివిగా హత్య చేశాడు. కామ దృష్టితో హత్యచేసినట్టు పైకి అనిపిస్తోంది కాని, అతడి మోటివ్ అర్థంగావటంలేదు. కేసంతా పునఃపరిశీలనం చెయ్యడం తప్ప వేరేగత్యంతరం లేదు. ఈలోపున మీరు కూడా దీనిగురించి జాగ్రత్తగా ఆలోచించి అయిడియాస్ యేమన్నా ఉంటే చెప్పండి" అన్నాడు సీతాపతి.

## 12

అవాళ ఉదయం పదకొండు గంటలయింది. బయట "ప్లీజ్ డోన్ట్ డిస్టర్బ్ మీ" అన్న బోర్డు పెట్టి, గదిలో

కూచుని నవల రాయడంలో మునిగిపోయాను.

గదిలో ఫోన్ మ్రోగింది. ఎత్తేసరికి లీనా గొంతు పలికింది అందులో.

"ఎస్ మైడియర్! వాట్ కెన్ ఐ డూ ఫర్ యూ?" అన్నాను హుషారుగా.

"సీతాపతిగారినుంచి మీకో పిలుపు వచ్చింది సార్! మిమ్మల్ని తీసుకు రమ్మని జవాన్ని పంపించారు. బయట 'డోంట్ డిస్టర్బ్' బోర్డు చూసి తలుపు తట్టడానికి జంకి ఫోన్ చెయ్యమని బ్రతిమాలుకున్నాడు నన్ను" చెప్పింది లీనా.

సీతాపతి నన్ను పిలవనంపాడన్న విషయం వినగానే, నా గొంతు ఎవరో పట్టి నొక్కినట్టయింది. ఇందాకటి హుషారు యెగిరి పోయింది.

ఒక్క క్షణం మాటాడలేక పోయాను. తేరుకుని "ఎందుకుట!" అన్నాను.

నాగొంతు నాకే విచిత్రంగా ధ్వనించింది ఆక్షణంలో.

"వినీల కేసు విషయంలో కొత్త సమాచారమేదో దొరికిందట. మీతో అర్జంటుగా చర్చించాలట" అందామె.

"అయితే వెళ్ళక తప్పదంటావా డియర్?" అన్నాను పైకి. కాని, లోలోన, అదేమిటో తెలుసుకోవాలన్న తపనంగా ఉంది.

"మిమ్మల్ని తప్పక తీసుకురమ్మని జవానుతో మరీ మరీ చెప్పి పంపారట. మిమ్మల్ని యెక్కువసేపు ఉంచెయ్యరట" అంది లీనా.

"ఓకే! అయిదు నిమిషాల్లో బట్టలు మార్చుకుని వస్తా

న్నానని చెప్పి జవాన్ను పంపేయ్'' అన్నాను ఫోను నా చెవినుంచి దూరం చేస్తూ.

"అలాగే సర్!'' అంటూ లీనా ఫోను పెట్టేసిన శబ్దం లీలగా విన్పించింది, క్రేడిల్ చేస్తున్న ఫోనులో.

బట్టలు మార్చుకుని, ఆటోరిక్షాలో స్టేషనుకు బయలు దేరాను.

నా కోసమే సీతాపతి యెదురు చూస్తున్నాడేమో, నన్ను చూడగానే అతని మొహం విప్పారింది.

"రండి సార్! రండి'' అంటూ నన్ను ఆహ్వానించి, తన కెదురుగా వున్న కుర్చీలో కూచోమన్నాడు.

కూచున్నాను 'థేంక్స్' చెప్పి.

"వీరాస్వామీ! ఆ ప్లాస్టిక్ సంచీ యిలా పట్రా!'' కేకేసాడు సీతాపతి ఒక పోలీసు జవాన్నుద్దేశించి.

వీరాస్వామి అక్కడున్న ఓ కర్ర బీరువాలోంచి నీలం రంగు ప్లాస్టిక్ సంచీ తీసి తెచ్చి సీతాపతి టేబిలుమీద వుంచాడు.

ఆ సంచీని చూడ్డంతోనే నా ప్రాణాలు పైపైనే ఎగిరి పోయాయి.

వినీలను హత్య చెయ్యడానికి నేను ఉపయోగించిన నైలాన్ తాడు, ఆ సమయంలో నేను చేతులకు ధరించిన గ్లవుజు, ఆ ప్లాస్టిక్ సంచిలోనే వుంచి, సముద్రంలో పారేసాను.

అదే యిప్పుడు నా ఎదురుగా వుంది!

అది సీతాపతికి యెలా దొరికింది?

"మీ కిది యెక్కడ దొరికింది?'' అన్నాను నాలో రేగుతున్న కలవరాన్ని కప్పిపుచ్చుకునే ప్రయత్నం చేస్తూ.

"మొన్న సాయంకాలం మా జవానొకడు సముద్ర పొడ్డుకు షికారు వెళ్ళాడు. ఇంటి దగ్గర ఏదో తగువైందట. మనస్సు బాగోలేక, అలా సముద్రపొడ్డున నడుచుకుంటూ చాలా దూరం వెళ్ళాడట. అక్కడ సగం ఇసుకలోనూ, సగం ఒడ్డుమీదపడి వున్న యీ సంచీ అవుపించిందట. మనుషులు తిరుగాడని యీ స్థలంలో యిదిక్కడ కెలా వచ్చిందో అనుకుని చేతిలోకితీసి చూసాడట. లోపల గ్లవుజు, నైలాన్ తాడు అవుపించాయట. నాకిచ్చాడు స్టేషనుకు తెచ్చి. వినీల హత్య యెలా జరిగిందో పోస్టుమార్టమ్‌లో తెలిసిన వివరాలు అతడికి తెలుసు" చెప్పాడు సీతాపతి.

అయోమయావస్థలో పడ్డాను నేను. ఆ నైలాన్ తాడు, గ్లవుజు తొందరగా వదిలించుకోవాలి, ఆ పని యెవరూ చూడరాదన్న ఆతృతలో ఆ సంచీని సముద్రంలో పారేసాను.

సముద్రంలో యేది పారేసినా ఒడ్డుకు కొట్టుకొస్తా యన్న విషయం ఆ క్షణంలో యెలాగో మరవునబడింది.

ఆ సంచీ తిన్నగావచ్చి పోలీసుల చేతిలోపడింది. నాలో ఝుంఝూమారుతం రేగింది.

అయినా...ఒక్క క్షణం మనస్సును కేంద్రీకరించాను. నా భయానికి ఆధారమేదైనా వుందా అని ఆలోచించాను.

నిజమే! వినీలను అంతం చెయ్యడానికి ఆ వస్తువుల్ని వుపయోగించాను.

అయితే, అది నేనేనని పోలీసులు యెలా తెలుసుకో గలరు?

ధైర్యం చేరుకుంది గుండెల్లో!

"బావుంది! ఇహ వీటి సాయంతో మనం హంతకుల్ని

పట్టుకోవడమే తరువాయి" అన్నాను దీర్ఘంగా నిట్టూర్చి, అప్పుడే ఆలోచనల్లోంచి తేరుకున్నట్టుగా.

"అవును! ఈ వస్తువుల్ని ఆ వ్యక్తి సముద్రంలో పారేసాడంటే, అతడెవరో పైవాడుకాదు. హోటల్లో వున్నవాడే! హోటలు వెనకనే గదా సముద్రముంది! అంతేగాదు. సాధారణంగా నైలాన్ తాడు నిర్ణీతమైన కొలల్లోగాని కొట్టువాడు అమ్మడం జరగదు. అంటే హంతకుడి వద్ద, యీ ముక్క కోయగా మిగిలిన తాడు వుందన్న మాట."

"అయిడియా అద్భుతంగా వుంది" అన్నాను పైకి అతన్ని మెచ్చుకుంటూ. కాని, భయం ఉప్పెనలా పెరుగ సాగింది.

తడిబట్టల్ని ఆరబెట్టడానికి వీలుగా తాడు కట్టడానికి రెండు మీటర్ల నైలాన్ తాడు కొనితెచ్చాను బజారు నుంచి. అందులో ఓ ముక్క కోసి, వినీల హత్యకోసం ఉపయోగించాను. మిగిలిన తాడు గదిలోవుంది. దాన్ని వెంటనే వదిలించుకోవాలి. ఈ క్షణంలో హోటల్లోని గదులన్నీ పోలీసులు చెక్ చెయ్యడం ఆరంభిస్తే, నేనే హంతకుణని నిర్ధారణ కావడానికి యెంతోసేపు పట్టదు.

వెంటనే గదికిపోయి, ఆ తాడును వదిలించుకోవాలన్న ఆరాటం మొదలయ్యింది నాలో.

నేను కూచున్న కుర్చీ ముళ్ళకంపలా వుంది.

"అయితే రేపు చెక్ చేసేద్దాం హోటలు గదులన్నీ" అన్నాను. అలా అయితే, మిగిలిన నైలాన్ తాడు వదిలించుకోవడానికి నాకు కావలసినంత వ్యవధి వుంటుందని ఆశ!

"అలాగే. మీరూ సాయం చేయాలి" అన్నాడు సీతాపతి.

"తప్పకుండా!" అన్నాను, నేను చెప్పిందానికి సీతాపతి ఒప్పుకున్నాడన్న ఆనందంతో ఉక్కిరి బిక్కిరవుతూ.

వెంటనే సీతాపతి వద్దనుంచి శెలవు తీసుకుని గదికి బయలుదేరాను.

గదికి వస్తూనే, నా గదిలో మిగిలిన ఆ నైలాన్ తాడు తీసుకున్నాను. న్యూస్ పేపరులో పొట్లాంగా కట్టాను. చిన్న సంచీలో ఆ పొట్లాన్ని పడవేసి, హోటలు వెలుపలికి వచ్చాను తొందరగా.

కాళీ ఆటోరిక్షా నేను వెళ్తున్న దిశకే వెళ్తుంటే ఆపి, యెక్కి కూచున్నాను.

నాలుగయిదు వీధుల్లోంచి పోనిచ్చి, ఓ చోట దాన్ని ఆపి కిరాయి చెల్లించి పంపి వేసాను.

రిక్షా మరుగయ్యేంతవరకూ నేను నిల్చుని చూసి, త్వర త్వరగా మున్సిపాలిటీ వాళ్ళు చెత్తకుప్పలు పారబోసే మైదానం వద్దకు పరుగెత్తాను.

నలుదిక్కులా నా చూపుల్నోసారి ప్రసరించి నన్నెవరూ గమనించడంలేదని నిర్ధారించుకున్నాను. సంచీలోంచి నైలాన్ తాడున్న పొట్లాం బయటకులాగి, సత్తువ పూని, గిరవాటేసాను.

పొట్లాం ఎగిరి తిన్నగా కుప్పల మధ్యపడింది. చెత్త గుట్టల్లో అదో భాగమైపోయింది మరుక్షణంలో.

ఆ ప్లాస్టిక్ సంచీ వదిలించుకోవడానికి కూడా యింతే చేసుంటే, యీ కంగారు తప్పివుండేది.

తృప్తిగా ఊపిరిపీల్చి, వెనుదిరగబోయాను.

"హేండ్సప్ వినాశ్ గారూ!"

వెనుకనించి వినిపించిన పరిచయమైన గొంతుక నన్ను నిశ్చేష్టుడ్ని చేసింది.

ఆ గొంతు సబిన్స్పెక్టరు సీతాపతిది.

ఇద్దరు జవానులు నా ముందుకొచ్చి, నా చేతులకు బేడీలు తగిలించారు. ఒక కాన్‌స్టేబుల్ వెళ్ళి నేను విసిరేసిన పొట్లం పట్టుకువచ్చాడు.

"ఏమిటిది? ఎందుకు నన్ను అరెస్టు చేస్తున్నారు?" అరిచాను కోపం, దుఃఖం మిళితమైన గొంతుకతో.

"ఎందుకా? వినీలను హత్య చేసినందుకు?" చెప్పాడు సబిన్స్పెక్టరు మెల్లగా.

"నో! నో! నేను ఆమెను హత్య చెయ్యలేదు," ఆవేశంగా అన్నాను.

"అయితే, మీ రెందుకిలా వచ్చారు యిక్కడికి?" అడిగాడు సబిన్స్పెక్టరు.

నేను నోరు మెదపలేకపోయాను.

"మిస్టర్ వినాశ్! మీ రెంత బుకాయించినా యిహ లాభంలేదు. 'మిమ్మల్ని పట్టడానికి వేసిన ట్రాప్ యిది' అని మీరింకా గ్రహించలేదంటే ఆశ్చర్యంగా వుంది. ఇప్పుడు వినండి అసలు కథ. మా పోలీసులకు దొరికిన ప్లాస్టిక్ సంచీలో ఒక నగదు రశీదు వుంది. తన వద్ద మందులు కొన్నందుకు మందుల దుకాణం వాడిచ్చిన బిల్లు అది. నీటి తడికి, దానిమీద పెన్సిలు అక్షరాలు చెరిగిపోయాయి. అయితే, ప్రింటెడ్ అక్షరాలు స్పష్టంగానే వున్నాయి.

ఆ బిల్లు పరమేశ్వరీ ఫార్మాటికల్స్, విశాఖపట్నం వాళ్లు యిచ్చింది. బిల్లు సీరియల్ నెంబరు 396. మేం వెళ్ళి షాపులోని డూప్లికేటు చెక్ చేసాం. ఆ బిల్లుమీద వి. రాజేశ్వరరావు అని వుంది. అయితే ఆ వ్యక్తి యెవరు?

అని కొట్టువాడ్ని అడిగాం. వాడికేం తెలీదన్నాడు. హోటల్లో కనుక్కున్నాం. మీ పేరే అది అని చెప్పారు.

అయితే, మీ బిల్లు పొరపాటున హంతకుడి సంచీలోకి వెళ్లిందేమో అనుకున్నాం. ఆ సంగతి తేల్చుకునేందుకే చిన్న టెస్ట్ చేసాను. ఆ ప్లాస్టిక్ సంచీ చూపినప్పుడు మీ మొహంలోని భావాల్ని కనిపెట్టడమే గాకుండా, మిమ్మల్ని వెంబడించాం. మీ గదిలోని మిగతా నైలాన్ తాడు కాయితంలో వుండగా చుట్టి చెత్తకుప్పలమీద విసిరేయడం మా అనుమానాల్ని ధృవపరిచింది. ఇంతకీ, మీరీ హత్య ఎందుకు చేసారో అర్థంగాకుండా ఉంది, రచయితగారూ!'' అన్నాడు సీతాపతి, తన ఉపన్యాసం ముగిస్తూ.

ఇంక వాళ్ళను యేమార్చే శక్తి నాకు లేదని గ్రహించాను.

''తెలివిగా జరిగిన ఒక యదార్థం గురించి పుస్తకం రాయాలనుకున్నాను. పోలీసు వాళ్ళ రికార్డుల్లో అలాంటి గట్టికేసేదీ లేదని తెలియగానే, నేనే ఆ హత్యచేసి, తప్పించుకుని దాని ఆధారంగా పుస్తకం రాయాలని నిశ్చయించుకున్నాను. అయితే, ఎంత తెలివిగా చేసినా నేరం దాగదు. దైవం నేరాన్ని క్షమించదు. అందువల్లనే, మనుషులు తిరుగాడని చోట ఆ ప్లాస్టిక్ బేగ్ సముద్రంలో పారేసినా, అది ఒడ్డుకువచ్చి మీకు దొరికింది. అంతేగాదు. పొరబాటున అందులో నేను మరిచిపోయిన మందుల బిల్లు నన్ను సూటిగా పట్టిచ్చింది'' అన్నాను.

''సారీ గురువుగారూ!'' అంటూ ముందుకు సాగిపోయాడు సీతాపతి. అతడ్ని అనుసరించాను తలవంచుకుని.

—: ఐపోయింది :—

# దెయ్యాల క్లబ్బు!!

## దివాకర్ల సన్యాసిరాజు

"బాధలు, బాధ్యతలు, ఈర్ష్యలు, ద్వేషాలూ మాయలు, మర్మాలు, అసూయలు, ఆడంబరాలు — లేకుండా, నిరాడంబరమైన, సుఖశాంతులు లభించే ఆనంద నిలయమైన డెవిల్సు క్లబ్‌లో సభ్యత్వం పొంద డానికి సిద్ధంగా ఉండండి. అదృష్టవంతులకు చక్కని అవకాశం.

ఇట్లు
మేనేజర్
డెవిల్సు క్లబ్."

రంగురంగుల అరతావు సైజు కాగితాలమీద పెద్ద పెద్ద అక్షరాలలో ముద్రింపబడిన పై కరపత్రాలు వూరంతా పంచబడ్డాయి.

ఎవరు పంచిపెట్టారో ఎవరికీ తెలీదు!

ఆ దెయ్యాల క్లబ్బు మేనేజరు ఎవరో తెలీదు!

ఎక్కడ ముద్రింపబడ్డాయో తెలీదు!

ఈ ఉదయం వూరంతా ప్రతి రోడ్డుమీద అన్ని సందుల్లోనూ, వెదజల్లపడ్డాయి — ఈ పేర్లు.

ప్రజలు చూసి తెల్లబోతున్నారు.

ఏనోట విన్నా దెయ్యాల క్లబ్బు గొడవే.

ఆశ్చర్యానుమానాలు — భయభ్రాంతులు కలుగుతున్నాయి ప్రజల్లో.

దెయ్యాలేమిటి? క్లబ్ పెట్టడమేమిటి??

"నువ్వేమైనా మార్గం చూపెట్టగలవేమోనని వచ్చాను బ్రదర్. తలా తోకా అందటం లేదు" —

అన్నాడు క్రైం బ్రాంచ్ యినస్పెక్టర్ దామోదర్, ముఖాన్ని పట్టిన స్వేదబిందువుల్ని రుమాలుతో అద్దుకుంటూ.

దామోదర్ తెచ్చిన లేతగులాబీ, ఎరుపు, నీలం రంగుల పేపర్లు తీసుకొని, మరోసారి చదివి — "నువ్వు కూడా రోడ్డు మీద ఏరుకొచ్చావా!?" అన్నాడు డిటెక్టివ్ చక్రవర్తి నవ్వుతూ.

"నేనింతలా తల్లడిల్లిపోతూంటే, నవ్వుతున్నావా బ్రదర్. అలా ఓసారి మెయిన్‌రోడ్ మీదికిరా, అడుగడుక్కీ కాగితం దొర్లుతోంది.

అయిదేళ్ళ అబ్బాయినుండీ, అరవై ఏళ్ళ ముసలమ్మ వరకూ — అంతా కాగితాలు చూసి నోరు తెరచుకొని నిలబడిపోతున్నారు. 'వల్లకాట్లో తిరిగే దెయ్యాలకి

ఓ క్లబ్ ఉందా' అని ఒకరు, దెయ్యాల క్లబ్ ఎలాగుంది? ఎక్కడుంది? దెయ్యాల క్లబ్‌లో, ఎలాంటి వారికి సభ్యత్వం లభిస్తుంది? అందులో చేరినవాళ్ళు అదృష్ట వంతులా!?!

యిలా అంతా ఎదుటివారిని ప్రశ్నించేవారే గాని జవాబు చెప్పేవారు లేరు.

పండుగపూట అత్తవారింటి కెళదామని ఆర్రోజులు శలవు పెడితే యిదో తద్దినం వచ్చిపడింది. నాకేం అర్థమై చావటం లేదు. నువ్వు కలుగ జేసుకోకపోతే నాకు చికాకులు తప్పవు......"

"ఏవండీ! యిది విన్నారా!!" అంటూ చేతిలోని పేపర్లతో లోనికి రాబోతున్న శ్రీమతి ఉమాదేవి యిన స్పెక్టర్‌ని చూసి ఆగిపోయింది.

"రా అమ్మా రా!" అన్నాడు దామోదర్ మర్యాదగా.

"నమస్తే సార్! రాఘువ తెచ్చాడు ఈ పేపర్లు అను మానాశ్చర్యాలతో, మీదగ్గరకొస్తే, అప్పుడే పరిశోధనకే దిగినట్టున్నారే!" అంది శ్రీమతి ఉమా చక్రవర్తి భర్త ప్రక్కన కూర్చొంటూ.

"అవునమ్మా! ఉదయంనుండీ ఓ అయిదువందల ఫోన్ కాల్సయినా వచ్చుంటాయి. విని-విని విసుగెత్తి పోయి, జవాబులు చెప్పలేక రిసీవర్ పైనపడేసి, యిక్కడికి పరిగెత్తుకొచ్చాను." అన్నాడు యినస్పెక్టర్ దామోదర్ తల పట్టుకొని...

"పాపం. మంచి చిక్కులో పడ్డారే!" అంది ఉమా దేవి నవ్వుతూ.

క్రైంబ్రాంచ్ యినస్పెక్టర్ దామోదర్-చక్రవర్తి బాల్య స్నేహితులు. ఫేమిలీ ఫ్రెండ్స్. దామోదర్ బి. ఏ. ప్యాసై, రెండు-మూడు ఉద్యోగాలు చేసి చివరికి యినస్పెక్టర్‌గా స్థిరపడ్డాడు. తెలివైనవాడే-కాని కొన్ని సమయాల్లో గాభరా, ఆత్రుతలవల్ల మెదడు మొద్దుబారి పోయి ఆలోచనాశూన్యమై పోతుంది.

అప్పుడు చక్రవర్తి దగ్గరికి పరిగెత్తుకొస్తాడు. యినస్పెక్టర్ కాకపూర్వం దామోదర్ కుటుంబ గొడవలు పరిష్కరించేవాడు చక్రవర్తి. యినస్పెక్టరయ్యాక సరేసరి.

అతి నేర్పుతో, చాకచక్యంతో దామోదరే స్వయంగా పరిశోధించిన కేసులు లేకపోలేదు. అయితే ఏమాత్రం క్లిష్టమైనదైనా చక్రవర్తి సహాయం పొందవలసిందే.

"బ్రదర్, యిది ఒకరిద్దరు చేసిన పనిలా లేదు. అరాచకం లేవదీయడానికి, విప్లవం సృష్టించడానికి, పన్నాగం పన్నిన ఏముఠావో అయ్యుంటుంది. ఒక్క-గంటలో ఈ విశాఖనంతా హడలెత్తించారంటే ఏదో భారీ కార్యక్రమానికి నాందీవాచకం లాగుంది. వెంటనే తగిన చర్యలు తీసుకోవడం మంచిది...

"చక్రీ! నువ్వు సహాయపడకపోతే అడుగు ముందుకి వెయ్యలేను. పండగా, యిల్లు__వీటిమీద మనసు పోయిందేమో స్వతంత్రంగా ఆలోచించే శక్తి నశించింది. యిది ప్రజా శ్రేయస్సు కోరే విషయం గనక, ప్రభుత్వం తరఫున నీ కెలాంటి సహాయం కావలసి వచ్చినా క్షణాలమీద సమకూర్చగలను." అన్నాడు దామోదర్,

"అలాగే భాయ్! నా శాయశక్తులా సహాయం చేస్తాను. మొదట ఈ పేపర్లు ఎక్కడ ప్రింటయ్యాయో తెలుసుకో" అన్నాడు చక్రవర్తి పేపరు నిశితంగా పరీక్షిస్తూ.

"ఎలా తెలుస్తుంది? అసలు ఎవడు వెదజల్లాడో, తెలీదే!? ఎవర్ని అడుగుతాం?!!" అన్నాడు దామోదర్.

"ఏమిటి బ్రదర్! మరీ పనిచెయ్యడం మానేసింది నీ బ్రెయిన్. ఉమా! స్ట్రాంగ్ కాఫీ పంపించు — వెంటనే మఫ్టీలో మీ బృందాన్ని పంపించి, ఈ ఊర్లో ఎన్ని ప్రెస్ లున్నాయో తెలుసుకో. ప్రతి ప్రెస్‌లోనూ ప్రచురింపబడిన కొంత మేటర్ సంపాదించు. వెంటనే పని ప్రారంభించు" అన్నాడు చక్రవర్తి.

"ఎందుకూ ఆ మేటర్?" అడిగాడు దామోదర్.

"వీలైనంత వేగంగా కావాలి ఆ మేటర్. వివరాలు తరవాత చెప్తాలే." అంటూ లేచాడు చక్రవర్తి.

"ఓ. కే. యిప్పుడే పంపిస్తాను" అని ఫోన్ దగ్గరికెళ్ళి కొన్ని సూచనలిచ్చాడు, దామోదర్ స్టేషన్‌కి రింగ్ చేసి.

అదే సమయంలో బోయ్ రాఘవ రెండు కప్పులు కాఫీ తెచ్చి బల్లమీదుంచి వెళ్ళిపోయాడు.

తనొక్కటి పుచ్చుకొని, యినస్పెక్టర్‌కి అందించాడు. కాఫీ త్రాగి వెళ్ళిపోయాడు దామోదర్.

దామోదర్ వెళ్ళగానే ఉమ ప్రవేశించింది.

"ఉమా రమణని బెంగుళూర్ ప్రోగ్రామ్ కాన్సిల్ చేసుకొని వెంటనే రమ్మని ఫోన్ చెయ్యి" అన్నాడు చక్రవర్తి విల్సు అంటిస్తూ.

# 2

చక్రవర్తి శ్రీమతి ఉమాదేవి జగదాంబ 70 ఎమ్.ఎమ్. దగ్గర బస్సు దిగారు. మెయిన్ రోడ్ రద్దీగా ఉంది జనం గుంపులు, గుంపులుగా చేరి డెవిల్సు న్యూస్ చెప్పుకుంటు న్నారు. కొన్నిచోట్ల ఈ పేపర్లు, తలుపులకి, గోడలకి, దుకాణాలకి అంటించి ఉన్నాయి. అన్నీ పరిశీలిస్తూ తాపీగా నడవసాగారు యిద్దరూ...

ప్రతిచోటా యిదే గొడవ. ఎక్కడచూసినా రంగు రంగుల పేపర్లు చూడముచ్చటగా రోడ్డుమీద ఎగురు తున్నాయి. ఎవరిచేతిలో చూసినా, ఏ బస్సుచూసినా, యివే పేపర్లు.

టర్నల్ చార్ట్రి సమీపిస్తుండగా ఓ జీప్ వచ్చి ప్రక్కన ఆగింది. ఇన్స్పెక్టర్ దామోదర్ క్రిందికి దిగి—

"చక్రీ- రండీ. స్టేషనుకి వెళదాం," అన్నాడు.

చక్రవర్తి, ఉమా జీప్ ఎక్కారు.

"బ్రదర్. నిన్నరాత్రి పెట్రోల్ బంకు సమీపంలో ఉన్న గేరెజ్ నుండి- ఓ టాక్సీ మాయమైంది. ఉదయం ఎనిమిది గంటలకి గేరెజ్ తెరిచేసరికి లేదని డ్రైవర్ రిపోర్టు చేశాడు. వేసిన తాళం వేసినట్లే ఉంది. ఎలాంటి వేలిముద్రలులేవు. మనవాళ్ళు గాలిస్తున్నారు కారుకోసం. నేను స్పాట్ కెళ్ళి చూసొస్తున్నాను. నీకోసం రింగ్ చేస్తే ఔన్ లో కెళ్ళావన్నాడు- రాఘవ" అన్నాడు దామోదర్.

ఓసారి తలపంకించి ఆలోచించసాగాడు చక్రవర్తి. ఈ విశాఖలో యింతవరకూ కార్ల దొంగతనం ఎప్పుడూ లేదు, ఓంప్రథమంగా ఈరోజు ఈవార్త ఆశ్చర్యమే.

కారు దొంగతనానికి డెవిల్సుకి సమ్మంధముందా! ఆలోచించసాగాడు. చక్రవర్తి ఆలోచనలకి అంతరాయం కలిగించడం యిష్టంలేక మౌనంగా కూర్చున్నాడు దామోదర్.

జీవ్ పోలీస్ స్టేషన్ ఆవరణలో ప్రవేశించింది.

క్రిందికి దిగుతున్న దామోదర్ అప్రయత్నంగా నోటీస్ బోర్డువైపు చూసి తుళ్ళిపడి ఎగిరి గంతేసాడు.

"చక్రవర్తీ! అటు చూడు"– అంటూ ఒక్క అంగలో బోర్డు సమీపించాడు.

2872 (నియర్ కంచరపాలెం)

8002 (నియర్ మల్కాపురం)

5062 (నియర్ నక్కవానిపాలెం)

7352 (నియర్ సిరిపురం)

దిసీజ్ ఫర్ యువర్ యిన్‌ఫర్మేషన్ ఎండ్, నెససరీ ఎక్షన్ ప్లీజ్.

యువర్స్ ఫెయిత్‌ఫుల్లీ
మేనేజర్
డెవిల్సు క్లబ్.

పై వాక్యాల్ని చదివారు ముగ్గురూ.

వెంటనే యినస్పెక్టర్ దామోదర్ కళ్ళు ఎరుపెక్కాయి.

"టు ట్వంటీవన్"– దాదాపు కేక పెట్టాడు.

"యస్ సార్!" ఒక్క పరుగులోవచ్చి, రైఫిల్ పైకెత్తి సెల్యూట్ చేశాడు వినయంగా.

"యింతసేపూ ఎక్కడ చచ్చావ్!" గర్జించాడు దామోదర్.

"యిక్కడే ఉన్నానుసార్!" అన్నాడు వణికిపోతూ,

"ఇక్కడేవుంటే ఆ కాగితం నోటీస్‌బోర్డు మీదికెలా వెళ్ళింది. నే వెళ్ళాక ఎవరొచ్చారు?"

"నల్లని ఎంబాసిడర్ కారులో ఓ ముసలాయన వచ్చారు సార్. నన్ను దగ్గరికి పిలిచి_

"అబ్బాయి లోపలున్నాడా!" అని అడిగారు.

"ఎవరు సార్" అన్నాను.

"దామోదరంకోసం వచ్చాను" అన్నారు.

"అబ్బాయ్!" అని అన్నారు బహుశా మీ చుట్టం ఏమోనని, లోపలికివచ్చి కూర్చోండిసార్. వచ్చేస్తారు' అన్నాను.

లోపలికి వెళ్ళి కూర్చున్నారు. కారు వెళ్ళిపోయింది. పదినిమిషాలుపోయాక పైకొచ్చి-

"అబ్బాయి ఎప్పుడొస్తాడో. క్లబ్ మానేజరు వచ్చి వెళ్ళారని చెప్పుబాబూ. వస్తాను పనుంది_" అంటూ వెళ్ళిపో..."

"క్లబ్... మానేజరా!_ అంటే డెవిల్సు క్లబ్ మానే జరా!?" గొణుక్కున్నాడు దామోదర్ తలపట్టుకొని.

"కారు నెంబరుచూశావా"

"లే_ లేదుసార్" మెల్లగా అన్నాడు కానిస్టేబుల్.

"నాన్ సెన్సు- వీళ్ళకంత తెలివేడిస్తే యికనేం?" అంటూ గబగబా లోనికి నడిచాడు దామోదర్.

మెయిన్‌రూమ్ ప్రక్కగా ఉన్న గదిలో బల్లమీద కాళ్ళు జాపుకొని బీడీకాలుస్తున్న హెడ్ కానిస్టేబుల్ యినస్పెక్టర్ ఆగమనంతో బీడీ క్రిందపడేసి, బూటుకాలితో మట్టేస్తూ ఎటెన్షన్‌లో నిలబడి సెల్యూట్ చేశాడు.

"ఫోన్ కాల్సు ఏమైనా వచ్చాయా!" సీరియస్‌గా అడిగాడు దామోదర్.

"ఎ. పి. వి. 8002, ఎ. పి. వి. 7352, ఎ.పి.వి. 5062 మూడు కార్లు పోయినట్లు రిపోర్టులు వచ్చాయి సార్" అన్నాడు హెడ్ కానిస్టేబుల్ రంగయ్య.

"ధైర్యంగా పోలీస్ స్టేషనుకొచ్చి, కొంత సేపు కూర్చొని నోటీసు అంటించి పారిపోయినా పట్టుకోలేకపోయారు. చూశావా చక్రవర్తి_ ఎంత సిగ్గుచేటు" అన్నాడు దామోదర్ తలపట్టుకొని కుర్చీలో జేరబడి.

ఉమ, చక్రవర్తి ఎదురుగావున్న కుర్చీల్లో కూర్చున్నారు. అంతవరకూ పరిస్థితి అవగాహన చేసుకున్న చక్రవర్తి_

"బ్రదర్_డెవిల్సు రంగంలోకి దిగాయి. కానీ మన పరిశోధన ముందుకి సాగలేదు. నిన్న రాత్రి మూడుకార్లని దొంగిలించి, వాటితో పనులు నెరవేర్చుకొని ఎక్కడెక్కడో వదిలిపెట్టి, వెళ్ళి తెచ్చుకోమని మెసేజ్ యిచ్చాయి డెవిల్సు. ఎంత పటిష్టమైన ప్లాన్ల ప్రకారం జరుగుతున్నాయో ఆలోచించు. వెంటనే నీ స్క్వాడ్‌ని పంపి ఆ కార్లను స్వాధీనపర్చుకో" అంటూ లేచాడు చక్రవర్తి.

# 3

ఫోన్ ఆదేపనిగా మ్రోగసాగింది.

అసిస్టెంట్ రమణ లేచి రిసీవర్ అందుకున్నాడు.

"గుడ్ ఏఫ్టర్నూన్ మిష్టర్ రమణకుమార్_ శ్రమ అనుకోకుండా రిసీవర్ చక్రవర్తి గారికివ్వండి."

ఫోన్‌లో వినిపించే ఆ కంఠధ్వని విని ఆశ్చర్యంతో_

"ఎవరుమీరు? ఎక్కడనుండీ మాట్లాడుతున్నారు?" అడిగాడు రమణ_ అపరిచితమైన, విచిత్రమైన ఆ కంఠంవిని ఆశ్చర్యానుమానాలతో.

"చక్రవర్తిగారు చెప్తారు మీ ప్రశ్నలకి జవాబులు. దయచేసి ఆయనకి రిసీవర్ యివ్వండి."

"బాస్! మీతోనే మాట్లాడాలట" అంటూ రిసీవర్ చక్రవర్తి దగ్గరగా తీసుకెళ్లాడు రమణ.

ఆలోచనల అంతస్సుల్లో ఉన్న చక్రవర్తి రిసీవర్ అందుకొని_

"వెరీగుడ్ ఏఫ్టర్‌నూన్ మిస్టర్ మానేజర్!" అన్నాడు శాంత గంభీర స్వరంతో.

"ఓ మైగాడ్! చక్రవర్తిగారూ! అభినందిస్తున్నాను మీ తార్కిక జ్ఞానానికి. చాలా సంతోషం. నన్ను నేను పరిచయం చేసుకోనవసరంలేకుండానే గుర్తుపట్టారు.

చక్రవర్తిగారు మీరు అసమాన ప్రజ్ఞావంతులు. అఖండ మేధావంతులు. దుస్సాధ్యమైన కేసుల్ని అవలీలగా మీరు పరిశోధించి విజయం సాధించారు. అలాంటి మీరంటే మాకెప్పుడూ భక్తి గౌరవాలు నశించవు. మేం యిలా కరపత్రాలు పంచడంలో ఎలాంటి దురుద్దేశమూ లేదు.

మాదొక ప్రణాళిక. మా సంస్థలో చేర్చుకున్న సభ్యులెలాంటివారో, ఎంత నిరాడంబరులో, మా శిక్షలెలాంటివో, మా ధ్యేయమేమిటో, మీకు ముందు, ముందు తెలుస్తుంది. మాకు తోచిన విధంగా సంఘాన్ని సరిదిద్దా లనుకుంటున్నాం. అచిరకాలంలోనే, మా సంస్థ కీర్తిప్రతిష్టలు తారాపధాన్ని అందుకోగలవని మా ప్రగాఢ విశ్వాసం.

యిందులో మీలాంటి మేధావులు తలదూర్చి, పరిశోధనకి దిగి, మీ అమూల్య కాలాన్ని దుర్వినియోగ

పరచుకోవద్దని మనవి చేస్తున్నాం. యింత ప్రచారం వుంటేగాని, ప్రజలు అర్థం చేసుకోరని, మా సంస్థ నియమాలు, నిబంధనలు అవగాహన చేసుకోలేరని ఈ మార్గం అవలంబించాం. ప్రజల్ని హడలెత్తించామని, భయభ్రాంతులు కలుగజేసి అలజడి లేవదీశామని ప్రభుత్వం చిందు లేస్తోంది.

రేపు సాయంత్రం ఆరు గంటలకి రేడియంలో మా ప్రోగ్రామ్స్ వుంటాయి. మాకు తోచిన విధంగా, యథోచితంగా, మీలాంటి పెద్దల్ని, ప్రముఖుల్ని ఆహ్వానిస్తున్నాం. దయచేసి మీరుకూడా వచ్చి మా కార్యక్రమాన్ని విజయవంతం చేస్తారని ఆశిస్తున్నాం. శలవు!" క్లిక్‌మంది అటువైపు.

రమణ ప్రక్క గదిలోంచి వచ్చి, "బాస్! యిప్పుడు మనకొచ్చిన ఫోన్ కాల్ ఎక్కడినుండి వచ్చిందో చెప్పలేక పోతున్నారు ఆపరేటర్. 'మాకు వింతగానే వుందని, నెంబరున్న ఏ లోకల్ ఫోన్ నుండీ రాలేదని' అంటున్నారు." అన్నాడు అయోమయంగా.

"అందుకే డెవిల్సు అని పేరుపెట్టుకున్నారు.

యింకా విచిత్రాలు జరగొచ్చు. యిందులో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు.

దినదినాభివృద్ధి పొందుతున్న ఈ అణుయుగంలో 'వింత' అనే పదమే వుండదు. పునర్జన్మ తప్పా మానవుని మేధస్సుకి నేడు అసాధ్యమంటూ ఏమీ లేదు, అదికూడ సాధిస్తే యిక దేముడు... దెయ్యం అనే పదాలు అడుక్కిపోతాయేమో.

మనం ఈ కేసులో శక్తి ప్రదర్శించడం కాదు. యుక్తిగా చిక్కులు విడదీయాలి. ధైర్య సాహసాల

కంటె మనోనిగ్రహం ముఖ్యం. రేపు సాయంత్రం డెవిల్సు ప్రోగ్రాంకి వెళితే యింకా విచిత్రాలు చూపిస్తారు.

వాళ్ళని మొదట విచ్చలవిడిగా తిరగనిస్తే గాని నిజ స్వరూపాలు బయట పడవు.

తీగలాగితే డొంకంతా కదులుతుందిగాని మొదలంటా ఊడిరాదు. వాటి స్థావరం......" అదే సమయంలో మళ్ళీ ఫోన్ మ్రోగింది.

"చక్రవర్తి హియర్". అన్నాడు రిసీవర్ అందుకొని.

"హల్లో బ్రదర్! నేను దామోదర్‌ని. ఈ విశాఖలో యిరవైమూడు ప్రెస్సులున్నాయి. మేటర్ సంపాదించాను...పంపిస్తున్నాను. మరో తద్దినం వచ్చిపడింది. రేపు డెవిల్సు ప్రోగ్రామ్సు ఉన్నాయట—స్టేడియంలో. ఆహ్వానించాడు మానేజర్—ఏమిటి? బ్రదర్, ఈ దారుణం?!"

"డెవిల్సుకి మర్యాదలు, మన్ననలు కూడా తెలుసు. అందుకే అందర్నీ పేరుపేరునా పిలుస్తున్నాయి. వెళదాం లేకుంటే బాగుండదు." అన్నాడు చక్రవర్తి దామోదర్ గాభరాకి నవ్వుతూ.

"నీ వాలకం చూస్తూంటే నన్ను పూర్తిగా ముంచేటట్లున్నావ్. కొంపలంటుకుంటూంటె నవ్వుతావేమిటి? అధికారుల దృష్టిలో పడ్డాయి డెవిల్సు. డి. యస్. పి. గార్కి యిన్విటేషన్ పంపాయి. దొంగల్ని ఖూనీకోరుల్ని పట్టుకుంటాం గాని, ఈ దెయ్యాల్ని పట్టుకోవడమెలా?

మరియాళ మాంత్రికుల్ని తెప్పించి, దెయ్యాల నన్నింటినీ సీసాల్లో పట్టిస్తానంటే హాస్యమాడుతున్నానని

తలవాచేట్లు చీవాట్లు పెట్టారు ఎస్. పి. ఫోన్‌లో. రేపు విచ్చలవిడిగా బహిరంగ ప్రదర్శనలిస్తే యింకెంత అలజడి లేస్తుందో ప్రజల్లో'' అన్నాడు దామోదర్.

''బ్రదర్. వాటినింకా రెచ్చగొట్టాలి.

''ఇంతవరకూ కార్లు దొంగిలించి వాడుకోవడం తప్పా మరెలాంటి ప్రమాదాలూ జరగలేదు. రేపు మరికొన్ని వివరాలు తెలియవచ్చు. సి.ఐ.డి.ల్ని మఫ్టీలో కొంత మంది, పి. సి.ల్ని జనంలో కలిపి ప్రతి వ్యక్తినీ జాగ్రత్తగా కనిపెడుతూ వుండాలి. మనమూ వెళదాం. జనంలో కలిసిన మీ స్టాఫ్ అంతా నీ ఆజ్ఞల ననుసరించి నడుచుకోవాలి.

మిగతా విషయాలు ఉదయం ముఖ స్తంగా వివరిస్తాను'' అన్నాడు చక్రవర్తి.

''ఓ కే!'' అంటూ ఫోన్ డ్రాప్ చేశాడు దామోదర్.

## 4

సాయంత్రం ఆరు గంటలు కావస్తోంది. డిసెంబరు నెల కావడంవల్ల అప్పుడే దిక్కుల్లో చీకటి తెరలు మూసుకుంటున్నాయి. స్టేడియం నియాన్–మెర్క్యూరీ దీపాలతో దేదీప్యమానంగా అలంకరింపబడి ఉంది. వలయాకారంగా అలంకరింపబడిన కుర్చీల్లో పట్టణంలోని ప్రముఖులు, గొప్పవాళ్ళు, పలుకుబడి, పేరు, డబ్బు ఉన్న వ్యక్తులు మొత్తం అయిదారు వందలమంది ఆసీనులై ఉన్నారు.

ఆ వెనుక చాలా మంది ప్రజలు నిలబడి ఉన్నారు. స్టేజి చుట్టూ నల్లని బోర్డరు దానిమీద తెల్లగా అటూ, యిటూ రెండు అస్థిపంజరాల బొమ్మలు వున్నాయి.

పెద్ద మానవ కపాలం రెండు అస్థికలు ఉన్న కర్టను గాలికి రెపరెప లాడుతోంది.

లయబద్ధంగా శ్రావ్యమైన సంగీతం ఎక్కడినుండో వినిపిస్తోంది.

నిర్ణీత సమయం ఆసన్నమైంది.

ఏం జరుగుతుందో, డెవిల్సు ఎలాగుంటాయో ఎలాంటి ప్రదర్శనలో చూడ్డానికి రెప్పలార్పకుండా కూర్చున్నారు ప్రేక్షకులంతా.

అదే సమయంలో—

"ప్రియమైన, గౌరవనీయులైన సభ్యులారా!" చిత్ర విచిత్రమైన కంఠం రంగస్థలంనుండీ మారుమ్రోగింది.

పిన్ డ్రాప్ సైలెన్సు అయిపోయింది ఆ ప్రదేశం అంతా.

"మా ఆహ్వానాన్ని సహృదయంతో అర్థం చేసుకొని, మా అతిధులుగా విచ్చేసినందుకు మా హృదయపూర్వక అభినందనలు స్వీకరించండి.

మీరంతా స్వేతవర్ణ వస్త్రాలు ధరించి నియమబద్ధంగా వచ్చినందుకు మా కెంతైనా ఆనందంగా ఉంది......"

హఠాత్తుగా ప్రేక్షకుల్లో కలకలం చెలరేగింది.

అంతవరకూ రకరకాల వేషధారులైన ప్రేక్షకులందరి వస్త్రాలు ధవళకాంతితో మెరుస్తూ వెన్నెల పోగులా, తెల్లగా మారిపోయాయి.

'వండర్! ఓ మైగాడ్! యిదెలా సాధ్యం? ఒక్క క్షణంలో యిందరిబట్టలు తెల్లగా ఎలా మారిపోయాయి- నా యూనిఫామ్, దానిపైనున్న మఫ్టీడ్రస్, తెల్లగా మారిపోయాయ్. యిదేం మాయరాబాబూ!' సంభ్రమాశ్చ

క్యాలతో అవాక్కైపోయాడు యినస్పెక్టర్ దామోదర్.
ఖరీదైన బ్లాక్ సూట్ లోనున్న డిటెక్టివ్ చక్రవర్తి బట్టలుకూడా తెల్లగా మారిపోయేసరికి చిరునవ్వు వెలిసింది ఆయన ముఖంమీద.

మళ్ళీ రంగస్థలంవైపునుండీ మాటలు వినబడ్డాయి.
"మీరంతా చాలాసేపై మా ప్రదర్శనలు చూడ్డానికి వచ్చారు. మీ అమూల్యమైన కాలాన్ని మాకోసం వచ్చి వినియోగించిన మిమ్మల్ని సత్కరించడం మా విధి. యిప్పుడు మీరంతా మా ఆతిధ్యం స్వీకరిస్తారని ఆశిస్తాము..."

ఈసారి ఆడియన్సు ఆశ్చర్యం గుండెలాగిపోయేలా చేసింది. అచేతనులై ఉండిపోయారంతా.

తెర తొలగిపోయింది. స్టేజ్ మీద పెద్ద టేబులు దానిమీద పెద్ద దొంతరలుగా పలహారాల పళ్ళేలతో నిండిన ట్రేలు చూస్తుండగానే, మానవప్రయత్నం లేకుండానే ఒకొక్కరికి ఒకొక్క ప్లేటు అందించిపోతున్నాయి. ఒకింతలో ఆశ్చర్యంనుండీ తేరుకోకముందే అందరికీ ఫలహారాల ప్లేట్సు అందించి ఖాళీ ట్రేలు స్టేజీచేరుకున్నాయి, తెర మూసుకుపోయింది.
నోటమాటలురాక, చెయినోటపోక, నోళ్ళువిప్పి చూస్తూ ఉండిపోయారంతా.

"మైడియర్ ఫ్రండ్సు! ఈ చిన్నప్రయోగానికే మీరింత ఆశ్చర్యానికి లోనుకావడం హాస్యాస్పదంగా ఉంది.

ఈ ఫలహారాలు ఆరగించడంలో మీ శరీరానికిగాని, ఆరోగ్యానికిగాని, ఎలాంటి భంగం వాటిల్లదు. మీరు తినే

పదార్థాలేగాని, తినకూడనివేమీ లేవు. త్వరగా పూర్తి చేయండి. టిఫిన్లు కాఫీ ముగిస్తే మిగతా కార్యక్రమాలు మొదలెట్టొచ్చు".

మరో రెండునిముషాలకి నెమ్మదిగా అంతా తినసాగారు. ఆ ప్లేట్లలో జీడిపప్పు, బాదంహల్వా, బూందీలడ్డూ, ప్లమ్‌కేక్, అరటిపండు, కేడ్‌బర్రీస్ మిల్క్‌బార్ ఉన్నాయి.

అవి పేపర్ ప్లేట్సు గనక తినేసి క్రిందపారేశారు అందరూ.

అందరూ తినడం పూర్తికాగానే మళ్ళీ తెరతొలగిపోయింది. పెద్దట్రేలలో కాళీకప్పులు వచ్చి అందరికీ పంచబడ్డాయి. వాటి ననుసరించి వస్తున్న కాఫీకెటిల్ అందరి కప్పుల్లో కాఫీ సరిసమానంగా పోస్తూ వెళుతోంది.

శూన్యంలో విహరిస్తున్న ఆ వస్తువుల్ని, ఆ వింత దృశ్యాన్ని ఆనందంగా తిలకిస్తున్నారు ప్రేక్షకులంతా. అంతవరకూ డెవిల్సు అంటే భయపడేవారు, అసహ్యించుకొన్నవారుకూడా డెవిల్సుని పొగడ్డం మొదలెట్టారు.

తమ జన్మలో యింత వింతపార్టీ చూళ్ళేదన్నారు. ఆ క్లబ్‌లో సభ్యులుగా చేరితే యింకెంత బాగా ఉంటుందో, ఆ అదృష్టం ఎవరికి ఎలా పడుతుందో, ఏఏ అర్హతలుండాలో, వూహించుకోసాగారు.

"బ్రదర్! ఏమిటిది? నమ్మశక్యంగాకుండాఉంది. యిది ఎలాంటి పరిణామానికి దారితీస్తుందో తెలియడంలేదు. ఏం చేయమన్నావ్?" అన్నాడు దామోదర్, చక్రవర్తి ప్రక్కకొచ్చి.

"యింతవరకూ చట్టానికి వ్యతిరేకంగా యిక్కడేమీ జరగలేదు. పబ్లిక్‌నంతా తమవైపు తిప్పుకున్నాయి

డెవిల్స్. పోలీస్‌లు జోక్యం కలిగించుకుంటే ఈ ప్రజలే ఎదురుతిరుగుతారు. యింతవరకూ మనిషన్నవాడెవరూ కనబడకపోతే ఎవర్ని కష్టడీలోకి తీసుకుంటావు. నాఊహ ప్రకారం హఠాత్తుగా ఆ స్టేజీపైకి దండెత్తినా శూన్యం తప్పా ఏం ఉండదు. తొందరపడొద్దు" అన్నాడు చక్రవర్తి.

ఆదే సమయంలో తెరతొలగిపోయింది.

ఓ టేబులు, మైకుమాత్రం ఉన్నాయి స్టేజీమీద.

అంతవరకూ దేదీప్యమానంగా వెలుగుతున్న వేదికపై దీపాలు ఆరిపోయాయి. ఎటునుండో ఓ కాంతివంతమైన స్పాట్‌లైటు మైకుదగ్గర పడింది.

ఆ వెలుగులో నిలబడిఉన్న నిలువెత్తుఅస్థిపంజరంని చూసే సరికి సంభ్రమాశ్చర్యాలకి లోనయ్యారు ఆడియన్సంతా.

మైకు పట్టుకున్న రెండుచేతులు ఎత్తి నమస్కరించింది అస్థిపంజరం.

"ప్రియమైన పురప్రముఖులకి అభివందనలు. అత్యంత అమూల్యమైన మీ కాలాన్ని మా కోసం వినియోగించి మా ఆహ్వానం మన్నించి విచ్చేసినందుకు మా హృదయ పూర్వక వందనాలు.

దేశంలో, అరాచకం, అవినీతి, లంచగొండితనం, దిన దినాభివృద్ధిగా పెరిగిపోతోంది. అధికధరలు, నిరుద్యోగ సమస్యలు, మానవుల్ని కృంగదీసి, జీవచ్ఛవాల్లా తయారు చేస్తున్నాయి. దేశం మారాలి అంటే మనుషులు మారాలి. ఎలా?! యిదెలా సాధ్యం? రామరాజ్యం, రత్నగర్భగా పేరుగాంచిన భారతదేశంలో దరిద్రదేవత విలయతాండవం చేస్తోంది.

ఈ దారిద్ర్యాన్ని రూపుమాపి తిరిగిదేశాన్ని సస్య శ్యామలంగా, సుఖశాంతులలో రూపొందించాలని ప్రభు

త్వం చేస్తున్న కృషి ఆకాశానికి నిచ్చెనలు వేసినట్లే అవుతోంది. దీనికి కారణం ఏమిటి?

మానవుల్లో ఈర్ష్యలూ ద్వేషాలు మాయలు మర్మాలు కక్షలు కావేషాలు పెరిగిపోతున్నాయి. కారణం? కడుపు నిండా తిండి, వంటినిండా బట్ట, కంటినిండా నిద్రకూడా కరువు కావడమే.

భారతదేశం, భరతమాత బిడ్డలు, యిన్ని యిబ్బందుల్లో వుండగా పులిమీద పుట్రలా పొరుగురాజ్యాలు కయ్యానికి కాలుదువ్వుతున్నాయి. శత్రుదేశాలు రహస్యంగా కుట్రదారుల్ని పంపి దేశంలో క్రాంతిని లేవదీస్తున్నాయి. దేశంలో దరిద్రం పెరిగినట్లు ధనం పెరక్కుండా వుంది. విలువైన వజ్రాలు రత్నాలు మణులు మాణిక్యాలు బంగారం దేశంనుండీ తరలిపోతోంది.

గౌతమ బుద్ధుడు మహాత్ముడు నెహ్రూ మొదలగు మన భారతమాత ముద్దు బిడ్డలైన మహనీయులు, శౌర్య పరాక్రమాలకంటే శాంతి సౌభాగ్యాలకే జీవితాలు అంకిత మొనర్చారు. మహా ప్రభువైన ఏసుక్రీస్తు ఎవరైనా చెంప దెబ్బ కొడితే రెండో చెంప కూడా అందించమన్నారట, పశ్చాత్తాపంతో పరితప్త హృదయుడౌతాడని.

నేటి అణుయుగంలో ఆసూత్రం వర్తిస్తుందా!

శత్రువులు అక్రమ యుద్ధానికి దిగుతోంటె మనమేమౌతాం?

వజ్రం వజ్రంతోనే కోయాలి. కుక్క కాటుకి చెప్పు దెబ్బే మందు.

దీన్నెలా అరికట్టడం? దేశాన్ని తిరిగి రామరాజ్యంగా మార్చడం ఎవరివల్ల అవుతుంది?! యిది జరిగే పనేనా!!

మానవుల్లో కళాకాంతులు, సుఖ, శాంతులు, వెల్లి విరుస్తాయా!! దానికి పరిష్కార మార్గమేమిటి?!!

అందరికీ యిది ప్రశ్నగానే ఉండిపోయింది. ఆ మహత్తర కార్య నిర్వహణకే మా సంస్థ కంకణం కట్టుకుంది. మీ అందరి ఆదరాభిమానాలు, సహకారం ఉంటే ఇది తప్పకుండా జయప్రదం కాగలదని మరో ప్రపంచ స్థాపనకి, రామరాజ్య నిర్మాణానికి ఎంతో కాలం పట్టదని మా గాఢ విశ్వాసం..."

అతి నిశ్శబ్దంగా అయిపోయింది స్టేడియం అంతా. అక్కడ ఉన్నది అస్థిపంజరం, మాట్లాడినది ఎముకల పోగు అని ఎవరూ ఆలోచించడం లేదు. ఆ మాటల ప్రభావం అందరి హృదయాల్లో చెరగని ముద్ర వేసింది. ప్రతిఒక్కరినీ ఆలోచనలో ముంచేసింది.

ఆడియన్స్‌లో వచ్చే రెస్పాన్సు ఊహించడానికే క్షణం ఆ మాటలు ఆగాయని తెలుసుకున్నాడు చక్రవర్తి.

మళ్ళీ మైక్‌లో మాటలు వినబడ్డాయి..." ప్రేక్షకులారా! మీలో ఉన్నతోద్యోగులు, నిరుద్యోగులు, లక్షాధికారులు, సాధారణ ప్రజలు, మంచివాళ్ళు చెడ్డవాళ్ళు, మానవత్వం ఉన్నవాళ్ళు, క్రూరత్వంమూర్తీభవించిన వాళ్లు, పోలీసులు, ప్రభుత్వోద్యోగులు ఉన్నారు. అయితే ఈ క్షణంలో ప్రపంచం యావత్తు మా ఉపన్యాసం వింటూంది. విని తలకి పదును పెడుతోంది.

భారతీయులు, చెడు సావాసంలో, పాడైపోతున్నారు అంతే. దుష్ట దేశాలు, చీడ పురుగుల్ని మన దేశంకి పంపి దేశద్రోహాన్ని క్రూరత్వాన్ని రంగరించి పోస్తోంది మన ప్రజల్లో. మన ప్రజల సహాయం పొంది మన సోదరుల్నే

హతమార్చి చల్లగా జారుకుంటున్నారు వెలకట్టలేని విలువైన వస్తువులతో.

దెయ్యాలు కామరూపులు. ఈ అణుయుగంలో దెయ్యాలకి భయపడేవారు, అవి వున్నాయని నమ్మేవారు చాలామంది వున్నారు. కంటికి కనిపించని అగోచర శక్తి అంటే అందరికీ భయం. సహజమే. మేం దెయ్యాలం కాము. మీలాగే మానవ మాత్రులం. అయితే దేవుడు, దెయ్యం చేసే పనులన్నీ అవలీలగా చేయగలం. శూన్యంలో ఈ విన్యాసాలెలా జరుగుతున్నాయో అని మీకు అనుమానాశ్చర్యాలు కలగటం సహజమే.

మానవుడ్ని పూర్తిగా ఆకర్షించేది-వింత ఒక్కటే. ఎవరిలోనైనా, ఏదైనా ప్రత్యేకత వుంటే ఆ వ్యక్తిని మనం గౌరవిస్తాం, ఆదరిస్తాం. అతని స్నేహ బాంధవ్యాన్ని కాంక్షిస్తాం. అతని మాటకి విలువ యిస్తాం.

అందుకే మేం ఈ రూపం దాల్చవలసి వచ్చింది. అందుకే ఈ మార్గం అవలంబించాం.

దేశాన్ని ప్రేమించినవార్ని ఆదరిస్తాం. దేశద్రోహం తలపెట్టినవార్ని పట్టియిస్తాం. ప్రభుత్వాన్ని గౌరవించినవార్ని గౌరవిస్తాం. ప్రభుత్వాన్ని కించపరచినవార్ని శిక్షిస్తాం.

ఈనాటి నుండీ, ప్రభుత్వం అప్రమత్తతతో వ్యవహరించాలి. క్రాంతికారుల్ని ఏరి పారేస్తాం. దేశం నుండీ తరిమి తరిమి కొడతాం. యిది మా సవాల్.

దేశంలో ఏవిధమైన అక్రమ వ్యాపారం, ఆహార ధాన్యాల నిల్వలు, అధిక ధరల కమ్మకాలు, రహస్య

వ్యభిచార కేంద్రాలు, అవినీతిక్లబ్బులు—అందరికీ యిదే మా హెచ్చరిక.

మా శక్తి మీ ఊహాకందదు. ఎక్కడ అన్యాయం వుందో అక్కడ డెవిల్ వుంది. గుర్తుంచుకోండి. ఈ ప్రకటన, ఈ స్టేడియం ఆవరణలో వున్న మీ కొద్ది మందికే వుద్దేశింపబడినదనుకుంటున్నారేమో. దేశంలో తెరిచియున్న ప్రతియింట, ప్రతి రేడియో కొద్ది క్షణాలు కార్యక్రమాలకి అంతరాయం ఏర్పడి ఈ వుపన్యాసం వినిపిస్తుంది. యిళ్ళల్లో, పార్కుల్లో, దుకాణాల్లో, క్లబ్బుల్లో ఎక్కడ ఏ రేడియో, ట్రాన్సిస్టర్ అయినా యిదే ప్రసారం చేస్తుంది.

యిది మాయలు, మంత్రాలు, యంత్రాలు, తంత్రాలు కావు. కేవలం విల్ పవర్. సూపర్ నేచురల్ పవర్. సబ్ కాన్ షస్ మైండ్ పవర్. దీనిముందు ప్రపంచంలో ఏశక్తి ముందంజ వేయలేదు.యిది మా సవాల్.

భారతదేశం, భారత ప్రజలు, యింకా రాతి యుగంలో వున్నారని, అనాగరికులని అనుకుంటున్న దేశాలకి యిది సవాల్.

భారతదేశ పురోగమనం అర్థమయేలా చేస్తాం.

అనివార్య కారణాలవల్ల ఈ కార్యక్రమం యింతటితో ముగిస్తున్నాం. త్వరలో మరికొన్ని వివరాలు తెలియ జేస్తాం. శలవు. జైహింద్."

తెర మూసుకుపోయింది.

తిరిగి ఆ ప్రదేశమంతా దేదీప్యమానమైంది.

అంతవరకూ తమని తాము మర్చిపోయిన ప్రేక్షకులందరి వస్త్రాలు, మామ్మూలుగా వుండిపోయాయి.

కొంతసేపటి క్రితం అంత తెల్లగా మారినవి, తమ బట్టలేనా? అన్న అనుమానం పట్టుకుంది—అందరికి.

ఆషాక్ నుండీ తేరుకొని ఆనందాతిశయంలో కరతాళ ధ్వనులతో నిండిపోయిందా ప్రదేశమంతా.

# 5

"సార్ స్టేజ్ వెనుక వుండి చూశాను. లోపల ఎక్కడా మనుషులు లేరు. హోటల్ బృందావన్ నుండీ ఆర్డ రిచ్చారట, కాఫీ టిఫిన్లు—బృందావన్ సర్వర్లు మాత్రం కప్పులు, కెటిల్సు సర్దుకుంటున్నారు. వాళ్ళ వేన్‌లో సామాన్లు లోడ్ చేసుకుంటున్నారు." అన్నాడు రవణ యింటికి రాగానే చక్రవర్తితో.

అదే సమయంలో ఫోన్ రింగైంది.

రిసీవర్ అందుకొని—"చక్రవర్తి హియర్" అన్నాడు.

"దామోదర్ ని మాట్లాడుతున్నాను. కార్లుపోయాయని రిపోర్టు యిచ్చినవాళ్ళు తమ రిపోర్టు వుపసంహరించుకుంటున్నారు. డెవిల్సుని పట్టుకోడానికి వున్న ఒక్క ఆధారం పోయింది." అన్నాడు.

"అయితే ఆ నలుగురూ అప్పుడే డెవిల్సు క్లబ్‌లో మెంబర్సయ్యారన్నమాట." అన్నాడు— చక్రవర్తి శాంత గంభీర కంఠంతో.

"ఆ! క్లబ్‌లో చేరారా!!?"

"అవును డెవిల్సుమీద సదభిప్రాయం కలిగింది గనకే రిపోర్టు వుపసంహరించుకున్నారు..."

అదే సమయంలో ఫోన్ డిస్‌కనెక్ట్ అయినట్లు క్లిక్ మని—దామోదర్ మాటలకి బదులుగా—

"ఇన్ స్పెక్టర్ గారూ! మీ రాకకోసం ఓ శవం సముద్రపొడ్డున ఎదురుచూస్తోంది. మినర్వాటాకీస్ కెదురుగా సముద్రంలోకి చొచ్చుకొని వున్న రాళ్ళగుట్టల మధ్యలో పడి వుంది. యిండియాలో ఎవరూ పోల్చలేరు ఆ శవం ఎవరిదో. మీకు శ్రమ కలిగించడం యిష్టంలేక వివరాలు కూడా అందజేస్తున్నాం. వినండి.

చైనా గూఢచారి చిన్ వాన్ ఘూ. విశాఖ అవుటర్ హార్బర్ ప్రాముఖ్యత, నేచురల్ పోర్టు, విశాఖ ముఖ్య స్థలాలు అతి విలువైన, ముఖ్యమైన ప్రదేశాలు, కీలక స్థావరాలు, తన రిపోర్టుతో సహా తయారుచేసిన 16 ఎమ్. ఎమ్. ఫిలిమ్ తన దేశానికి అందజేయడానికి సిద్ధంగా వున్న తరుణంలో మాకు పట్టుబడ్డాడు. డిటెక్టివ్ చక్రవర్తిగారికి రేపు రిజిస్టర్ పార్సిల్ గా అందుతుంది.

దేశ సౌభాగ్యానికి, నవభారత సామ్రాజ్య నిర్మాణానికి తోడ్పడగలరన్న విశ్వాసంతో చక్రవర్తిగార్ని ఆయన అనుమతి లేకుండానే మా కార్యవర్గ సభ్యులుగా ఎన్నుకున్నాం. ఆయన ఈ రీల్ ప్రభుత్వానికి అప్పగించే బాధ్యత వహిస్తారు. జైహింద్."

"విన్నావా దామోదర్," అన్నాడు చక్రవర్తి సంభ్రమాశ్చర్యాలతో.

"ఏమిటి బ్రదర్. నువ్వు కలిసి పోయావా, యిది నిజమేనా? డెవిల్సు అసాధ్యమైనవిలా గున్నాయే. ఫోన్ కాల్సుకూడా మధ్యలో ట్రాప్ చేస్తున్నాయి. నిజంగా చైనా గూఢచారి శవం వుందంటావా!"

"బ్రదర్! తినబోతూ రుచి అడగడం దేనికి? పద వెళదాం," అంటూ రిసీవర్ క్రెడిల్ చేశాడు చక్రవర్తి.

"ఉమా, చెవర్లెట్ పైకి తియ్యి." అంటూ లేచాడు చక్రవర్తి. మరికొన్ని క్షణాల్లో చక్రవర్తి ఉమ ఎక్కిన చెవర్లెట్ యింపాలా మినర్వా టాకీస్ వైపు పరుగెత్తింది.

# 6

దామోదర్ పరివారంతో అప్పుడే వచ్చి ఎదురు చూస్తున్నాడు.

నలుగురు కానిస్టేబుల్స్ అతికష్టం మీద రాళ్ళ గుట్టలు పైకెక్కి గాలించి మధ్యగా అడుగున శవం వున్నట్లు తెలుసుకోగలిగారు.

నలుగురు జాలర్ల సాయంతో శవాన్ని పైకి తీయించి ఒడ్డుకు వచ్చారు.

అతను చైనా దేశస్థుడే. శవాన్ని ఫోటోలు తీసి అంబులెన్సులో ఎక్కించే ఏర్పాటు చేస్తున్నాడు దామోదర్.

అదే సమయంలో రోడ్ మీద ఆపివున్న పెట్రోల్ వాన్ దగ్గరున్న కానిస్టేబుల్ పరుగుతో వచ్చి, "సార్! మిమ్మల్ని ఫోన్ లో ఎవరో పిలుస్తున్నారు." అన్నాడు దామోదర్ తో.

చక్రవర్తి శవాన్ని పరీక్షిస్తున్నాడు.

"కంట్రోల్ రూమ్‌నుంచా!" అంటూ వేన్ వైపు నడిచాడు దామోదర్.

రిసీవర్ అందుకోగానే, "థేంక్స్ సార్. రిపోర్టు అందజేసిన వెంటనే యాక్షన్ తీసుకున్నారు. మరికొన్ని వివరాలు. చిన్ వాన్ ఫూ తాత్కాలిక నివాసం జయశంకర్ లాడ్జి—రూమ్ నెంబర్ త్రీ. కోట వీధిలో వున్న

అబ్దుల్లా వైన్ షాపు రహస్య సమావేశాల స్థలం. ముఖ్యమైన సమాచారాలు అబ్దుల్లా సేకరించి, ఆ షాపులో వున్న ట్రాన్స్‌మీటర్ ద్వారా వార్తలు అందజేస్తాడు. అబ్దుల్లా చేతిలో మరో పదిమంది ఉన్నారు. ఈ రోజు రాత్రి సరిగ్గా పదిగంటలకి సర్‌ప్రైజ్ చెక్ చేశారంటే క్రూర మృగాలన్నీ చిక్కిపోతాయి. శ్రమ అనుకోకుండా వెంటనే ఏర్పాట్లు చేయండి. జైహింద్" క్లిక్ మంది.

రిసీవర్ కానిస్టేబుల్‌కి అందించి చక్రవర్తి కోసం పరిగెత్తాడు దామోదర్—

"బ్రదర్ అబ్దుల్లా మంచి పేరు ప్రతిష్టలు గలవాడు. సొసైటీలో పెద్ద పలుకుబడి వుంది. యిక్కడికి ఏ వి. ఐ. పి. వచ్చినా పార్టీలు చేస్తాడు. అలాంటి వ్యక్తిపై ఎలా దాడిచేస్తాం. యిది ఫాల్స్ యిన్‌ఫర్‌మేషన్ అయితే నాకు చాలా చిక్కులు ఎదురౌతాయి!" అన్నాడు దామోదర్, ఫోన్ వివరాలు చెప్పి.

"అవును! పద. నేను చెప్పినట్లు చెయ్యి!" అంటూ తన చెవర్లెట్ కారువైపు నడిచాడు చక్రవర్తి.

చక్రవర్తి, దామోదర్ ఎక్కగానే కారు స్టార్ట్ చేసింది ఉమ.

"బ్రదర్! రమణ మారువేషంలో రాత్రి పది గంటలకి కేష్‌బేగ్‌తో పరిగెట్టి కోటవీధిలో కొంతసేపు పోలీసులని అల్లరిపెట్టి, అబ్దుల్లా బిల్డింగ్‌లోకి పారిపోతాడు. వెంటనే నీ పరివారంతో రమణ కోసం అబ్దుల్లా బిల్డింగ్‌లో దాడి జరుపు. మిగతా విషయాలు నే చూసుకుంటాను," అన్నాడు చక్రవర్తి.

# 7

"డియర్ ఫ్రెండ్స్! మీరంతా ఈ సమావేశానికి ఎందుకు పిలవబడ్డారో ఈపాటికి అర్థమయ్యే వుంటుంది. మన రహస్యాలు డెవిల్సుకి ఎలా తెలిశాయి. అసలు డెవిల్సు గొడవేమిటి? ఎవరు వీళ్ళు? మన నాయకుడు డెవిల్సుచేత హత్య చేయబడ్డాడు. ఫిల్మ్‌రీల్ డెవిల్సు అపహరించాయి. ఆ రీలు సక్రమంగా చేరితే మనకి లక్ష రూపాయలకి పైగా కిట్టుబాటయ్యేది.

ఎల్లుండి బుధవారం నాడు అంటే ఏడోతారీకున ఓ స్టీమర్ మన రేవుకి వస్తోంది. అందులో గోధుమలు వస్తున్నాయి, ఈసారి గన్నీ బ్యాగుల్లో వస్తాయి. అందులో 1201 నెంబరు బేగ్ మనది. అది ఎలాగైనా గొడౌన్ చేరకుండా మీరు తీసుకురావాలి. ఈ పని చాలా అప్రమత్తతతో జాగ్రత్తగా నిర్వహించాలి.

బొంబాయి మెడ్రాసు రేవుల్లో మనవాళ్ళు ఎంతో చక్కగా పనిచేస్తున్నారు. మీరుకూడా వాళ్ళలాగే బాస్‌ని సంతోషపెడతారని ఆశిస్తాను.

రహీమ్, కాశీమ్, జబ్బార్ మీరు ముగ్గురు డెవిల్సు గురించి గాలించండి. ఏమాత్రం అనుమానం ఉన్నా కాల్చి పారేయండి. సలీమ్, సుకుమార్, కాశిం, గజపతి, వీటిని బేగ్ కోసం వెళ్ళండి. త్వరలో బాస్ మన విశాఖ నాయకుడ్ని నియమిస్తారు. అంతవరకూ నన్ను మీకు నాయకుడుగా ఉండమని బాస్ కోరారు."

అంటూ ఉపన్యాసం యిచ్చిన అబ్దుల్లా, గదిలో రెడ్ బల్బు వెలగడం చూసి ఆగిపోయాడు.

ఆ గదిలో ఓ టేబులు, ఎదురుగా యిరవై కుర్చీలు ఉన్నాయి. యిరవై కుర్చీల్లో ముఠా వ్యక్తులంతా

కూర్చొని ఉన్నారు. అందరికీ తలనుండీ పాదాల వరకూ నల్లని బురఖా వుంది.

డేంజర్ బల్బు చూసి అంతా లేచి నిలబడ్డారు. అబ్దుల్లా ముఖాన్ని మాత్రం ముసుగు కప్పివుంది.

అదే సమయంలో పైనుండీ అరుపులు కేకలు వినబడు తున్నాయి.

"మీరంతా రెండో వైపు ద్వారంగుండా..." అతని మాట పూర్తి కాకుండానే తలుపు బాదుతున్న శబ్దం— యిరవై మందితో ఓ ముసుగు వ్యక్తి పరుగున వెళ్ళి తలుపు తెరవడం, బిలబిలమంటూ పోలీసులు గదిలో జొరబడటం ఒక్కసారే జరిగిపోయాయి.

టేబుల్ వెనుక నిలబడ్డ అబ్దుల్లా తక్కున ప్రక్కనే వున్న ద్వారంవైపు గెంతాడు. అదేసమయంలో తలుపు తెరిచిన ముసుగు వ్యక్తి ఒక్క అంగలో వెళ్ళి అబ్దుల్లాని చుట్టేశాడు.

"ఎవరు నువ్వు?" అరిచాడు అబ్దుల్లా గది దద్దరిల్లేలా.

"తొందరపడకు మిస్టర్ అబ్దుల్లా. తెలుస్తుంది. పిచ్చి వేషాలు వెయ్యకు. ఈ భవనం చుట్టూ అడుక్కో పోలీసు మాటువేసి ఉన్నారు. అదిగో ఇనస్పెక్టర్ దామోదర్. సంఘంలో పెద్ద మనిషిగా, నీతిపరుడిగా, సంఘం సంస్కర్తగా చాలా బిరుదులు సంపాదించావు. ఈ ముసుగు వేసు కోడానికి భారతదేశంలో పుట్టి పెరిగినా పొరుగు దేశాల మదత్తుకి, డబ్బుకి ఆశపడి, స్వదేశానికి, నిన్నింత వాడ్ని చేసిన ప్రభుత్వానికి, ద్రోహంచేసి ఏం బావుకుందామను కున్నావు?"

"నోటికొచ్చినట్టు కోస్తున్నావ్ నే నెవరో తెలిసే మాట్లాడుతున్నావా?? నేను చేసిన నేరమేమిటి? నా ఇంటి మీద పాపు మీద ఈ దాడిఏమిటి?" మేకపోతు గాంభీర్యంతో అరిచాడు అబ్దుల్లా.

ముసుగు లాగేశాడా వ్యక్తి.

"అ!!! డిటెక్టివ్ చక్రవర్తి!!" కీచుగా అరిచాడు అబ్దుల్లా.

"అరే!! నువ్వా భాయ్!" ఆనందంగా ఒక్క అంగలో వచ్చి అబ్దుల్లాకు బేడీలు తగిలించాడు దామోదర్.

అప్పటికే అందర్నీ అదుపులోకి తీసుకున్నారు పోలీసులు.

అదేసమయంలో తుళ్ళిపడి వాచీ చూసుకున్నాడు డిటెక్టివ్ చక్రవర్తి.

కీ హెడ్ కి సరిగ్గా రెండో వైపున శిలువ ఆకారంలో ఉన్న చిన్న రాడ్ అరంగుళం పైకొచ్చి చక్రవర్తి చేతిని రెండు వైపులా చరుస్తోంది.

"దామోదర్! పరిగెత్తు హరియప్. అందర్నీ బయట పడమను. డేంజర్ సిగ్నల్ యియ్యి. క్విక్ టైంబాంబ్ ఏర్పాటు చేశారు ఎక్కడో." అంటూ అబ్దుల్లాని తోస్తూ గుమ్మంవైపు పరుగెత్తాడు చక్రవర్తి.

దామోదర్ విజిల్ తీసి డేంజర్ సిగ్నల్ యిస్తూ పరుగెత్తాడు చక్రవర్తి వెనుక.

భవనం గుమ్మం దిగుతుండగానే ఎక్కడో బ్రహ్మాండం బద్దలయ్యేటట్టు భయంకర ప్రేలుడు "ధాం" మని వినబడింది.

ప్రాణాలు అరచేత పెట్టుకు పరుగెడుతున్నారంతా. చూస్తూండగానే భవనం గోడలు బీటలుదేరి ఎక్కడి

కక్కడ కూలిపోవడం మొదలెట్టింది. అదే సమయంలో మళ్ళీ ప్రేలుడు - భవనం పునాదులతో సహా కదిలిపోయింది శిధిలాలు గగనానికి ఎగిరి ఎక్కడెక్కడో పడ్డాయి.

# 8

"బ్రదర్. నలభైమంది అమాయక ప్రజలు తీవ్రంగా గాయపడ్డారు. పదిమంది పరిస్థితి ప్రాణపాయంలో వుంది. అబ్దుల్లా సైనెడ్ టూత్ కొరుక్కొని మరణించాడు. మిగతా ఇరవై మందిని కస్టడీలోకి తీసుకున్నాం. భవన శిధిలాల్లో చాలా భాగం పాడైన విదేశ వస్తువులు దొరికాయి. అందులో రివాల్వర్సు, మినీ మిషన్‌గన్సు, ఆయుధ సామాగ్రి కూడా వుంది!" అన్నాడు దామోదర్.

"నా వాచీ కేర్పాటు చేసిన ఎలక్ట్రానిక్ డిటెక్టర్ సడన్‌గా సిగ్నల్ యివ్వడం మొదలెట్టింది. అంటే మనం ఎటాక్ చేయగానే అబ్దుల్లా ఏ రహస్య బటనో నొక్కి టైమ్‌బాంబ్ పనిచేసేటట్లు చూశాడు. దేశద్రోహానికి తలపెట్టిన వాళ్ళు మృత్యువును అరచేతిలో అమర్చుకుంటారు. ఇందులో ఆశ్చర్య పడనవసరంలేదు. అయితే ఏమాత్రం అవకాశం ఉన్నా యింత నష్టం జరిగేది కాదు.

ఆ సమయంలో టైంబాంబు కో సం వెదుకుతూ కూర్చుంటే ఎందరి ప్రాణాలు పోయేవో." అన్నాడు చక్రవర్తి.

ఆదేసమయంలో ఫోన్ మ్రోగింది. రిసీవర్ ఎత్తి "చక్రవర్తి హియర్" అన్నాడు.

ఎదురుగా కూర్చున్న దామోదర్, రవణ, ఉమాదేవి అటు చూశారు ప్రశ్నార్థకంగా.

అప్పుడే చక్రవర్తి చేతికున్న వాచీ నుండీ శిలువ

ఆకారంలో ఉన్న రాడ్ మెల్లగా పైకొచ్చి చక్రవర్తి చేతిమీద అటు యిటూ కదలసాగింది.

"సార్! వెంటనే బయటపడండి-మీ ఆఫీసు రూమ్ వెనుక యిప్పుడే...నో టైమ్ పరుగెత్తండి—"

అంతే! "అంతా పరుగెత్తండి టైంబాంబ్" అంటూ అరిచి ఉమ చెయ్యి పట్టుకొని ఒక్క అంగలో గుమ్మం దాటాడు చక్రవర్తి. దామోదర్, రవణ వెనుకే పరుగెత్తారు.

"రాఘవా, బయటకి పరుగెత్తు" అరిచాడు చక్రవర్తి అప్పుడే కాఫీ ట్రేతో వస్తున్న రాఘవని.

ట్రే క్రిందపడేసి పరుగెత్తాడు రాఘవ. భవనం వదిలి పదడుగులు వేశారో లేదో "ఢాం" అంటూ ప్రేలుడు - మరో క్షణం ఆ ప్రదేశమంతా సుళ్ళు తిరుగుతూ పొగ, మంటలు. కుప్పలా కూలిపోయింది భవనమంతా.

శిలా ప్రతిమల్లా వుండిపోయారంతా.

చక్రవర్తిని కరుచుకు పోయింది ఉమ.

ధూళీ దుమ్ములో బైరాగుల్లా, గనుల్లో పనిచేసిన పని వారిలా తయారయ్యారంతా.

"మైగాడ్! ఎంత ప్రమాదం జరిగింది. శ్రీ నిలయం నామరూపాల్లేకుండా శిధిలమైంది. నా సమక్షంలో ప్రఖ్యాత డిటెక్టివ్ చక్రవర్తి భవనం శిధిలావస్తకి గురి చేసిన ఆ దుష్టుడ్ని పట్టి బంధించేవరకూ ఆహారం ముట్టను. బ్రదర్! ఈ దారుణానికి చింతిస్తున్నాను" అన్నాడు దామోదర్.

అనేక కష్టాల్లో ప్రాణాపాయాల్లో, మృత్యువుతో చెలగాటమాడిన ఉమ చక్రవర్తిని వాటేసుకుని, అమాయక పసిపాపలా విలపిస్తోంది. ఆధునిక సౌకర్యాలతో

లేబరేటరీ, అనేక విలువైన పరిశోధనా పరికరాలతో వున్న శ్రీ నిలయం మట్టిపాలైయ్యేసరికి బాధగా, ఉమని పొదివి పట్టుకొని క్షణం దీర్ఘ నిట్టూర్పు విడిచాడు చక్రవర్తి.

నిప్పుకణాలైన నేత్రాలతో పిడికిలి బిగించి చూస్తున్నాడు రవణ మంటలతో నిండిన శ్రీనిలయం వైపు.

జనం విపరీతంగా పొగైపోయారు.

సైరన్ మ్రోతతో పోలీస్ వేన్, గంటల శబ్దంతో రెండు ఫైర్ యింజనులు వచ్చాయి.

అదేసమయంలో జనానికి వెనుకగా ఆగి వున్న వాహనాల్లో ఓ కారు బయలుదేరడం చక్రవర్తి దృష్టిని పడింది.

"రవణ ఉమని చూడు. రాఘవా ఫాలోమీ," అంటూ జనాన్ని తోసుకుంటూ పరుగెత్తాడు.

దామోదర్‌కి వినిపించాయా మాటలు కానీ ఏమైందో ఎందుకు పరుగెత్తాడో చక్రవర్తి అర్థంకాక అతన్ని అనుసరించాలో, యిక్కడ పరిశోధనకి దిగాలో అవగాహన కాక క్షణం అచేతనంగా నిలబడిపోయాడు.

"అన్నయ్యా! యింకా యిక్కడుంటే నాకు పిచ్చి పట్టేటట్లుంది. ఎక్కడికైనా వెళతాం పద"_ అంది ఉమ.

"పద చెల్లాయ్! అప్సరాకి వెళదాం_ యినస్పెక్టర్ గారూ, చెల్లాయిని అప్సరాలో దించి వస్తాను" అన్నాడు రమణ.

"ఎందుకమ్మా ఒంటరిగా అక్కడుండటం. మీకు అభ్యంతరం లేకపోతే మా యింటికి తీసుకెళతాను..." అన్నాడు దామోదర్.

"ఎక్కడికైనా సరే. ముందీ వాతావరణంనుండీ దూరంగా పోవాలి" అంది ఉమ బాధగా.

"పద రమణా! రామ్మా," అంటూ ఓ పెట్రోల్ కారు సమీపించి ఉమ, రమణను తీసుకొని బయలు దేరాడు.

ఫైర్ సర్వీస్, పోలీసులు తమ తమ పనులు చకచకా చేసుకుపోతున్నారు.

# 9

అది ఎ.పి.వి. 5062 హిల్‌మన్ కారు. బయలు దేరిందే తడువు అతివేగంగా దూసుకుపోయింది.

స్కూటర్ ఆపి మంటలలో నిండిన శ్రీనిలయం వైపు చూస్తున్న వ్యక్తిని ప్రక్కకి తోసి స్కూటర్ గేర్స్ మార్చి ముందుకు వురికించాడు చక్రవర్తి. అప్పుడే డైమండ్ పార్కు దాటి పోతోంది హిల్‌మన్ కారు. పూర్తిగా ఎక్సిలేటర్ చేసి హిల్‌మన్ వైపే చూస్తున్నాడు చక్రవర్తి.

స్కూటర్ డైమండ్ పార్క్ దాటేసరికి హిల్‌మన్ మెయిన్‌రోడ్ ఎక్కి స్టేషన్ వైపు తిరిగింది.

చక్రవర్తి స్కూటర్‌ని పార్కు ప్రక్కగా దొండపర్తి రోడ్ వైపు పోనిచ్చాడు.

స్కూటర్ తిరిగి డివిజనల్ సూపరెంట్ కార్యాలయం రోడ్ ఎక్కేసరికి హిల్‌మన్ అల్లిపురం రోడ్ వైపు తిరిగింది. అప్పుడే చూశాడు హిల్‌మన్ ముందు అతివేగంతో దూసుకుపోతున్న మోటర్ బైకుని.

ఆ మోటర్ బైక్ వ్యక్తి ఎవరు? హిల్‌మన్‌ని ఎందుకు వెంటాడుతోంది. అందులో ఎవరున్నారు? ఆ కారు

రోజా టెక్స్‌టైల్స్ ప్రొప్రయిటర్‌ది. డెవిల్స్ దొంగ లించాయని రిపోర్టు యిచ్చి తిరిగి ఉపసంహరించుకున్నారు.

స్కూటర్ కండిషన్‌లో లేకపోవడం వల్ల సరిగా పరిగెత్తడం లేదు. చక్రవర్తి అల్లిపురంరోడ్ సమీపించేసరికి అదే సైడ్ తిరిగిన హిల్‌మన్ ఎక్కడా కనిపించలేదు.

అరె! ఇంత త్వరగా అటువైపు జంక్షన్ చేరుకోవడం అసంభవం. మరి ఎలా మాయమైంది.

అదేసమయంలో రైల్వే క్వార్టర్స్‌వైపు దూసుకు పోతున్న మోటార్‌బైక్ కనబడింది. హిల్‌మన్ మాత్రం ఎక్కడా కనబళ్ళేదు.

వెంటనే చక్రవర్తి ఎడమవైపు తిప్పి మోటార్‌బైక్ వెళ్ళినవైపు పోనిచ్చాడు స్కూటర్‌ని.

అపరిమితమైన వేగంతో రైల్వే క్వార్టర్స్ మధ్యగా దూసుకుపోయి, జైల్‌రోడ్ ఎక్కింది మోటార్ బైక్.

స్కూటర్ కూడా జైల్‌రోడ్ సమీపించింది.

హిల్‌మన్ జాడలేదు.

అంతవరకూ వెంటాడిన మోటర్‌బైక్ తన దృష్టిని పడగానే హిల్‌మన్ తప్పుకుందంటే దానికి కారణం? తళుక్కుమంది ఆలోచన చక్రవర్తి మదిలో.

మోటార్‌బైక్ ఆశీలుమెట్ట వైపు పోతోంది. తన దృష్టిలోంచీ తప్పిపోకుండా స్కూటర్ సాధ్యమైనంత జోరుగా పోనిస్తున్నారు చక్రవర్తి. అదే సమయంలో వెనుక టూటౌన్ పోలీస్ స్టేషన్ నుండీ బయలుదేరిన పోలీస్ జీప్ సైరను మోతతో వచ్చి చక్రవర్తిని సమీపిస్తోంది.

జీప్‌ని చూసి స్కూటర్ ఆపి అక్కడ పడేసి, జీప్‌లోకి దూకారు చక్రవర్తి. ఓ కానిస్టేబుల్ వెనకనుండీ దిగి స్కూటర్ అందుకున్నాడు. జీపు స్పీడందుకుంది.

అందులో దామోదర్ అసిస్టెంట్ జగన్నాథ్, ఎస్. ఐ. వున్నాడు.

"మీరు యిప్పుడే ఓ బులెట్‌పై పోతూన్న వ్యక్తిని వెంటాడుతున్నారని, స్కూటర్ ట్రబుల్ అయ్యిందనీ, వెంటనే బయలుదేరమని ఎవరో ఫోన్ చేశారు సార్. స్టేషన్‌లోంచి పైకొచ్చేసరికి బులెట్, ఆ వెనుక మీరు ఇటు రావడం కనబడింది. వెంటనే వచ్చాను." అన్నాడు జగన్నాథ్, జీప్‌ని గాలిలో ప్రయాణం చేయిస్తూ.

ఆశీలుమెట్ట దాటి సీతమ్మధారవైపు తిరిగింది బులెట్. అదే సమయంలో హఠాత్తుగా ఎదురుగుండా రాసాగింది హిల్‌మన్.

బులెట్ ఠక్కున ఆగి వెంటనే బాక్ చక్రం వెనక్కి త్రిప్పి జీప్ వైపు రాసాగాడా ఆగంతకుడు. వెనుక హిల్‌మన్ దూసుకొస్తోంది.

జీప్ సమీపించగానే బులెట్ పైనుండీ రోడ్ ప్రక్కకి దూకేశాడా వ్యక్తి.

క్షణంలో బులెట్ పెద్ద శబ్దంతో జీప్‌ని ఢీకొంది.

ఇలాంటిదేదో జరుగుతుందని ముందే సిద్ధంగా వున్న డిటెక్టివ్ చక్రవర్తి కూడా ఠక్కున గెంతి వెంటనే లేచి పరుగెడుతున్న ఆగంతకునివైపు బయలుదేరారు. అంత సమీపంనుండీ ఎదురుగా అప్‌లాండ్స్‌వైపు పరుగెడుతున్న ఆగంతకున్ని చూసేసరికి గతుక్కుపడ్డా రాయన.

ఆయన ముఖం రౌద్రాన్ని పులుముకుంది, చేతిలో రివాల్వర్ ప్రత్యక్షమైంది. అతను పరిస్థాన్ గూఢచారి 003. తన చేతుల్లోంచీ రెండుసార్లు తప్పించుకొని ఈ రోజు ఇలా తనమీద పగ సాధించాడా!

రివాల్వర్ గురిచూసి పేల్చారు చక్రవర్తి.

వెంటనే పరుగెడుతున్నవాడల్లా ఆగి ప్రక్కనున్న బండరాళ్ళవైపు తప్పుకొని ఎదురు కాల్పులు మొదలెట్టాడు పరిస్థాన్ గూఢచారి 003.

చక్రవర్తికూడా ఠక్కున ఆగిపోయి ప్రక్కనున్న రాయిచాటుకి తప్పుకున్నాడు.

అదే సమయంలో పెద్ద చావుకేక వినబడింది ఎదురుగా హఠాత్తుగా పరిస్థాన్ గూఢచారి 003 ముందుకి పడి బాధగా కొట్టుకోవడం మొదలెట్టాడు.

ఆశ్చర్యంగా చక్రవర్తి అటువైపు పరుగెత్తాడు.

రివాల్వర్ పట్టుకొన్న గూఢచారి చెయ్యి సగానికి తెగిపోయి క్రిందపడి వుంది. రెండో చేతికి అర చేయే లేదు.

ఎందరిన్నో అమానుషంగా చంపి, ఎన్నో బాధలకు గురిచేసిన పరిస్థాన్ గూఢచారి 003 బాధ అంటే ఏమిటో ప్రత్యక్షంగా అనుభవిస్తున్నాడు.

అదేసమయంలో హిల్‌మన్ కదిలి వెళ్ళి పోతూండడం జగన్నాథ్ యిద్దరు కానిస్టేబుల్స్ పరిగెత్తుకు రావడం కన బడింది.

అతన్ని కస్టడీలోకి తీసుకొమ్మని జగన్నాథ్‌కి అప్ప గించి, హిల్‌మన్ కెళ్ళిన వైపు బయలుదేరారు చక్రవర్తి.

# 10

అది కమీషనర్ కార్యాలయం. పోలీస్ కమీషనర్ శ్రీ షేక్ రహీంతుల్లా, ఐ. జి, శ్రీ విశ్వనాథం. క్రైమ్ బ్రాంచీ ఇనస్పెక్టర్ దామోదర్, డిటెక్టివ్ చక్రవర్తి, శ్రీమతి ఉమాచక్రవర్తి, అసిస్టెంట్ రమణ ఆశీనులై యున్నారు. వారి కెదురుగా, రమేష్, రోజా టెక్స్‌టయిల్స్ ప్రొప్రైటర్ కుమారుడు, గిరిబాబు - మెడికల్ సూప ర్నెంట్ గారి కుమారుడు, కృపలానీ, డైమండ్ మర్చెంట్ రతనలాల్ కుమారుడు, నారాయణ్, సైకాలజీ ప్రొఫె సర్ గారి కుమారుడు, ప్రఖ్యాత సినీతార కుమార్తె వందనా దేవి, ఆఫీసర్స్‌కి ఎదురుగా కూర్చుని ఉన్నారు.

పైన ప్రెస్ రిపోర్టర్స్, విశాఖ ప్రజలు ఆత్రుతగా ఎదురు చూస్తున్నారు.

"చక్రవర్తిగారూ, నగరంలోని ప్రముఖులు, ధనికులు అయిన వ్యక్తుల పిల్లలు వీరే యింత ఆందోళనకి ముఖ్య కారకులని ఎలా తెలుసుకున్నారు?" అన్నారు కమీషనర్ షేక్ రహీమతుల్లా.

చక్రవర్తి వైపు తిరిగాయి అందరి నేత్రాలు.

చక్రవర్తి నిలబడి ఒక్క క్షణం అందరివైపు చూసి, చెప్పసాగాడు.

"వీరంతా అఖండమైన తెలివితేటలు కలవారు. అపారవిద్యావంతులు. వీరిలో యిద్దరు, అమెరికా వెళ్ళి వచ్చినవారు. హ్యూమన్ సైకాలజీలో డాక్టరేట్ పొందినవారు వున్నారు.

దేశంలో జరుగుతున్న అన్యాయాలకి, అక్రమాలకి, దౌర్జన్యాలకి, హింసాకాండలకి వీరి హృదయాలు చలించి

పోయాయి. అందరూ అధిక ధనవంతులే. అయిదేళ్ళ పంచవర్ష ప్రణాళిక ఏర్పాటు చేసుకొని, డబ్బు, పటిష్ట మైన ప్లాను తయారు చేసుకొని, దేశాన్ని తిరిగి సస్య శ్యామలంగా, రామరాజ్యంగా మార్చడానికి రంగంలోకి దిగారు.

అయితే ముక్కు పచ్చలారని, అయిదుగురి పసివారితో నవరాజ్యాంగ నిర్మాణం జరిగితే దేశాన్ని పాలించడానికి యిందరు మంత్రులు, మార్బలం అవసరం లేదేమో.

అభిరుచులు, ఆశయాలు గొప్పవే కానీ ప్రభుత్వం పెద్దలూ ఉండగా, తామే తొందరపడి యిందులో దిగి విఫలప్రయత్నమే అయింది.

అయితే ఎప్పటికప్పుడు చాలా అప్రమత్తతలో ఉండి చట్టానికి వ్యతిరేకంగా ఘోరాలేమీ చెయ్యలేదు.

అదే నన్ను ఆనందపరిచింది.

తమ బంధువుల కార్లు, తమ కార్లు వాడుకున్నారు.

అప్పుడే నాకు అనుమానం కలిగింది. రాఘవని అదే పని మీద నియమించాను.

చాలా సమాచారం సేకరించాడు. అయితే అదే సమయంలో చైనా గూఢచారిని పట్టుకోవడం జరిగింది.

నారాయణ్ మంచి సెక్రటరీ. సేడియమ్‌లో ప్రోగ్రామ్స్ అతనే ఇచ్చాడు. మెస్మరైజ్ చేసి ప్రేక్షకుల సబ్‌కాన్షస్ మైండ్‌కి ఆటో సజషన్స్ యిచ్చి తన ఆధీనంలోకి తీసుకున్నాడు. ఆ సమయంలో అతను చెప్పి నట్లు భ్రమకలుగుతుంది.

మెస్మరిజమ్, హిప్నాటిజమ్, టెలిపతి క్లైరోలాయిన్స్ మొదలగు మానవాతీత శాస్త్రాల్లో అఖండ ప్రతిభ నార్జించి ప్రజల్ని సమ్మోహితుల్ని చేశాడు.

పరిస్తాన్, చైనా గూఢచారుల్ని పట్టిచ్చిన ఘనత వీరిదే. భారతదేశానికి కీడు తలబెట్టిన యిద్దరు శత్రుదేశాల గూఢచారుల్ని అప్పగించినందువల్ల వీరికి శిక్ష తప్పేటట్లు చేయగలదని ప్రభుత్వాన్ని కోరుకుంటున్నాను. యిక మీదట వీరి శక్తి సామర్థ్యాలు లోక కళ్యాణార్థం సక్రమ మార్గంలో వినియోగిస్తారని ఆశిస్తాను'' అంటూ ముగించారు డిటెక్టివ్ చక్రవర్తి.

అందరి ముఖాల్లోనూ సంతోషం తాండవించింది. ★

—: ఐపోయింది :—

# రహస్య దీవి

'రాజా'

గుడ్ లక్ సింగపూర్ తీరాన్ని వదిలి రెండు నిముషా లౌతూంది.

సింగపూర్ హార్బర్ దూరంగా కన్పిస్తోంది. బిల్డింగ్స్ పేక మేడల్లా ఉన్నాయ్.

డెక్ మీదనుంచి దిగి కేబిన్ లోకి వచ్చాడు త్రినాథ్. త్రినాథ్ నాతోటి ఏజెంట్.

చిన్నగా రొద పెడుతూ దక్షిణ చైనా సముద్ర జలాలలో ముందుకు సాగుతోంది మోటర్ బోట్ 'గుడ్ లక్.'

ఫ్రిజ్ డర్ తెరిచి బ్లాక్ నైట్ విస్కీ, నార్త్ పోల్ బీరు బాటిల్సు తీసాడు. టేబిల్ కు చెరో వైపునా

కూర్చున్నాము అతనూ నేను.

"ఫిషర్ ఎక్కడ?" అడిగాను. అతను మాకు సీ గైడ్. ఆ బోటులో మొత్తం మేము ముగ్గురమే ప్రయాణిస్తున్నాము.

"ఇంజన్ రూంలో ఉన్నాడు." నెమ్మదిగా అన్నాడు త్రినాథ్.

బీరు కలుపుకొని మగ్ అందుకొన్నాను. కొంచెంగా సిప్ చేస్తూ విండోలోంచి బైటకు చూడసాగాను. దూరంగా హార్బర్‌లో షిప్ వేస్తున్న కేక అస్పష్టంగా వినిపిస్తోంది.

'గుడ్ లక్' వేగాన్ని అందుకొంది. ఇంజన్ రూం లోంచి నవ్వుతూ బైటకొచ్చాడు ఫిషర్.

"ఎలా ఉంది కండిషన్," అడిగాను.

"ఫైన్. మూడురోజులవరకూ అవసరమైన కరెంట్ నిల్వ ఉంది."

"అదికాదు నేనడిగింది. వర్కింగ్ కండిషన్."

"క్వైట్ ఆల్ రైట్."

తృప్తిగా నిట్టూర్చాను. రెండు నిముషాలు మౌనంగా గడిచాయ్. ఫిషర్ వచ్చి మా ప్రక్కనే కూర్చొని విస్కీ అందుకొన్నాడు.

"ఫిషర్..." హఠాత్తుగా అడిగాను "మన ప్రయాణం ఎటువైపు సాగుతోంది."

వింతగా చూసాడు ఫిషర్ ఓ క్షణం. "మనీలా... ఫిలిఫైన్స్ వైపు!" అన్నాడు.

"నో! నా కెందుకో ఆ రూట్ పై నమ్మకం కల్గటం లేదు. హాంకాంగ్ వైపు మార్చు!"

"హాంకాంగ్?" తృళ్ళిపడ్డాడు.

"యస్. అవసరమైతే మధ్యలో 'హైవన్' వైపు మారొచ్చు. అన్నట్లు హాంకాంగ్ దూరమెంత?"

"1440 నాట్ మైళ్ళు."

"ఎన్నాళ్ళు పడుతుంది చేరడానికి?"

"ఐదు రోజులు చాలు! మధ్యలో అవాంతరాలేమీ ఎదురవ్వకపోతే!"

"గుడ్, ఇంటర్నేషనల్ రూట్‌కు 65 డిగ్రీల కోణంలో ప్రక్కనించి పోనివ్వు."

అలాగేనని తలూపాడు ఫిషర్. గ్లాస్‌లో మిగిలిన కొద్ది విస్కీ గొంతులో పోసుకొని ఇంజన్ రూంలోకి వెళ్ళాడు.

సిగరెట్ వెలిగించాను. చివర మండుతూ అంటుకొంది. ఊపిరి తిత్తులలోనికి బలంగా పీల్చి వదిలాను పొగ. వెచ్చగా హాయిగా ఉంది.

గుడ్‌లక్ ప్రయాణపు దిక్కు మారింది. ఆలోచిస్తూ విస్కీ త్రాగుతుండిపోయాను.

దక్షిణ చైనా సముద్రంలో ఒక రహస్యమైన దీవిలో చైనా అణ్వస్త్రాలను తయారు చేయసాగింది. ఈ ఆపరేషన్ బిగిన్ అయి రెండు నెలలు దాటుతోంది. మరో నెల రోజులలో అక్కడి శాస్త్రజ్ఞులు మూడు ఆటమిక్ రాకెట్లను నిర్మిస్తారు.

వాటిలో ఒకటి భారత్ పైనను, రెండవది రష్యా పైనను ప్రయోగించబోతున్నట్లు నమ్మకమైన ఏజంట్ల ద్వారా తెలియవచ్చింది. ఆ ఆపరేషన్‌ను స్మాష్ చేసే బాధ్యత బాస్ అంటే సి.బి.ఐ. డైరెక్టర్ మిశ్రాగారు తనపై పెట్టారు, ఎంతో విశ్వాసంతో.

తను వెంటనే ప్లేన్‌లో బయలుదేరి సింగపూర్ చేరు కున్నాడు. అక్కడి ఏజెంట్ త్రినాథ్ తనకు తోడుగా బయలుదేరాడు.

కాని యీ ఆపరేషన్ అనేక ప్రమాదాలతో కూడుకొన్నది. అసలు ఆ రహస్య దీవిని కనుగొనటమే బహు కష్టం. ఒకవేళ కనుగొన్నా దానిని నాశనం చేయటం తమ ఇద్దరితో సాధ్యమయ్యే పనికాదు. అయినా ఏదోవిధంగా సాధించాలి. భారతదేశాన్ని యీ ప్రమాదం నుంచి రక్షించాలి. దీనిలో తన ప్రాణాలు పోయినా లెక్కచేయడు తను.

చైనా అణ్వస్త్రాలు తయారుచేస్తున్న ఆ రహస్య దీవిని ఎల్లవేళలా రెండు సబ్‌మరైన్‌లు కాపలా కాస్తుంటాయి. అదీగాక దక్షిణ చైనా సముద్రంలో హాంకాంగ్ నుంచి పాంటియానక్ దాకా మరో రెండు యుద్ధ నౌకలు సంచరిస్తుంటాయ్. ఇక శాస్త్రజ్ఞుల బృందానికి, రహస్య దీవికి రక్షణగా కావలసినంత సెక్యూరిటీ చైనానుండి తరలించబడినట్లు వార్తలొచ్చాయి.

అసలే దక్షిణ చైనా సముద్రం అంటే హిందూ మహా సముద్రంలా శాంతిమండలం కాదు. ప్రతిక్షణం ప్రమాదాలతో కూడుకున్న సముద్రమది. తుఫానులకు మరో పేరది. ప్రపంచంలో కెల్లా ప్రమాదమైన సముద్ర జంతువులకు నిలయం. వీటికి తోడు చైనీస్ నావల్ ఫోర్స్.

మామూలు పరిస్థితులలోనే హాంకాంగ్ నుంచి సింగపూర్ దాకా చైనీస్ వార్ షిప్స్ పిచ్చికుక్కల్లా తిరుగుతుంటాయ్. ఈ అణ్వస్త్రాలు తయారు చెయ్యటం మొదలైనప్పటినుంచీ వాటి జాడ మరింత పెరిగింది. ఈ పరిస్థితిలో

దక్షిణ చైనా సముద్రంలో అడుగు పెట్టడం అంటే కోరి మృత్యువును ఆహ్వానించినట్లే. అయినా తప్పదు!

సింగపూర్ స్మగ్లింగ్ కేంద్రంగా ప్రసిద్ధి చెందటం ఒక రకంగా నా కెంతో ఉపయోగించింది. డాలర్ చేతిలో ఉంటే ఏ అవసరమైనా తీరుతుందక్కడ. దొరకని వస్తువంటూ ఉండదు.

అలాగే కొనగలిగాను నాక్కావలసిన వెపన్స్ దగ్గర నుండి ఎలక్ట్రిసిటీతో నడిచే ఈ 'గుడ్ లక్' మోటర్ బోటు దాకా.

విద్యుచ్ఛక్తి సహాయంతో ప్రయాణించే ఈ మోటర్ బోటుకు పెట్రోలు అనవసరం. తనకి కావలసిన విద్యుచ్ఛక్తినంతా సూర్యుడి నుంచే సమకూర్చుకొంటుంది. పగలంతా సూర్యరశ్మి నుంచి సేకరించిన విద్యుచ్ఛక్తి నిల్వ ఉంచుకొని రాత్రివేళల్లో ఉపయోగించుకొంటుంది.

మోటర్ బోటు వుపరిభాగం మీద అమర్చబడిన పళ్లెములవంటి నాలుగు సూర్య విద్యుద్ఘట మాలలు సూర్యరశ్మిని సరాసరి విద్యుచ్ఛక్తిగా మార్చి తద్వారా బోటులోని మోటారును నడుపుతాయ్. అంతే కాక వీటిద్వారా ఇతర పనులకు, మంచి నీటిని పట్టుటకు ఉపయోగించుకోవచ్చును.

ఏదేమైనా పెట్రోలు అవసరంలేని ఈ విద్యుత్ మోటరు బోటుతో ఎన్నాళ్ళయినా ఈ సముద్ర జలాలలో వెదుకులాట సాగించవచ్చు. కాని వున్న వ్యవధి తక్కువ. ఎంత త్వరగా ఆ దీవిని కనుక్కొంటే అంత మంచిది.

గదిలో వక మూల నిశ్చలంగా నిలబడి ఉంది. 'బాతిస్కోప్.' గుండ్రంగా పెద్ద గోళంలా ఉంది. దీన్లో ఇద్దరు

కూర్చొని సముద్ర గర్భంలో ప్రయాణం చెయ్యవచ్చు. చిన్న సైజు సబ్ మెరైన్ అనవచ్చు దీనిని.

చేతిలో అయిపోవచ్చిన సిగరెట్ ను విసిరి కొట్టాను. మరోటి ముట్టించుకో బోతుండగా డెక్ పైనుంచి క్రిందికు దూసుకొచ్చాడు కంగారుగా త్రినాథ్. అతని మెడలో బైనాక్యులర్స్ వ్రేళ్లాడుతోంది.

"వాట్ హాపెండ్!" ఆత్రంగా అరిచాను.

కిటికీలోంచి ఒకవైపు వ్రేలు చూపిస్తూ బైనాక్యులర్స్ అందించాడు నా చేతికి. బైనాక్యులర్స్ కళ్ళ ముందుంచు కొని అతను చూపించిన వైపు చూసి ఉలిక్కి పడ్డాను.

దూరం నుంచి ఏదో గన్ బోట్ మా వైపు దూసు కొస్తూంది. దాని డెక్ మీద నిలబడి ఉన్న నలుగురైదుగురు సోల్జర్స్ నలకల్లా కన్పిస్తున్నారు.

"మైగాడ్...అప్పుడే ప్రమాదం ఎదురవ్వ బోతోం దన్న మాట." అన్నాను.

ఫిషర్ బైటకు పరుగెత్తుకొచ్చాడు. చకచకా అతనికి చేయవలసినదంతా చెప్పాను. అరనిముషంలో పల్లెవాళ్ళలా తయారయ్యాము.

డజను గ్రెనేడ్ లు, రివాల్వర్ లు మెషిన్ గన్ అందించాను. డెక్ నిండా త్రాళ్ళు వలలు పరచబడి ఉండటంతో వాటి క్రింద దాచబడిన వెపన్స్ పైకి కన్పించవు.

బాతిస్కోప్ పై టార్పాలిన్ కప్పి, లాబింగ్ పోల్లు తీసుకొని ఇంజన్ రూంలోనికి నడిచాను. సైడ్ విండోస్ ప్రక్కగా లాబింగ్ పోల్లు అమర్చాను.

షాట్ గన్ అందుకొన్నాను. అది రెమింగ్ టన్ పంప్ యాక్షన్ కార్బన్ 30/06 అమ్యూనిషన్ కు అనువైన

ఛాంబర్ అమర్చబడి ఉంది. క్షణానికో రౌండ్ బైటకు పంపగలదు.

పాట్ గన్‌కు టెలిస్కోప్ తగిలిస్తుండగా క్రిందకు దిగివచ్చారు యిద్దరూ.

గుడ్‌లక్ సాక్షిగా ప్రయాణం సాగిస్తోంది. కిటికీలోంచి తల కొద్దిగా బైట పెట్టి చూసాను. దగ్గర కొచ్చేసింది గన్ బోటు.

రెడ్ కలర్ గన్‌బోట్ అది. దానిపై చైనా దేశపు జాతీయపతాకం ఎగురుతోంది. ఆ బోటు కమర్చబడిన గన్ చూడగానే, నా గుండెలు జలదరించాయ్.

ఐదంగుళాలుంటుందని అంచనా వేశాను. అంటే అది యుద్ధనావ ప్రమాణంలో పెద్దది కాదుకాని గుడ్‌లక్ లాంటి బోట్లను అరక్షణంలో నాశనం చేయడానికి అది చాలు.

'ధన్' మంటూ గన్ ప్రేలింది. చైనా సముద్రపు గాలిలో ప్రతిధ్వనించింది శబ్దం. ఫిషర్, ఏజంట్ ఎక్స్-5 డెక్ పైకి పరుగుతీసారు. టెలిస్కోప్ అమర్చిన పాట్‌గన్ బారల్ కొద్దిగా బైటకు నెట్టి చూడసాగాను.

బోటు ఆపాను, కాని ఏ క్షణంలోనైనా ముందుకు దూకించటానికి ఇంజన్ రెడీగా ఉంచాను.

చైనీస్ గన్‌బోట్ గుడ్‌లక్‌కు వందగజాల దూరంలో ఆగింది డెక్ పైకి చకచకా పరిగెత్తుకొచ్చారు అరడజను మంది సోల్జర్స్. వాళ్ళ చేతిలో మెషిన్‌గన్స్ ఫిషర్, ఏజంట్ ఎక్స్-5 ల వైపు ఆకలిగా చూస్తున్నాయ్.

నేవీ ఆఫీసర్ వేషంలో ఉన్న చైనీ ఠీవిగా డెక్ పైకి వచ్చాడు. వాడి చేతిలో లౌడ్ స్పీకర్ వ్రేళ్ళాడు తోంది.

రాగానే బైనాక్యులర్స్‌తో రెండు నిముషాలు పరీక్షగా చూసాడు గుడ్‌లక్ వైపు. బారల్ ప్రక్కను లాక్కొని విండో వెనక్కి నక్కాను. గన్ దగ్గర కూర్చొన్న ఇద్దరు సోల్జర్స్ దృష్టి ఇంజన్ రూం వైపు ఉంది. ఊపిరి బిగబట్టాను.

ఫిషర్ వైపు తిరిగాడు చైనీ. మైక్ నోటి దగ్గర పెట్టుకొని అడిగాడు.

"ఎవరు వీరు?"

ముఖాలు చూసుకొన్నారు ఫిషర్, ఏజంట్ ఎక్స్-5.

"ఫిషర్ మెన్" సమాధాన మిచ్చాడు ఎక్స్-5.

"ఐ. సీ. ఇంకెంత మందున్నారు లోపల?"

"ఎవరూ లేరు, మేమిద్దరమే!" అన్నాడు ఫిషర్.

అతని గుండె వేగం హెచ్చింది.

"రాస్కెల్స్ నిజం చెప్పండి! ఇంకెంత మందున్నారు లోపల?" కోపంగా అరిచాడు చైనీస్ అధికారి.

"నిజం. మేమిద్దరమే!"

సూటిగా చూసాడు ఇద్దరి వైపు ఓసారి.

"ఎందుకొచ్చారు ఇంత దూరం?" అడిగాడు.

"చేపలు పట్టడానికి." వల చూపించాడు ఫిషర్.

విచిత్రంగా నవ్వాడు చైనీ.

"ఇడియట్... చేపలు పట్టడానికి హార్బర్ నుంచి యాభై మైళ్ళ లోపలికి వచ్చారా? అదీ ఎలక్ట్రిక్ మోటర్ బోటులోనా? ఎవరిని నమ్మిద్దామనుకున్నావ్" పళ్ళు కొరుకుతూ అరిచాడు.

ప్రక్కనున్న సోల్జర్‌కు సైగ చెయ్యగానే వాడు లోనికి పరిగెత్తాడు.

చైనీస్ గన్‌బోట్ గుడ్‌లక్ వైపు కదిలింది. మెషన్ గన్స్ పట్టుకొన్న సోల్జర్స్ దృష్టి నా అనుచరుల మీదే ఉంది.

అటూ ఇటూ చూస్తున్న నేవీ ఆఫీసర్ ఉలిక్కి పడ్డాడు. అతని దృష్టిలో ఇంజన్ రూంలోని విండో లోంచి తొంగి చూస్తున్న 'షాట్ గన్' బారల్ పై నిల్చింది.

"ఫైర్" అంటూ గొంతు చించుకొని అరిచాడు. గన్ బోట్ ఆగిపోయింది. సోల్జర్స్ చేతిలోని మెషిన్‌గన్స్ మొరిగాయ్.

ఊపిరి ఆగి పోయినట్లనిపించింది. సందేహించకుండా కిటికీలోంచి బైటకు తలెట్టి ఆర్మీగన్ ఫైర్ చెయ్యబోతున్న ఇద్దరు సోల్జర్స్‌ను కాల్చేశాను.

'గుడ్ లక్' నా ఆధ్వర్యంలో ముందుకు దూకింది ఏజంట్ ఎక్స్-5 గ్రినేడ్ విసిరాడు కాబోలు వెళ్ళి డెక్ పై పడింది. పెద్ద విస్ఫోటంతో బాటు సోల్జర్స్ శరీరా ల్లోంచి మాంస ఖండాలు చెక్కలతో కలిసి గాల్లో కెగి రాయ్.

గన్‌బోట్ వెనక భాగమంతా నాశనమయింది.

నేవల్ ఆఫీసర్ మరో నలుగురైదుగురు కమాండర్స్ వార్ గన్ వద్దకు పరుగు తీసారు. ఫిషర్ మహోత్సా హంతో మెషిన్ గన్ కాలుస్తున్నాడు.

'థన్' మంటూ ప్రేలింది వార్ గన్. మెరుపులా ప్రక్కకు త్రిప్పాను. అడ్డంగా తిరిగి ముందుకు దూకింది గుడ్‌లక్.

ఫైర్ బాల్ బోటు అంచుకు రాసుకొంటూ దూసుకు పోయింది.

మరోసారి గన్ ప్రేప్చేలోగా లాబింగ్ వీల్ త్రిప్పాను. 'సర్' మంటూ మండుతూ వెళ్ళి గన్ బోట్ ను తాకింది రాకెట్.

చిన్న సైజు బాంబులా ప్రేలింది చైనీస్ నావల్ బోటు. రెండు నిముషాలు సముద్రంలో కలవరం చెలరేగింది. క్రమంగా సద్దుమణిగి ఎప్పటి ప్రశాంతత అలుముకొంది.

తృప్తిగా నిట్టూర్చాను. మొదటి ప్రమాదం గడిచింది. సూర్యుడు నడినెత్తికొచ్చాడు.

క్రిందకి వచ్చారిద్దరూ. బోట్ సరిచేసి, కండిషన్ చెక్ చేసి కాబిన్ లోకి వెళ్ళాను.

నవ్వుతూ నా అరచేయి ముద్దుపెట్టుకొన్నాడు ఏజంట్ ఎక్స్-5. తిరిగి మేమిలా కల్సుకొంటామని అనుకొని ఉండడు బహుశా.

"ఒన్ గ్రెనేడ్ అండ్ ఒన్ రాకెట్! బస్." అన్నాడు.

"అదేమిటి? ఫిషర్ చేతిపై గాయం?" అడిగాను.

"మెషిన్ గన్ బులెట్ దిగబడింది." అన్నాడు నైఫ్ తో ఫిషర్ వైపు కదులుతూ.

"ఆ పని నేను చూస్తాను. నువ్వు కుకింగ్ చూడు!" అంటూ నైఫ్ అందుకున్నాను.

"ఓ. కె. బాస్." కుక్కర్ వైపు కదిలాడు ఏజంట్ ఎక్స్-5.

# 2

రెండు రోజులు గడిచాయ్. హాంకాంగ్ వైపు సుమారు ఐదువందల నాట్స్ దూరం ప్రయాణం సాగించాము. కాని ఏవిధమైన ఆధారం దొరకలేదు.

గంట ఏడయింది. అప్పటి వరకూ దక్షిణ చైనా సముద్రాన్ని దట్టంగా ఆవరించుకొని ఉన్న పొగమంచు తీక్షణమైన సూర్యకిరణాలకు విడిపోయి సముద్రం యధాతథంగా నీలరంగును సంతరించుకొంది.

ఏజంట్ ఎక్స్-5 అందించిన కాఫీ త్రాగి సిగరెట్ వెలిగించాను. చలిచలిగా వున్న వాతావరణంలో వెచ్చదనాన్ని అందించింది పొగ లోనికి వెళ్తూ.

"గుడ్ మార్నింగ్ బాస్!" అంటూ కాబిన్‌లోకి వచ్చాడు ఫిషర్.

"వెరీ గుడ్ మార్నింగ్!" అన్నాను చిన్నగా నవ్వి. ఎక్స్-5 అందించిన కప్పు అందుకొన్నాడు ఫిషర్.

"ఇక బయలుదేరదామా?" అడిగాడు.

తెల్లవారుజాము సముద్రంపై దట్టమైన పొగమంచు ఆవరించుకొని వుండటంవలన ప్రతీ రాత్రీ మూడు గంటలకే ప్రయాణం ఆపెయ్యవలసి వస్తోంది. తిరిగి పొగమంచు విడిపోయే దాకా కదలటానికి వీలులేకపోవటంతో అనవసరంగా టైం వేస్ట్ అవుతోంది.

"మరో గంటలో బయలుదేరుదాం" అన్నాను కుర్చీలోంచి లేస్తూ.

"ఓ.. కె." అని ఇంజన్ రూంలోకి వెళ్ళాడు ఫిషర్. "కమాన్ ఫ్రండ్" ఏజంట్ ఎక్స్-5 ను ఉద్దేశించి అంటూ 'బాతిస్కోప్' వైపు కదిలాను.

ఇద్దరం కలిసి 'బాతిస్కోప్'ను నీటిలోనికి చేరవేసి లోనికి ప్రవేశించాం. విండోలోంచి చూస్తూన్న ఫిషర్ వైపు చెయ్యి ఊపి ఇంజన్ స్టార్ట్ చేసాడు ఏజంట్ ఎక్స్-5.

నెమ్మదిగా సాగర గర్భంలోకి దిగసాగింది 'బాతిస్కోప్'. చుట్టూ ఉన్న అద్దాలలోంచి సముద్ర జంతువులు కన్పిస్తున్నాయ్.

పెద్ద గోళంగా ఉన్న 'బాతిస్కోప్' వేగంగా సాగర గర్భంలోకి దిగుతోంటే షార్క్ చేపలు తమ బలమైన తోకలతో చుట్టూ ఉన్న అద్దాలను మోద సాగాయి.

సముద్ర గర్భంలో కన్పిస్తున్న ఆ ప్రకృతి దృశ్యాలు ఆహ్లాదకరంగా ఉన్నాయ్.

రకరకాల చేపలు, ఎండ్రకాయలు, చిన్నసైజు ఆక్టోపస్‌లు, స్క్విడ్‌లు, వేల్స్ గ్లాస్ ఏంజిల్స్ మొదలైన సముద్ర ప్రాణులు హడావిడిగా అటూఇటూ కదులుతున్నాయ్.

దగ్గరలోనే సముద్ర పాచి (స్పాంజ్) దట్టంగా పేరుకొని ఉంది. 'ఈగల్ రే', 'ఇంద్రధనస్సు' చేపలు స్పాంజి పొద కదులుతూ ఒకదాని నొకటి గుద్దుకొంటున్నాయ్.

"విజయ్...ఎలక్ట్రిక్ ఈల్" అకస్మాత్తుగా అరిచాడు ఏజంట్ ఎక్స్-5.

అటువైపు చూసాను.

మెలికలు తిరుగుతూ సముద్రోపరితలం వైపు సాగుతోంది ఎలక్ట్రిక్ ఈల్. దాని శరీరంనుంచి చిన్నచిన్న మెరుపులతో విద్యుచ్ఛక్తి ఉద్భవిస్తోంది.

సాధారణంగా ఈ ఎలక్ట్రిక్ ఈల్స్ సముద్రం పైభాగానికి రావు.

సముద్ర మట్టానికి 350 అడుగుల లోతువరకూ సూర్యకాంతి ప్రసరిసుంది. ఆ పైన 1500 అడుగుల లోతు

వరకూ మసక వెలుతురు ఆక్రమించి ఉంటుంది. అక్కడి నుండి అంతా గాఢాంధకారం.

అంత లోతున వృక్షజాతులేవీ ఉండవు. కారణం అక్కడి పీడనం అమితభారంగా ఉంటుంది. ఆ పీడ్రానికి తట్టుకో గలిగేవి అతితక్కువ ప్రాణులు మాత్రమే.

ఆ అంధకారంలో తమకు కన్పించటానికి అక్కడ ఉండే ప్రాణులు తమ కాంతిని తామే ఉత్పత్తి చేసు కొంటాయ్.

అటువంటి జాతికి చెందినవే ఈ ఎలక్ట్రిక్ ఈల్స్, స్క్విడ్‌లు.

"ఎంత లోతులో ఉన్నామో చూడు!" అన్నాను ఏజంట్ ఎక్స్-5 తో.

"230 అడుగులు" బరోమీటర్ చూస్తూ అన్నాడు.

"గుడ్ మరో రెండువందల అడుగుల లోతుదాకా వెళ్ళి వెనక్కి తిరుగుదాము," అంటూ ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేసాను.

"హేయ్...పగడపు గుత్తులు, పగడాలు" అరిచాడు ఏజంట్ ఎక్స్-5. కనుచూపు మేరంతా పగడపు గుత్తులు కన్పిస్తున్నాయ్.

మా ప్రయాణంలో ఇదే మొదటిసారి నేను పగడాలను చూడటం. మేము మొదటి రెండు రోజులు సాగర గర్భంలో తిరిగాము కాని ఎక్కడా ఒక్క పగడపు గుత్తి కూడా కన్పించలేదు.

అన్ని పగడాలు వకేసారి కంటపడేసరికి ఆశ్చర్యంతో నోట మాటరాలేదు నాకు.

'సముద్రంలో ఉన్న బంగారమంతా వెలికి తీయ గలిగితే భూమ్మీద ప్రతీ మనిషికీ 9 పౌనుల బంగారం పంచిపెట్టొచ్చు' అన్న ఎవరో సైంటిస్ట్ మాటలు గుర్తొచ్చాయి.

బాతిస్కోప్ ఆపెయ్యగానే నిశ్చలంగా నీటిలో నిలిచిపోయింది.

చకచకా స్కూబా సూట్ తీసి తొడుక్కున్నాను. ఆక్సిజన్ సిలిండర్ వీపుకు తగిలించుకొని 'యారోగన్', (వాటర్ రైఫిల్) 'సీటార్చి' తీసుకొన్నాను.

వాటర్ ప్రూఫ్ బాగ్ భుజానికి తగిలించుకొని ఏజంట్ ఎక్స్-5కు వీడ్కోలిచ్చి, సీ డోర్ ద్వారా బయట పడ్డాను.

ఒక్కక్షణం జల్లుమంది వళ్ళు. ముందుకు ఈదుకొంటూ వెళ్ళి బాగా పగడాలు ఎక్కువున్న గుత్తుల నల్లా ఏర్ బాగ్ లో వేయసాగాను. అరగంటలో బాగ్ నిండింది.

రకరకాల చేపలు తాపేత్సూ హడావిడిగా తిరుగుతున్నాయ్. వెనుతిరిగి బాతిస్కోప్ వైపు బయలుదేరాను. కాలిక్రింద రాయి గట్టిగా తగిలింది. ఏదో కొండ నేనున్న స్థలంనుంచి ఏటవాలుగా పైకి చొచ్చుకుపోయింది.

ఎగుడు దిగుడుగా ఉన్న ఆ రాళ్ళపై నడుస్తోంటే చాలా వింతగా ఉంది. శూన్యంలో కదులుతున్నట్లుంది.

ప్రక్కనుంచి ఏదో జంతువు ఈదుకొంటూ వెళ్ళింది. దానివైపు చూడగానే గుండె ఆగినంత పనైంది. నలభై అడుగుల పొడవున్న రంపపు చేప అది.

బాతిస్కోప్ సమీపానికి చేరాను. ప్రీవ్యూ మిర్రర్స్ లోంచి చూస్తున్న ఏజంట్ ఎక్స్-5 చెయ్యి ఊపాడు.

నవ్వుతూ ముందుకడుగు వేసి బాధగా అరిచాను. చూసుకోకుండా 'సీ అర్చిన్'పై కాలు వేయటంతో రబ్బర్ షూస్‌ను చీల్చుకొని కసిగా కాలిలో జొర బడ్డాయి ముళ్ళు.

వెనక్కి లాక్కున్నాను కాలు. విషప్రభావం వల్ల నాలో మార్పు ఏర్పడుతోంది. రెండు ముళ్ళు కాలిలో విరిగాయ్.

'సీ అర్చిన్' ముళ్ళలో చిన్న పిల్లల్ని తేలికగా చంప గలిగే శక్తిగల విషం ఉంటుంది. ప్రాణానికి మోసం తప్పినా బాధ తప్పలేదు.

సీ అర్చిన్ ముళ్ళు విచ్చుకొని పైకి లేస్తోంది. ట్రిగ్గర్ లాగాను. 'యారో' అర్చిన్ శరీరాన్ని ఛేదించింది.

నా శరీరంలోంచి బైటకువస్తున్న రక్తం సముద్రపు రంగును మార్చింది. ఆ రంగు క్షణాలలో వేటిని అక్కడకు తీసుకొస్తుందో నాకు తెలుసు. కంగారుగా బాతిస్కోప్ వైపు కదిలాను.

రక్తపు వాసన పసిగట్టిన రెండు పెద్ద వ్హేల్ చేపలు అక్కడకు దూసుకొచ్చాయి.

భయంకరంగా నోరు తెరిచి మెరుపు వేగంతో నాపై దాడిచేశాయి అవి. ఒక వ్హేల్ చేప తన తోకతో కొట్టిన దెబ్బకు స్కూబాసూట్ చిరిగి పీలికలయింది.

గిజగిజలాడి పోయాను బాధతో. రక్తంలో ప్రెషర్ ఎక్కువై ఏ క్షణాన్నైనా శరీరాన్ని చీల్చుకొని బైట కొచ్చేసేలా ఉంది. వ్హేల్ చేప పళ్ళు నా భుజంలో లోతుకు దిగబడ్డాయి.

మరోసారి అవి నన్ను సమీపించేలోగా ఉండలా చుట్టుకుపోయి కొంచెం క్రిందకు జారాను. 'యారో గన్' నిశ్శబ్దంగా మొరిగింది. నాలుగు యారోలు హ్వేల్ చేపల శరీరాలలో దూరాయ్.

షార్క్ చేపల మంద అటువైపు దూసుకొస్తూంది. కదలటానికి ప్రయత్నించాను. కాని రక్తం విపరీతంగా స్రవించి, శక్తి పూర్తిగా క్షీణించి పోటంతో అక్కడి నుంచి కదలలేక పోయాను.

ఇంతలో బాతిస్కోప్ వేగంగా వచ్చి నా ప్రక్కకు చేరింది. సీడోర్ లోంచి ఏజంట్ ఎక్స్-5 నన్ను లోనికి లాగేశాడు.

ఐదు నిముషాలకు గాని తేరుకోలేక పోయాను. రక్త వర్ణపు నీళ్ళలో అర్చిన్, హ్వేల్స్‌ల మృతదేహాల చుట్టూ కుమ్ములాడు కొంటున్నాయి షార్క్స్.

గట్టిగా నిట్టూర్చి ఏజంట్ ఎక్స్-5 వైపు చూశాను. నిశ్చలనంగా ప్రీప్యూ మిర్రర్స్‌లోంచి బైటకు చూస్తు న్నాడు. బాతిస్కోప్ సముద్రోపరితలం వైపు కదులు తోంది.

# 3

రాత్రి పదిగంటలయింది. ఇంజన్ రూం ఫిషర్‌కు అప్ప గించి డెక్ పైకొచ్చాను.

చల్లగా వస్తోంది గాలి. ఆకాశంలో తారకలు మెరుస్తోన్నాయ్. గుడ్‌లక్ ముందు భాగంలో అమర్చ బడిన ఫ్లాష్‌లైట్ చీకటిని పారద్రోలుతూ పరిసరాలను ప్రకాశవంతం చేస్తోంది.

చిన్నగా శబ్దం చేస్తూ వేగంగా ముందుకు పోతోంది బోట్. విశ్రాంతిగా డెక్‌పై పడుకొని ఆలోచనలో

పడ్డాను. రాత్రి ఒంటిగంటయినా నిద్ర రావటం లేదు.

పరిస్థితి అగమ్యగోచరంగా ఉంది. సముద్రం మీద బైలుదేరి అప్పుడే పదిహేను రోజులౌతోంది. ఈ పది హేను రోజులలో దాదాపు అర డజను ప్రమాదాలు ఎదురయ్యాయి. ఇంకా మిగిలిన సమయం పదిహేను రోజులు మాత్రమే.

ఈ పదిహేను రోజుల్లో దాదాపు 2500 నాట్ మైళ్ళు ప్రయాణం జరిగింది. "హైనాన్, హాంకాంగ్, వేవోగ్, తైవాన్, మణిలా"ల మధ్య భాగం క్షుణ్ణంగా పరిశీలించాను.

ఫలితం లేకపోవటంతో ప్రయాణం 'టూరేన్'ల వైపు మార్చుకోవలసి వచ్చింది.

నా అనుమానం 'నాట్రాంగ్, నటూనా ద్వీపమంజరి' మధ్యనున్న దీవులపై దృఢంగా నిల్చింది. అన్ని విధాల ఆటమిక్ ఆపరేషన్‌కు ఆ దీవులే ఉపయో గిస్తాయ్. కాని మిగిలిన పది రోజులలో ఆ దీవిని తెల్సుకోగలనా అనే సందేహం బాధిస్తోంది.

సీ అర్చిన్, హ్వేల్ చేపలు చేసిన గాయాలు చాలా వరకూ మానాయ్. అప్పటివరకూ ప్రయాణంలో ఎదు రైన క్రూర సముద్ర జంతువులను తల్చుకొంటే అసహ్యం పుడుతోంది.

"డర్టి సీ...___" కసిగా తిట్టుకొన్నాను.

"బాస్..." అరిచాడు ఇంజన్ రూంలోంచి ఫిషర్. ఆ అరుపులోని ప్రమాదం పసిగట్టిన నా గుండెలు వేగంగా స్పందించాయ్.

లేచి నిలబడ్డాను. ప్రమాదం అర్థమైంది,

రెండు ఫర్లాంగుల దూరంలో సముద్రంలో పెద్ద పెద్ద కెరటాలు పైకి లేస్తోన్నాయ్. నీళ్లు వెల్లుతున్నాయ్ పైకీ క్రిందకూ.

సముద్రం పొంగుతున్నదేమో అనుకున్నాను కాని నా ఊహకు విరుద్ధంగా ఏదో ఆకారం ఎగిరెగిరి పడుతున్న కెరటాల మధ్యనుంచి లేస్తోంది.

ఆ జంతువేమిటో గుర్తుపట్టాను. 'ఆక్టోపస్'. 'పార్పాయిస్' మీద రెట్టింపు ఉంది. ఏనుగు తొండాల్లాంటి పాదాలు అనేక వందలున్నాయ్.

ఆక్టోపస్ శరీరంనుంచి రెండు నీటి ధారలు ఆకాశం లోకి మంచి ఎత్తున లేచాయ్. నీటిలో మునుగుతూ తేలుతూ ఎగురుతోందా జంతువు.

'గేజిర్' అన్నాను అప్రయత్నంగా ఆ నీటి ధారను చూస్తూ. ఐస్ లాండ్‌లో 'హెక్లా' పర్వతం దగ్గర ఎదురైన 'గేజిర్' గుర్తొచ్చి. అయిస్‌లాండిక్‌లో గేజిర్‌కు అర్థం 'జలప్రపాతం.'

గుడ్‌లక్ దిశమార్చి పోనిస్తున్నాడు ఫిషర్. ఆక్టోపస్ వెంటబడింది.

ఈ సముద్రంలో 'పార్పాయిస్' లంతటి 'ఆక్టోపస్'లు ఎదురౌతాయని కల్లోకూడా ఊహించలేదు.

క్రిందకు పరిగెత్తాను. ఏజంట్ ఎక్స్-5 వణికిపోతూ కాబిన్‌లో అటూ ఇటూ తిరుగుతున్నాడు. ఫిషర్ పరిస్థితి ఊహించుకోగలను.

"విండోస్ లాక్ చెయ్యి వేగంగా," అరుస్తూ వెపన్స్ వైపు పరుగెత్తాను. చకచకా బీరువా తెరిచి 'ఫైర్ గన్', సిలిండర్స్ తీసుకొని భుజానికి తగిలించుకొంటుండగా చావు కేక వేసాడు ఏజంట్ ఎక్స్-5.

అదిరిపోతూ చూసాను. ఆక్టోపాస్ తోకల్లో ఒకటి కిటికీలోంచి లోనికి ప్రవేశించి ప్రక్క విండో లాక్ చేస్తున్న ఏజంట్ ఎక్స్-5 శరీరాన్ని చుట్టుకొంది.

గింజుకొంటున్నాడు ఎక్స్-5. పొడుగైన రంపం లాంటి వెపన్ అందుకొని అతని దగ్గరకు పరిగెత్తాను.

కిటికీలోంచి బైటకు లాగుతోంది ఆక్టోపస్. రంపంతో దాని పాదాన్ని క్షణాలలో తెగగొట్టాను.

మొండెం విండోలోంచి బైటకు పారిపోయింది. ఎక్స్-5 ను చుట్టుకొన్న తోక నేల మీద బల్లితోకలా మెలికలు తిరుగుతూ కొట్టుకొంటోంది.

మరో విండోలోంచి లోనికి ప్రవేశించాయి రెండు తోకలు.

ఫైర్ గన్ ఆన్ చేసాను, 'జుయ్' మంటూ దూసు కెళ్ళి వాటిని తాకింది ఫ్లేర్. మెలికలు తిరిగి ముడుచు కొంటూ బైటకు పారిపోయాయ్.

ఏజంట్ ఎక్స్-5 వైపు తిరిగాను.

"ఆయిల్ డ్రమ్స్ ఎక్కడున్నాయ్?" అడిగాను.

"కాబిన్ క్రింద." చెప్పాడు ఎక్స్-5.

గన్ అతనికి ఇచ్చాను. జాగ్రత్తగా కవర్ చేస్తూండు అంటూ కాబిన్ చివరికి నడిచాను. నేలపై ఉన్న కార్పెట్ ఎత్తి చెక్కలు ప్రక్కకి జరపగానే ఇనుప నిచ్చన కన్పిం చింది. దిగాను.

పొడుగ్గా పడవ ఆ చివరి నుంచీ ఈ చివరి వరకూ నడ వాలా ఉందా గది. చిన్న చిన్న లైట్లు డిమ్‌గా వెలుగు తున్నాయ్. నాలుగైదు ఆయిల్ డ్రమ్ములు రెండు లైఫ్ బోట్లు అరడజను ట్యూబులు వక ప్రక్కగా ఉన్నాయ్.

ఒక డ్రమ్ ఓపెన్ చేసి క్రింద పడిఉన్న పెట్రోల్ డబ్బాలలో ఒక దాని నిండుగా పట్టాను. ఇంజన్ రూం లోంచి మెషిన్‌గన్ గొలుసులా ప్రేలుతోంది.

పైకొచ్చాను. లోపలికొస్తూన్న ఆక్టోపస్ పాదాలను కాల్చడంలో నిమగ్నుడై ఉన్నాడు ఏజంట్ ఎక్స్-5.

ఒక కిటికీ దగ్గరకు పరిగెత్తి ఆయిల్ సముద్రంలో వంచాను. బోటు ప్రక్కనే నీటిపై చారలా వలుకుతోంది ఆయిల్. ప్రక్కకు వచ్చాడు ఎక్స్-5.

'ఫ్లేర్' వెళ్ళి పెట్రోల్ డబ్బాను తాకింది. 'ఢాం' అంటూ ప్రేలుతూ ఆయిల్ అంటుకొంది చరచరా పొడుగునా.

తృప్తిగా నిట్టూర్చాను. 'ఫ్లేర్' చూసి భయపడని సముద్ర జంతువేదీ లేదు.

ఇంజన్ రూంలోంచి చావుకేక పెట్టాడు ఫిషర్. మెషిన్‌గన్ మ్రోగటం ఆగిపోయింది.

లోనికి పరుగుతీసాం ఇద్దరం. గది నిండా తెగి ముక్కలు ముక్కలుగా పడిఉన్న ఆక్టోపస్ తోకలు గిలగిల లాడుతోన్నాయ్.

విండో వైపు చూసి అదిరిపోయాను. సుమారు అర డజను తోకలు ఫిషర్ శరీరం కన్పించకుండా చుట్టేసి బైటకు లాగుతోన్నాయ్.

స్పృహలో లేడు అతను. బైటకెళ్ళి పోయింది. ముందుకి కదలబోయాను. కాని చూస్తూండగానే బైటకెళ్ళి పోయాయి ఆక్టోపస్ తోకలు.

నిశ్చేష్టుడనై పోయాను. ఆక్టోపస్ ఫిషర్‌ని చిక్కించుకొని దూరంగా ఈదుకొంటూ పోతోంది.

అప్రయత్నంగా నా కళ్ళవెంట జల జలా నీళ్ళు రాలాయ్.

గట్టిగా నిట్టూర్చి డ్రైవింగ్ సీట్లోకి కదిలాను.

## 4

వాచీలో డేట్ ఏడుసార్లు మారింది. 'గుడ్ లక్' నటూనా ద్వీప మంజరి వైపు ప్రయాణిస్తోంది.

'గోల్డెన్ జోక్' విస్కీ సిప్ చేస్తూ దిక్సూచీ వైపు చూడసాగాను. వరల్డ్ మేప్ టేబిల్ పై పరచి ఉంది.

దిక్సూచీ ముళ్ళు దక్షిణం వైపు సూచిస్తోంది. చకచకా లెక్కలు కట్టాను. 'నాట్రూంగ్'కు నాలుగు వందల మైళ్ళ దూరంలో దక్షిణంగా 'నటూనా' వైపు ఉన్నాము.

నూట ఎనభై మైళ్ళ దూరంలో ఉంది ద్వీపమంజరి.

రెడ్ పెన్సిల్ తీసుకొని వరల్డ్ మాప్ పై నటూనా చుట్టూ సర్కిల్ గీసాను. మొత్తం పదమూడు ద్వీపాలు గుర్తింపులో కొచ్చాయ్. బోట్ ప్రయాణం చేస్తోన్న రూట్ కూడా 'యారోస్' రూపంలో గుర్తించాను.

అకస్మాత్తుగా ద్వీపమంజరికి కొంచెం ఎడంగా విసిరేసి నట్లున్న ఒక ద్వీపంపై నా దృష్టి నిల్చింది. చాలా చిన్న దీవి అది. ద్వీపమంజరికి ఎడంగా విశిరేసినట్లుండి కేవలం చుక్కలా మాత్రం గుర్తింప బడిందంటే బహుశా అందులో జనసంచారం ఉండి ఉండదు.

నా అనుమానం ఆ దీవి వైపు మళ్లింది. అవును! ఆ దీవే ఎందుకు కాకూడదు? అన్ని విధాలా అనుకూలంగా ఉన్న దీవి అది.

అటమిక్ అపరేషన్ సాగించటానికి దానికంటే అనువైన మరో దీవి పరిసరాలలో లేదు.

మరో విషయం గుర్తొచ్చింది నాకు. చైనీస్ నావల్ వార్‌షిప్స్ హాంకాంగ్ నుంచి బోర్నియోదాకా మొదట్లో సంచరించేవన్న విషయం మర్చిపోలేను ఎప్పటికీ.

అంటే ఈ విధంగా మధ్యలో నటూనా ద్వీపమంజరిని కవర్ చేసే ఉద్దేశ్యం అయి ఉండాలి.

లేచి ఇంజన్ రూంలోకి వెళ్ళాను. ఏజంట్ ఎక్స్-5 ప్రశ్నార్థకంగా చూసాడు.

"ఎంత స్పీడుతో వెళ్తోంది?" అడిగాను.

"టిన్ నాట్స్!"

"చాలదు, వేగం పెంచు సాయంత్రానికి నటూనా సమీపానికి చేరుకోవాలి." అంటూ బైనాక్యులర్స్ అందుకొన్నాను.

గుడ్ లక్ వేగాన్ని పుంజుకొంది.

డెక్ పైకి నడిచాను. చుట్టూ నీలి సముద్రం కనుచూపు మేరంతా కన్పిస్తోంది. ఆకాశంలో సూర్యుడు మండుతున్నా సముద్ర గాలులు చల్లదనానికి వేడి అన్పించటం లేదు.

సెట్ పై కూర్చొన్నాను. డెక్ అంచుచుట్టూ కవర్ చేస్తున్న ఇనుప ఊచలకు ఆనుకొని 'ఒమేగామాన్' బుక్ తెరిచాను.

పావుగంట గడిచింది.

ఏదో శబ్దాన్ని నా చెవులు పసిగట్టటంతో తలెత్తి చూసి ఉలిక్కిపడ్డాను. ఏదో ప్లేన్ హాంకాంగ్ వైపు నుంచి వస్తోంది.

పాసింజర్ ప్లేనేమో అనుకొన్నాను. కాని మరుక్షణం నా ఊహ తప్పని తేలింది. మామూలుగా ట్రావెలింగ్‌కు ఉపయోగించే ప్లేన్ కాదు అది. వార్‌లో ఉపయోగించే శాబర్ జెట్. అదెందుకు మా వైపు వస్తోందో అర్థమైంది.

క్రిందకు పరిగెత్తాను. ఏజంట్ ఎక్స్-5 కు అంతా రెండు ముక్కల్లో చెప్పాను.

అల్మైరా తెరిచి కావలసిన ఆర్మ్స్ తీసుకొని తిరిగి డెక్ పైకి వెళ్ళాను. ఫిషర్ లేని లోటు తెలుస్తోంది స్పష్టంగా.

రెండు లాబింగ్ పాడ్లు డెక్ పై అరేంజ్ చేసాను. రాకెట్స్ వాటిపై అమర్చి మెషిన్ గన్ నిండుగా అమ్యూనిషన్ నింపాను. టెలిస్కోప్ అమర్చి లాబింగ్ పాడ్ ల ప్రక్కనే బోర్లా పడుకొన్నాను. నెట్ నన్ను పైకి కన్పించకుండా కప్పలేకోంది.

శాబర్ జెట్ పెద్ద మోతతో నడినెత్తి పైకొచ్చింది. టెలిస్కోప్ లోంచి వేగంగా కదులుతున్న ప్లేన్ పై చైనీస్ ఎయిర్ ఫోర్స్ అక్షరాలు అస్పష్టంగా కన్పించాయ్.

ప్లేన్ లోంచి మొదటి బాంబు క్రిందకి ఉరికింది. ఒక్కసారిగా 'గుడ్ లక్' వేగం హెచ్చటంతో కొద్దిలో తప్పి నీటిని తాకింది.

చెవులు చిల్లులు పడేంత శబ్దం అయింది.

ముందుకు దూసుకు పోయిన 'శాబర్ జెట్' వెనక్కి తిరిగి బోట్ వైపు బయలుదేరింది.

నా గుండెలు దడదడ లాడాయ్.

బహుశా ఏజంట్ ఎక్స్-5 ఎంతో సేపు ప్లేన్ బారి నుంచి బోట్ ను కాపాడలేడనిపించింది. ఎంత త్వరగా ప్లేన్ ను నాశనం చేస్తే అంత మంచిది.

సమయం గడిచే కొద్దీ ఏజంట్ ఎక్స్-5 లో ఆత్మ విశ్వాసం నశించి బోట్ నడపడంలో తడబడవచ్చు.

ఏమాత్రం తప్పటడుగు వేసినా బోటుతో కలిసి నామ రూపాలు లేకుండా పోతాము. శాబర్ జెట్ మళ్ళీబాంబు

వదిలింది. దేవుడిపై భారం వేసి ట్రిగ్గర్ నొక్కాను. గోలు సులా వెళ్ళాయ్ బులెట్స్ కాని గురి తప్పి ఆకాశంలోకి దూసుకొని పోయాయి.

బాంబు బోటును తాకుతుందనగా అడ్డంగా కోసాడు ఏజంట్ ఎక్స్-5. జర్క్ ఇచ్చి ప్రక్కకు దూకింది గుడ్ లక్.

బోట్ ప్రక్కనే పడింది బాంబ్. నీటిపై మెరుపు మెరిసింది. నెట్ కొసలు చెవుల్లో కుక్కుకొన్నాను. నీరు పెద్ద కెరటంలా లేచి డెక్ నంతా తడిపింది.

వెనుతిరిగింది శాబర్ జట్. ఒక్కక్షణం ఆలోచించాను. మెషన్ గన్ తో శాబర్ జెట్ ను ఎదుర్కోలేనని పించింది.

చకచకా పది డిగ్రీల తేడాతో లాబింగ్ పాడ్స్ బిగించాను. ఒకటి 90 డిగ్రీల కోణంలో నిట్టనిలువుగా ఉంది. దానికి పది డిగ్రీలు తేడాలో మరొకటి.

శాబర్ జెట్ గుడ్ లక్ ను సమీపించింది. సరిగా బోటు మధ్యకు రావటానికి కొద్ది డిగ్రీల తేడాలో ఉండగా రాకెట్ ను వదిలాను. వెంటనే మరొకటి.

శాబర్ జెట్ క్షణంలో ఎంత వేగంతో ప్రయాణిస్తుందో నాకు తెల్సు. లాబింగ్ వీల్ త్రిప్పాక టార్జెట్ ను రాకెట్ తాకడానికి కొద్ది టైము కావాలి.

ఆ సమయంలో కొద్ది డిగ్రీల తేడాలో ఉన్న ప్లేన్ బోట్ మధ్యకొస్తుంది. ఇదీ నా ఉద్దేశ్యం.

రాకెట్స్ వదలగానే గన్ ఫైర్ చేసాను. మొదటి రాకెట్ మిస్ అయింది.

వార్ ప్లేన్ లోంచి బైటకొచ్చిన గ్రెనేడ్ ను పది డిగ్రీల తేడాలో రెండోసారి కాల్చిన 'మిసైల్' వెళ్ళి

తాకింది.

ఆకాశంలో ప్రేలాయి రెండూ. అంతలోనే అను కోని సంఘటన జరిగిపోయింది. రాకెట్స్ పై ఆశలు పెట్టుకొని మిషన్ గన్‌ను గుడ్డిగా కాల్చినా అదృష్ట వశాత్తు వెళ్ళి బోట్‌ను దాటుతోన్న వార్ ప్లేన్ లెఫ్ట్ వింగ్‌ను తాకింది.

టప్ మంటూ ప్రేలి లెఫ్ట్ వింగ్ అంటుకొంది.

ఈసారి శాబర్ జెట్‌ను స్మాష్ చేయడం అంత కష్టం కాలేదు.

మెషిన్ గన్ వదిలేసి లాంచింగ్ పాడ్లపై 'మిసైల్స్' బిగించి ఆకాశంలో మండుతూ వెనక్కి తిరుగుతున్న ప్లేన్ వైపు చూడసాగాను.

హాంకాంగ్ వైపు తిరిగింది ప్లేన్. వ్యూలోకి వచ్చేదాకా ఊర్కొని రాకెట్స్ ఫైర్ చేశాను.

ఉత్తరంగా 135 డిగ్రీల కోణంలో రెండూ ఎర్రగా మండుతూ వెళ్ళాయ్.

అర నిముషం తరువాత ఆకాశంలో టపాకాయలా ప్రేలింది శాబర్ జెట్.

గట్టిగా ఊపిరి పీల్చాను. పరిగెత్తుకొంటూ డెక్‌పై కొచ్చాడు ఏజంట్ ఎక్స్-5.

నవ్వుతూ అతనివైపు చూసాను. "విజయ్...యూ ఆర్ ఏ జీనియస్ ఇన్ ఆవర్ స్పైస్!" నా చెయ్యి ఊపేస్తూ అరిచాడు.

ఇద్దరం క్రిందకి వెళ్ళాం. కాబిన్ చేరుకోగానే ఏజంట్ ఎక్స్-5కు గుడ్‌బై కొట్టి బెడ్‌పై పడ్డాను.

రాత్రంతా నిద్రలేక పోవటంతో కళ్ళు వెంటనే మూతలు పడ్డాయ్.

5

ఏజంట్ ఎక్స్-5 లేపడంతో మెలకువవచ్చి కళ్ళు తెరిచాను. లేచి కూర్చొని సిగరెట్ అందుకొంటూ వాచి చూసుకున్నాను. సాయంత్రం ఐదయింది.

"నటూనా చేరుకొన్నామా?" అడిగాను.

"ఇంకా లేదు" అన్నాడు ఎక్స్-5. అతని కంఠంలో కలవరాన్ని పసిగట్టాను.

"వాట్ హేపెండ్?" అడిగాను అతని ముఖంలోకి చూస్తూ.

"బయట క్షేమేమీ బాగోలేదు. సైక్లోన్ వచ్చే సూచనలు కన్పిస్తున్నాయ్." ఒణుకుతున్న కంఠంతో అన్నాడు.

తృళ్ళి పడ్డాను. కంగారుగా విండో దగ్గరకు పరిగెత్తి ఆకాశంలోకి చూశాను. ఎక్కడా సూర్య కాంతిని కన్పించనివ్వకుండా నల్లటి కారుమేఘాలు కప్పేసి ఉన్నాయ్ ఆకాశాన్ని.

గాలి స్తంభించిపోయింది. భయంకరమైన నిశ్శబ్దం ఆవరించుకొని ఉంది. "మైగాడ్, నువ్వన్నది నిజమే!" అరిచాను. మాట్లాడలేదు ఏజంట్ ఎక్స్-5.

మళ్ళీ నేనే అడిగాను.

"నటూనాకు ఎంత దూరంలో ఉన్నాం?"

మనస్సులోనే లెక్కలు వేసుకొని చెప్పాడు.

"సుమారు అరవై నాట్స్."

"ఐ.సీ." ఆలోచిస్తూ అన్నాను. "అప్పటి వరకూ సైక్లోన్ ఆగదు. సామాన్లు సర్దేయ్. అవసరమైతే బాతిస్కోప్‌లో తప్పించుకొందాం."

"ఓ. కె. బాస్."

ఇంజన్ రూంలోకి వెళ్ళాను. దిక్సూచీలో ముల్లు దక్షిణంగా చూపిస్తోంది. ఇంజన్ ముందు కూర్చొని మాగ్జిమమ్ స్పీడ్‌కు ఫిట్ చేసాను.

అంతకు ముందు స్మాష్ చేసిన వార్ ప్లేన్ గుర్తొచ్చింది. దాన్ని స్మాష్ చేసిన తర్వాత మరికొన్ని మాపై దాడి చెయ్యకపోవటానికి కారణం అర్ధమయింది.

సైక్లోన్ నాకు రెండు విధాలుగా ఉపయోగించింది. ముందే రాడార్స్ ద్వారా స్టారమ్‌ను తెలుసుకొన్న చైనీస్ మాపై బాంబర్ జెట్‌లను పంపిణీ చెయ్యలేదు. మరొకటి మావద్ద బాతిస్కోప్ వున్న విషయం వాళ్ళకు తెల్సి వుండదు.

తుఫాన్‌లో చస్తామను కొంటారేగాని బాతిస్కోప్ ద్వారా తప్పించుకొంటామనుకోరు.

ఆలోచిస్తున్నాను. సముద్రంపై గాలి బయలుదేరింది.

పెద్ద పెద్ద అలలు లేస్తోన్నాయ్. రాను రాను గాలి తీవ్రత ఎక్కువైపోతోంది. ఆకాశంలో గాంఢాంధకారం ఏర్పడింది. దాన్ని చీల్చుకొంటూ భయంకరమయిన మెరుపులు.

వంటినిండా చెమటలు పట్టాయి. జీవితంలో మొదటి సారిగా స్టార్మ్‌లో ఇరుక్కోవటం అదే.

గుడ్‌లక్ కెరటాలపై ఎగిరెగిరి పడుతోంది. పరిస్థితి చెయ్యి దాటిపోతోంది.

గబగబా కేబిన్‌లోకి వెళ్ళాను. సామానంతా బాతిస్కోప్‌లోకి సర్దేశాడు కాబోలు మెషిన్‌గన్‌లో అమ్యూనిషన్ నింపుతున్నాడు ఎక్స్-ఎ.

నా చూపులు అప్రయత్నంగా అతని పాదాలవైపు పరిగెత్తాయ్.

అదిరిపడ్డాను.

ఎలా వచ్చిందో, ఎప్పుడొచ్చిందో తెలియదు కాని హెల్ స్నేక్ అతని వెనక్కి వుండి కాటు వెయ్యడానికి సిద్ధంగా వుంది.

మూడడుగుల పొడవు వెదురుగడంతలావు ఉండి శరీర మంతా ఇంద్రధనస్సులా మెరుస్తోంది. శరీరానికి మూడు రెట్లు వుంది తల. చిన్న కళ్ళు, చీపురు పుల్లలాంటి నాలుక కదులుతున్నాయ్.

సముద్రపు పాముల్లో కెలా ప్రమాదకరమైన 'హెల్ స్నేక్' కరిస్తే మనిషి వెంటనే చావడు. ఇరవై నాలుగు గంటలు నరకయాతన అనుభవించి మరీ చస్తాడు.

ప్రతీకణం కరెంట్ షాక్ కొట్టినట్లో లేక కమ్చీలతో మోదినట్లో ఉలికి ఉలికిపడుతూ భరించలేని బాధతో ముడుచుకుపోతాడు.

దాని కాటుకు విరుగుడు ఏ డాక్టరు కనిపెట్టలేక పోయాడు యిప్పటిదాకా.

తక్షణం రివాల్వర్ అందుకొని దాని తలకు గురిపెట్టి కాల్చాను.

కాని ఆలశ్యమైంది.

హెల్ స్నేక్ తల విసురుగా వెళ్ళి ఏజంట్ ఎక్స్-5 కాలుని ముద్దాడింది. ఆ మరుక్షణం బుల్లెట్ దాని తలను బ్రద్దలు చేసింది.

బాధగా అరిచాడు ఏజంట్ ఎక్స్-5. కంగారుగా అతని దగ్గరకు పరిగెత్తాను. కాలు పట్టుకొని లుంగచుట్టుకు పోతున్నాడు.

విషం వేగంగా అతని రక్తంలో కల్సిపోయింది. చావు కళ స్పష్టంగా కన్పిస్తోంది.

"విజయ్...విజయ్..." గొణుగుతున్నాడు. జాలిగా చూసాను.

"విజయ్ ...ప్లీజ్ కిల్ మి" అరిచాడు.

"నో!" దృఢంగా అన్నాను. "సాటి ఏజంట్‌ను నా చేత్తో చంపలేను."

"షటప్...ఈ బాధ భరించలేను...ప్లీజ్ కిల్ మీ..."

మాట్లాడలేదు నేను. అతని బాధ ఊహించుకోగలను. కాని స్నేహితుడనే మమకారం నన్ను చంపనీయటం లేదు.

"విజయ్..." అతని నోట్లోంచి నురగలొస్తున్నాయ్. తడబడుతున్నాయ్ మాటలు.

"విజయ్...ఎలాగూ కొంచెం సేపటిలో చావాలి నేను. దయచేసి ముందే చంపేసి నన్ని నరకంనుంచి తప్పించు... ప్లీజ్..." పాములా ముడుచుకు పోతున్నాడు.

బాధగా చూసాను. హెల్ స్నేక్‌ను కాల్చిన రివాల్వర్‌తో అతనిని కాల్చటం ఇష్టంలేక షాట్‌గన్ అందుకొన్నాను.

కళ్ళు మూసుకొని ట్రిగ్గర్ నొక్కాగానే కనురెప్పల చాటునుంచి నీళ్లు రాలాయి అతని మృతశరీరంపై.

షాట్‌గన్ అతనిపై పడేసి బాతిస్కోప్ తీసుకొని బయటకు దూకాను.

వాతావరణం భీభత్సంగా వుంది. కుంభవృష్టి కురుస్తోంది. కెరటాలతో కల్సి కొట్టుకుపోతోంది గుడ్‌లక్.

బాతిస్కోప్‌లో కూర్చొని తలుపేసుకొంటుండగా చూసాను విరుచుకు పడుతున్న కెరటాన్ని. సుమారు నూటేభై అడుగుల ఎత్తుండి ఆకాశాన్ని అంటుతోంది.

మరోక్షణం ఆలస్యమై వుంటే ఏమయ్యేదో తలుచుకో గానే నా గుండె జలదరించింది.

బాతిస్కోప్ నీటి అడుగున దూసుకుపోయింది.

డిక్షనరీ పరికించటంలో మునిగిపోయాను.

ఎక్కడున్నానో తెలీకపోయినా ప్రయాణం మాత్రం నటూనా వైపు సాగుతోందని అర్థమైంది.

# 6

దాదాపు నటూనా పరిసరాలకు చేరుకొంది బాతిస్కోప్. ఇంకో పదిమైళ్ళుంటుంది నటూనా. ఫ్యూయల్ టాంక్ చూచాను. మరో నాలుగైదు మైళ్ళ కంటే ఎక్కువ రాదు.

ఏం చెయ్యాలో తోచక నిశ్చలంగా రాడార్ స్క్రీన్ పై చూస్తూ నడపసాగాను.

రకరకాల చేపలు అటూ ఇటూ కదులుతూ స్క్రీన్ పై కన్పిస్తున్నాయ్.

మరో వంద అడుగుల దూరం వెళ్ళగానే స్క్రీన్ పై అకస్మాత్తుగా కన్పించిన ఆకారం చూసి ఉలిక్కిపడ్డాను. మరుక్షణం నా ముఖంలో ఆనందం కదులాడింది.

జాగ్రత్తగా చూడసాగాను. అరగంట తర్వాత మళ్ళీ కన్పించిందా సబ్ మెరైన్. పెద్ద సైజు షార్క్ చేపలా వుంది.

ఆపరేషన్ ఐలెండ్ చుట్టూ తిరుగుతూ అరగంట కో సారి కన్పిస్తోంది. దాని వేగం ఎంత లేదన్నా 12 మైళ్ళు తక్కువ ఉండదు.

అంటే గంటకు 12 మైళ్ళ వేగంతో ప్రయాణిస్తోన్న

పడుతోందన్న మాట. దీని చుట్టుకొలత 6 మైళ్ళని తేలింది.

మీటర్ పై చూసాను జలాంతర్గామికీ బాతిస్కోప్ కు మధ్య దూరం ఎంతో తెల్సుకోడానికి.

రెండు మైళ్ళు. ముందుకు పోనిచ్చాను బాతిస్కోప్.

ఒక మైలు దూరం వెళ్ళాక ఫైరింగ్ సెక్షన్ ఆర్డర్ లోకి తీసుకొచ్చాను. బాతిస్కోప్ చుట్టూ రంధ్రాలున్నాయ్. నిజానికవి రంధ్రాలు కావు. ఎనిమీని ఏటాక్ చేసే ఫైరింగ్ గొట్టాలు.

స్విమ్మింగ్ డ్రెస్ వేసుకొని ఆక్సిజన్ సిలిండర్స్ అమర్చుకొని మెషిన్ గన్, యారో గన్ లను భుజాలకు తగిలించుకొన్నాను. చేతిలో సీ టార్చి ఉంది.

రెండు నిముషాలలో తిరిగి రాడార్ స్క్రీన్ పైకొచ్చింది సబ్ మెరైన్. దగ్గరగా చేరుకొంటోంది బాతిస్కోప్.

దీనికి అటువైపు ప్రయాణిస్తోన్న జలాంతర్గామి చటుక్కున బాతిస్కోప్ వైపు తిరిగింది.

ఫైరింగ్ స్విచ్ నొక్కి ప్రక్కనే ఉన్న సీడోర్ తెర్చుకొని నీటిలోకి జారిపోయాను. గిరగిరా తిరుగుతూ ప్రేలింది బాతిస్కోప్. ఫైరింగ్ గొట్టాల్లోంచి తోసుకెళ్ళి సబ్ మెరైన్ని తాకాయి ఫైర్ బాల్స్.

సీమ టపాకాయలా ప్రేలుతోండగా జలాంతర్గామిలోంచి వెలువడ్డ ఫైరింగ్ కు బాతిస్కోప్ తునాతునకలయింది.

యారోగన్ పొజిషన్ లోకి తెచ్చుకొని టార్చి కాంతిలో ఐలెండ్ వైపు ఈదసాగాను.

అరగంటలో దీవిని సూచిస్తూ పెద్ద పెద్ద రాళ్ళ గుట్టలు ఎదురయ్యాయి. నెమ్మదిగా నీటి ఉపరితలంవైపు వెళ్ళాను.

అరఫర్లాంగ్ దూరంలో కన్పించింది ఐలెండ్. తీరం పొడుగునా పామ్ చెట్లు ఎదిగున్నయ్. వాటివెనక చిన్న సైజు కొండలు.

తృప్తిగా నిట్టూర్చాను ఐలండ్ వెనక్కి చేరి నందుకు.

ఒడ్డు చేరుకోగానే స్విమ్మింగ్ డ్రెస్ విప్పి, ఆక్సిజన్ సిలిండర్, యారోగన్‌లతో కలిపి పామ్ చెట్టు మొదట్లో కప్పెట్టి ముందుకు కదిలాను.

సుమారు నాలుగువందల అడుగుల ఎత్తుంది నేనెక్కిన కొండ. గంట పట్టింది పైకి చేరుకోడానికి.

రాయిచాటున కూర్చొని బైనాక్యులర్స్‌తో చూసాను.

సూర్యుడు అస్తమిస్తున్నాడు. మసక కాంతిలో చెట్లక్రిందుగా పెద్ద పెద్ద బిల్డింగ్‌లు కన్పిస్తున్నాయ్. అవతలివైపున కూడా తీరం పొడుగునా ఇలాగే కొండ లున్నాయ్.

ఎవరైనా దానిపై అడుగుపెట్టినా పొరపాటున కూడా ఇలా కొండల మధ్య అణ్వాస్త్రాలు తయారు చెయ్యబడు తున్నాయని ఊహించరు.

ఒకచోట వరుసగా చిన్న సైజు రాకెట్స్ మూడు నిలబెట్టబడి ఉన్నాయ్.

అణ్వాస్త్రాలను వాటిలో అమరుస్తున్నారు కాబోలు వాటి చుట్టూ తిరుగుతున్నారు శాస్త్రజ్ఞులు.

ట్రాన్స్‌మీటర్ బైటకు తీసాను. బటన్ నొక్కి "విజయ్ స్పీకింగ్" అన్నాను.

"యస్ రమేష్ మిశ్రా!" అవతలివైపునుంచి బాస్ కంఠం ఆప్యాయంగా పలికింది.

"బాస్... నేను అటమిక్ ఐలెండ్ కనుకొన్నాను..." చిన్నగా అరిచాను.

"వెల్ మై బాయ్...ప్రొసీడ్..." ఆతృతగా అంటున్నారు బాస్.

ఎక్కడుందో చెప్పాను.

మరో రెండు నిముషాలు ఆయనతో మాట్లాడి ముందుకి కదలబోయాను.

మెడపై చల్లగా గన్‌బారల్ తగిలింది. కొయ్యబారి పోయాను.

## 7

"హూ ఆర్ యూ?" కర్కశంగా విన్పించింది.

"టూరిస్ట్!" అన్నాను పెదాలతో నాలిక తడుపు కొంటూ.

"ఎలా వచ్చా విక్కడికి?"

"తుఫాన్‌లో తప్పించుకొని కొట్టుకొచ్చాను." అన్నాను. కాని వాడు ట్రాన్స్‌మిటర్ చూసాడేమో నని భయంగా ఉంది.

ఊహించనంత వేగంతో నా భుజం పట్టుకొని వెనక్కి త్రిప్పి ఈడ్చి దవడపై కొట్టాడు. కళ్ళు బైర్లు కమ్మాయి.

తేరుకొని అతనివైపు పరీక్షగా చూసాను. ఆఫీసర్ డ్రెస్‌లో ఉన్నాడు.

సాధారణంగా చైనీస్ పొడుగుండరు. కాని వీడు మాత్రం చాలా పొడుగ్గా దాదాపు నా ఎత్తులో ఉన్నాడు.

"ఇడియట్ నువ్వు ట్రాన్స్‌మీటర్‌లో మాట్లాడటం నేను చూడలేదనుకొన్నావా? నువ్ స్పైవి! అవునా?" అరిచాడు.

మౌనంగా ఉండిపోయాను. తిరిగి వాడే అన్నాడు.

"నువ్వు ఎవరివైనా నీకు చావు తప్పదు. ఈ ఐలెండ్ లోనికి అనుమతి లేకుండా ఎవరు ప్రవేశించినా కాల్చేయమని మాకు ఆర్డర్స్ ఉన్నాయ్."

మిషిన్ గన్ విలాసంగా ఊపుతున్నాడు. ఏ మాత్రం తొందరపడినా ఒళ్ళంతా తూట్లు చేస్తాడు.

క్రిందకి చూసాను. సరిగా నా కాలు ప్రక్కనే చిన్న రాయి ఉంది. తప్పించుకోడానికి కా అవకాశం చాలు.

గన్ ఊపడం ఆపేశాడు. దాని చుట్టూ ఊపిరి బిగబెట్టి కాలు ముందుకి జరిపాను.

"యూ డర్టీ స్పై, మా ఆపరేషన్‌ను స్మాష్ చెయ్యడానికి వచ్చినందుకు ప్రతిఫలం అనుభవించు." అరుస్తూ ఫైర్ చేసాడు. రాతిని కాలితో తన్నేస్తూ ప్రక్కకి పల్టీ కొట్టాను.

బులెట్స్ రాళ్ళను తొల్చేశాయ్. రాయి కాలికి బలంగా తగలటంతో 'కీర్'మంటూ కూలబడ్డాడు చైనీస్ ఆఫీసర్.

వాడిపైకి దూకి ముఖంపై గుద్దాను. ఆర్తనాదం చేసాడు.

విజృంభించాను. అర నిముషంలో స్పృహ తప్పించి బటలు మార్చుకొన్నాను. నావి వాడికి తొడిగాను.

హాట్‌ని ముందుకు లాక్కొని మిషిన్ గన్ భుజానికి తగిలించుకొని క్రిందకి దిగసాగాను.

దిగే కొద్దీ స్పష్టంగా కన్పిస్తోన్నాయ్ బిల్డింగ్స్. వాటి మధ్యనున్న ఎత్తైన బిల్డింగ్ నన్నాకర్షించింది. 'ఆపరేషన్ నటూనా' అక్షరాలు దాని గోడపై అందంగా పేర్చబడ్డాయి.

బాగా చీకటి పడింది. బిల్డింగ్స్‌లో లైట్లు వెలిగాయ్. అండర్‌గ్రౌండ్‌లో మిషన్స్ చేస్తున్న ధ్వనికి కాబోలు భూమి అదురుతోంది.

సోల్జర్స్ చెట్ల క్రింద తిరుగుతున్నారు. హాట్‌ను పూర్తిగా ముఖంపై లాక్కొన్నాను. మెడచుట్టూ ఉన్న మఫ్లర్ గడ్డాన్నికూడా కప్పుతోంది.

"ఆగు! కదలకు" అరిచారు ఇద్దరు సైనికులు టార్చి వేస్తూ. ముఖానికి అడ్డుగా చెయ్యిపెట్టి, "స్టుపిడ్స్! టార్చి ఆర్పెయ్యండి" అరిచాను కోపంగా చైనా భాషలో.

టార్చి వేసిన సైనికుడు ఆర్పేశాడు. రెండోవాడు తుపాకీ దింపేశాడు.

"తెలియదు సార్! చూడలేదు, క్షమించండి!" అన్నాడు వణుకుతూ. నేను వేసుకొన్న యూనిఫారం చూసి తమ ఆఫీసర్ అనుకొన్నారు వాళ్ళు.

"ఈసారి ఇటువంటి పొరపాటు చెయ్యకండి. తోలు ఊడదీస్తాను" అరిచాను. ఆ సైనికులు ప్రక్కకు తొలిగారు.

దర్జాగా, ఠీవిగా ముందుకు నడిచాను. చుట్టూ జీపులు ట్రక్కులూ కన్పిస్తున్నాయ్. బిల్డింగ్స్‌కి దూరంగా రాకెట్స్ నిలబడి వుండి తెల్లవారగానే మూడు దేశాలను నాశనం చెయ్యడానికి ఎదురు చూస్తున్నాయ్.

కసిగా పళ్ళుకొరుక్కొన్నాను. దేవుడు దయతలిస్తే ఏ వక్కడినీ ఈ దీవినుంచి బైటకు పోనివ్వకుండా చంపా లనుకొన్నాను నేను చచ్చినా సరే.

ఎవరో హడావిడిగా వస్తున్న అలికిడి అయింది. ఆగి పోయాను. అటు వస్తున్న సెంట్రీ నన్ను చూడగానే ఆగి సెల్యూట్ చేసాడు.

"ఏమిటి?" అడిగాను.

"కమాండర్ మిమ్మల్ని పిలుస్తున్నారు."

"దేనికి?"

"నాకు తెలియదు. వెంటనే రమ్మంటున్నారు."

"ఎక్కడున్నారు?" అడిగాను మామూలుగా. కొంచెం అనుమానంగా చూసాడు.

"ఇడియట్ త్వరగా చెప్పి చావు!" అరిచాను చైనీస్ ఆఫీసర్లా.

"సైంటిస్టుగారి బిల్డింగ్‌లో సార్" అన్నాడు.

"సరే నువ్వెళ్ళు, వస్తాను" అన్నాను.

నా మనస్సు ఆనందంతో ఉరకలేసింది.

'మంచి అవకాశం. సైంటిస్టు కమాండర్ వకేచోట వున్నారు. వీలైతే ఆపరేషన్ స్మాష్ చెయ్యడంతోపాటు వాళ్ళిద్దరినీ కూడా చంపేసి ఈ దీవినుంచి వెళ్ళిపోవాలి' అనుకొన్నాను కొండపైనుంచి చూస్తూండగా ఆపరేషన్ నటూనా బిల్డింగ్‌పై కనిపించిన హెలికాప్టర్ గుర్తొచ్చి.

బయలుదేరాను కమాండర్ దగ్గరకు. సెంట్రీబూట్స్ టకటకా చప్పుడుచేసి సెల్యూట్ పెట్టాడు.

ఆపరేషన్ నటూనా చేరుకొన్నాను. నన్ను అనుస రించి వస్తున్న సెంట్రీ నా వెనకనే నిలబడి వున్నాడు. క్రూరంగా చూసాను.

మొహం ప్రక్కకి తిప్పుకొన్నాడు. ఒళ్ళు మండి పోయింది. కాని చేసేదేమీ లేక ఊరుకొన్నాను.

బిల్డింగ్ గేటుదగ్గర నిలబడ్డ సెక్యూరిటీ గార్డ్స్ చేతులు చాపారు ఐడెంటిఫికేషన్ కార్డుకోసం. వాళ్ళ చేతుల్లో గన్స్ ఆకలిగా చూస్తున్నాయ్. జేబులో చెయ్యిపెట్టితీసి ఇచ్చాను. వాళ్ళ ముఖంలో తృప్తి కదులాడింది.

తిరిగి ఇస్తూ సెల్యూట్ చేసారు. గమనించనట్టుగా ముందుకు నడిచాను. సెంట్రీ నన్ను అనుసరిస్తున్నాడు. గేటు దాటగానే అయోమయంలో పడి ఆగిపోయాను. చాలా దారులు కన్పిస్తున్నాయ్.

మంచి ఐడియా తట్టింది.

సెంట్రీవైపు తిరిగి కొరకొరా చూసాను. "ఇడియట్ నిన్ను పొమ్మన్నా ఎందుకనుసరిస్తున్నావ్?" అరిచాను. నిర్లక్ష్యంగా చూసాను.

"రాస్కెల్ కమాండర్ దగ్గర కెళ్ళాక నీ పొగరు అణుస్తాను పద!" చాచి దవడమీద కొట్టాను.

వాడిచెయ్యి గన్ పై బిగుసుకొంది. అదోలా చూసి ముందుకు కదిలాడు.

వాడి ప్రవర్తన నాలో అనుమానం రేపుతోంది. కాని ఈ పద్మవ్యూహంలో ప్రవేశించాక చేసేదేమీ లేక మౌనంగా వాడిని అనుసరించాను.

లిఫ్ట్ ఎక్కి తర్డ్ ఫ్లోర్ లోకి చేరుకొన్నాము. వక గది ముందాగాడు సెంట్రీ. గుమ్మానికి అటూ ఇటూ నిలబడ్డ సైనికులు సెల్యూట్ కొట్టారు.

గుండె వేగంగా కొట్టుకొంటోంటే ఠీవిగా వెళ్ళి డోర్ పై శబ్దం చేసాను.

"కమాన్ కర్నల్" లోపలినుంచి గంభీరంగా విన్పించింది. లోపలికెళ్ళిన నా వెనుకే తలుపులు మూసుకొన్నాయ్.

"వెల్ కమ్ మై డియర్ ఇండియన్ స్పై" చేతిలోని పాట్ గన్ విలాసంగా ఊపుతూ పరిహాసంగా అన్నాడు కమాండర్. అతని ప్రక్కనే వున్న వృద్ధుడైన సైంటిస్ట్ వికృతంగా నవ్వుతోన్నాడు.

నా వెన్నులోంచి వణుకు పుట్టుకొచ్చింది.

# 8

'నా చరిత్ర పూర్తయింది!' అనుకొన్నాను గుటకలు వేస్తూ.

"ఎలా వుంది మిస్టర్ మా అతిథి సత్కారం" అడిగాడు కమాండర్ వెకిలిగా నవ్వుతూ.

"ఫైన్।" అన్నాను. "కాని చిన్న డౌట్!"

"ఏమిటది?"

"ఏమీలేదు. ఈ ఆఫీసర్ వేషంలో వున్న నన్ను ఎలా తెలుసుకొన్నారు?" అడిగాను.

"నేను చెప్తాను" లేచాడు సైంటిస్ట్.

"నీ పేరు?"

"షాంగ్ చీ!" నవ్వాడు.

"మిస్టర్, నువ్వు మా గురించి మా ఆపరేషన్ గురించి చాలా తక్కువ అంచనా వేసుకొన్నావని నా కిప్పుడు అర్థమాతోంది.

నువ్వు సింగపూర్ నుంచి బైలుదేరి హాంకాంగ్ చేరుకొన్నప్పుడే నీ సంగతి మాకు తెల్సిపోయింది. కాని మేము చేసిన పొరపాటు ఏమిటంటే అప్పుడే మిమ్మల్ని చంపక

'మీరు సాగించిన వెతుకులాటలో ఏ సముద్రజంతువు పాలబడో చస్తారులే' అనే అశ్రద్ధతో మీ గురించి జాగ్రత్త పడలేదు.

కాని అన్ని అడ్డంకులూ ఎదుర్కోనక తప్పలేదు. ఫలితం లేకపోగా మేము ఒక 'వార్ ప్లేన్' ఒక 'గన్ బోట్' నష్టపోయాము. తిరిగి మరికొన్ని వార్ ప్లేన్స్ పంపుదామంటే నీ అదృష్టంకొద్దీ సైక్లోన్ అడ్డొచ్చింది.

అంత సైక్లోన్‌లోంచి కూడా బాతిస్కోప్‌లో తప్పించుకొని ఐలెండ్‌లో అడుగుపెట్టావ్.

ఎన్నో ప్రమాదాలు సమయస్ఫూర్తితో తప్పించుకొన్న నువ్వు, ఈ ఐలెండ్‌లో కొండల మధ్య అణ్వాస్త్రాలు తయారుచేస్తున్న మేము చుట్టూ సముద్ర తీరాలలో ఏ రక్షణా లేకుండా అంత నిర్లక్ష్యంగా వదిలేస్తామని ఎలా అనుకొన్నావ్?"

నా పొరపాటు అర్థమైంది.

"ఐ. సీ. పామ్‌చెట్ల మధ్య టెలివిజన్ కెమెరాలు అమర్చారన్నమాట!" అన్నాను.

"బాగా తెల్సుకొన్నావ్. పామ్‌చెట్ల మధ్యే కాదు కొండరాళ్ళ మధ్యకూడా పవర్‌ఫుల్ ట్రాన్స్‌మీటర్స్ అమర్చాము. సరిగ్గా నువ్వు నక్కిన కొండరాయిక్రిందే ట్రాన్స్‌మీటర్ ఉంది" కమాండర్ అన్నాడు.

సెంట్రీ ప్రవర్తనకు కారణం తెలిసింది.

"ఐలెండ్ కనుక్కోవటంలో నువ్వు చాలా లేట్ చేసావు మిస్టర్. ఆఖరు క్షణాలలో నీ కర్తవ్యాన్ని జయప్రదంగా నిర్వహించి ఫలితాన్ని నీ బాస్‌కు తెల్పావు.

కాని అతను కూడా చేసేదేమీ లేదు.

తెల్లవారితే మీ ఇండియాలో మిగిలేది మనుషులు కాదు మట్టి. వరల్డ్ మాప్‌లో ఆ స్థలం ఏమవుతుందో తెల్సా? నీలిరంగు ఆక్రమించుకొంటుంది!" పిశాచంలా నవ్వాడు పాంగ్ చీ.

అసహ్యంగా చూసాను. "మీరు మనుష్యులు కాదు ...రాక్షసులు... డెవిల్స్!" అరిచాను.

పిడికిలి బిగించి దవడపై గుద్దాడు. పెదవి చిట్లి రక్తం బయటకు వచ్చింది.

కోడి తలకాయలా ఉన్నవాడి తలను పరిచేయాలన్పించిన బలమైన కోర్కెను అణుచుకొన్నాను.

రక్తం నోట్లోకి వెళ్ళి ఉప్పగా తగిలింది.

"పొరపడుతున్నావ్. ఇంకా తెల్లవారటానికి పది గంటలుంది. ఆ సమయం చాలు ఇండియన్ 'నాట్' విమానాలు ఇక్కడికి చేరుకోడానికి," నాలుకతో పెదవులపై గాయాన్ని రుద్దుకొంటూ అన్నాను.

"లాభంలేదు మిస్టర్. ఆ ఆశలేం పెట్టుకోకు. ఈ పాటికి నటూనాలో ప్రతీ దీవిలో ఉన్న మా ఆర్మీ వార్‌కు సిద్ధంగా ఉంటుంది.

సింగపూర్ దాటిన ఏ వార్ ప్లేన్ అయినా యాంటీ ఎయిర్ క్రాఫ్ట్ గన్స్ దెబ్బతిని దక్షిణ చైనా సముద్రంలో కూలవలసినదే. మరో విషయం ఇక్కడికి ఎనిమిది మైళ్ళ దూరంలో ఉన్న 'క్వీనా' ద్వీపం సింగపూర్ నుంచి 'ఆపరేషన్ నటూనా' చేరేవారికి ముందుగా ఎదురవుతుంది.

ఆ దీవికి మైలు దూరంలో లంగరు వేయపడిన మా నావల్ వార్ షిప్‌పై పదంగుళాల ఆర్మీ గన్స్ నాలుగు ఆకాశంలోకి చూస్తుంటాయ్. ఒకోదానికి అమర్చబడిన

టెలిస్కోప్ పొడవెంతో తెల్సా? 15 అంగుళాలు. ఏ క్షణాన అవసరమైతే ఆ క్షణాన అది ఇక్కడకు చేరు తుంది.

"పోతే ఇక్కడున్న ఎక్విప్ మెంట్స్ గురించి నీకు చెప్పనక్కరలేదనుకొంటాను." ఆర్మీ కమాండర్ అన్నాడు.

వింటోంటే మతి పోతోంది.

"డోన్ట్ బీ ఎఫ్రైడ్ మిస్టర్. నిన్నిప్పుడే చంపదల్చు కోలేదు. ఈ రాత్రంతా సుఖంగా నిద్రపో. తెల్లవార గానే ఇక్కడినుంచి బైలుదేరిన రాకెట్స్ ఇండియా రష్యాలను ఎలా రూపుమాపుతాయో టెలివిజన్ లో చూసి మరి చద్దువుగాని." నా ముఖంలోకి చూస్తున్న సైంటిస్ట్ పరిహాసంగా అన్నాడు.

"థాంక్స్!" అన్నాను. "సిగరెట్ కాల్చుకో వచ్చా?"

"నీదగ్గరున్న ఆయుధాలిచ్చేస్తే అభ్యంతరమే లేదు" అన్నాడు కుర్చీలోంచి లేవకుండా కమాండర్.

మెషిన్ గన్ రివాల్వర్ డాగర్ లాంటి వెపన్స్ అన్నీ నేలపై పడేశాను.

"వెల్, ఇక కాల్చుకో!" అంటూ టేబిల్ పై వున్న సిగరెట్ పాకెట్ లైటర్ నా వైపు విసిరాడు. అందు కొని సిగరెట్ నోట్లో పెట్టుకొంటూ కమాండర్ వైపు కోరగా చూసాను.

తలవంచుకొని సిగరెట్ కాల్చుకోబోతుండటం వలన నా చూపును అతను గమనించే అవకాశం లేదు.

గన్ను దృఢంగా పట్టుకొన్నాడు. చెయ్యేమాత్రం షేక్ ఇవ్వటంలేదు.

లైటర్ వెలిగించి సిగరెట్ దగ్గరగా చేర్చాను. చటుక్కున తలెత్తి గట్టిగా ఊదాను.

అంచు అంటుకున్న సిగరెట్ విసురుగా వెళ్ళి కమాండర్ ఒళ్ళో పడింది.

"ఓ మైగాడ్!" త్రుళ్ళిపడుతూ కంగారుగా లేచి నిలబడ్డాడు కమాండర్. వేగంగా వాడివైపు దూకాను.

కాని ఆలశ్యమైంది. వెనకనుంచి తలపై బలంగా మోదారెవరో. కళ్ళముందు అణ్వాస్త్రాలు కన్పించాయి.

స్పృహ తప్పి నేలకూలుతుండగా అస్పష్టంగా కన్పించింది, నా వెనకనున్న సెంట్రీ అటెన్షన్‌లో నిలబడి కమాండర్‌కు సెల్యూట్ కొట్టే దృశ్యం.

# 9

తలంతా భారంగా ఉంది.

కళ్ళు తెరిస్తే సూదులతో పొడుస్తున్నట్లు ఉంది. అప్రయత్నంగా తల తడుముకొన్నాను. గడ్డకట్టిన రక్తం చేతికి పెళుసులా తగిలింది. తిరిగి కళ్ళు మూసుకొన్నాను.

సమయం గడిచింది.

బాధకొద్దిగా ఉపశమించింది. కళ్ళు బాగా తెరిచి గదంతా చూసాను. పోలీస్‌స్టేషన్‌లో సెల్స్‌కు దీనికి తేడా ఏమీ కన్పించలేదు. కాంక్రీట్ చెయ్యబడిన గది కప్పుమధ్యనుంచి వ్రేల్లాడుతోన్న ఎలక్ట్రిక్ లాంప్ కాంతి వెదజల్లుతోంది.

ఎందుకో ఫిషర్, ఏజంట్ X-5 గుర్తుకొచ్చారు. తల విదిల్చి లేచి కూర్చొన్నాను. గోడకు వ్రేల్లాడుతోన్న వాటర్‌బాగ్ ఆకర్షించింది. దానిలోని చల్లని నీళ్ళతో మొహం కడుక్కొని, మిగిలినవి త్రాగాను.

ప్రాణం లేచొచ్చినట్లయింది. షర్ట్ బటన్స్ తడుము కొన్నాను. వాటిరూపంలో ఉన్న మినీ బాంబ్స్ చేతికి గట్టిగా తగిలి ధైర్యాన్నిచ్చాయ్.

టైం చూసుకొన్నాను. ఐదుగంటలైంది. మరో గం టలో జరగబోయేదాన్ని గూర్చి ఊహించటానికి ధైర్యం చాలలేదు.

ఏదేమైనా ప్రపంచం భవిష్యత్ ముఖ్యంగా ఇండియా రష్యాల భవిష్యత్ ప్రస్తుతం నా చేతిపై ఆధారపడి ఉంది. మరో గంటలో అదికూడా తేలిపోతుంది.

ఆలోచిస్తూ కూర్చున్నాను. గంట గడిచింది. ఎవరో వస్తున్న బూట్ల శబ్దం విన్పిస్తోంది. తలుపులవైపు చూస్తూ నిలబడ్డాను.

చటుక్కున తలుపులు తెరుచుకొన్నాయ్. సైంటిస్ట్ షాంగ్ చీ, కమాండర్, నేను దెబ్బతీసిన కర్నల్, మరో నలుగురు సోల్జర్స్ గన్స్‌తో లోని కొచ్చారు.

"హలో గుడ్ మార్నింగ్!" ముందుగా పలకరించాడు షాంగ్ చీ నవ్వుతూ.

"నో... బాడ్ మార్నింగ్" అన్నాను గంభీరంగా.

"ఎవరికి? నీకా?" వెటకారంగా అడిగాడు.

"అవకాశం దొరికితే నీకూనూ" అంటూ కర్నల్ వైపు చూసాను. క్రోధంగా మింగేసేవాడిలా నావైపు చూస్తున్నాడు.

"కమాన్ మిస్టర్... మా ఆటమిక్ రాకెట్స్ ఎలా మీ దేశాన్ని నాశనం చేస్తాయో చూసి తరిద్దువుగాని" అంటూ బైటకు నడిచాడు కమాండర్.

ఇద్దరు సోల్జర్స్ నా వెనక్కి వచ్చి మెషిన్ గన్స్ వీపుకు నొక్కిపెట్టి ముందుకు నెట్టారు. గదినుంచి బైటకొచ్చాము.

పొడుగాటి నడవాదాటగానే విశాలమైన హాలు ఎదు రయింది. అక్కడినుంచి అన్నివైపులకూ మెట్లున్నాయ్.

క్రిందకి వెళుతోంది సైంటిస్ట్ బృందం. ఎక్కడికి వెళు తున్నామో తెలియకపోయినా ఆదారి మాత్రం అండర్ గ్రౌండ్‌లోకి వెళ్తోందని గ్రహించగలిగాను.

మెట్లు అంతమయ్యాయి. దేదీప్యమానంగా వెలుగు తున్న లైట్లలో ఎటుచూసినా రకరకాల మెషిన్స్ ముందు శాస్త్రజ్ఞులు కన్పిస్తున్నారు. వాటిని దాటు కొంటూ వెళ్ళి ఒక ద్వారం ముందు ఆగాము.

స్వింగ్ డోర్ నెట్టుకొని లోనికి ప్రవేశించగానే ఆశ్చర్యంతో నివ్వెరపోయాను. గదిలో ఎక్కడచూసినా అణ్వస్త్ర భాగాలు కన్పిస్తున్నాయ్. అరడజనుమంది సైంటిస్ట్స్ వాటిని జాగ్రత్తగా కలుపుతూకూర్చున్నారు.

అక్కడున్న అణ్వాస్త్రాలతో అరగంటలో సగం ప్రపం చాన్ని నాశనం చేసెయ్యొచ్చు అన్పించింది నా కా క్షణంలో.

తన గదిముందు ఆగి లోనికి నడిచాడు సైంటిస్టు. గన్ బారెల్స్‌తో ముందుకి నెట్టారు నన్ను. తలుపులు మూసుకు పోయాయ్. బైటుండిపోయారు సోల్జర్స్.

కమాండర్ సైంటిస్ట్ షాంగ్‌చి చెరో కుర్చీలో కూర్చున్నారు. గన్ పట్టుకొని నా వైపు తీక్షణంగా చూస్తున్నాడు కర్నల్. షాంగ్‌చీ కుర్చీకెదురుగా టేబిల్‌పై టెలివిజన్స్ అమర్చబడి ఉన్నాయ్. రకరకాల మెషిన్స్, వాటి రంగురంగుల బటన్స్‌తో మెరుస్తూ టెలి విజన్స్ ముందు అమర్చబడి ఉన్నాయ్.

రిసీవర్ తలకు తగిలించుకొని రాకెట్స్ దగ్గరున్న శాస్త్రజ్ఞుల బృందంతో కిచకిచా మాట్లాడుతున్నాడు

షాంగ్ చీ. కమాండర్ మాత్రం నిర్వికారంగా సైంటిస్ట్ వైపు చూస్తున్నాడు. అతని కళ్లు అవ్యక్తమైన ఆనందంతో మెరుస్తున్నాయ్.

గదంతా కలయచూసాను. ఎటుచూసినా సైన్సు పరికరాలే కన్పిస్తున్నాయ్. అర్థంకాని మిషన్స్ అల్లిబిల్లిగా అల్లుకుపోయి ఉన్న వైర్లు, యాసిడ్సు, ధాతువులు, చూస్తుంటే తల తిరుగుతోంది. అకస్మాత్తుగా ఒకచోట ఆగిపోయాను. ఒళ్ళు జల్లుమంది.

సైంటిస్ట్ షాంగ్ చీ ఎదురుగా ఉన్న మిషన్‌కు కొంచెం ప్రక్కగా గోడవారనే స్టాండుపై నిలబెట్టబడివున్న గాజుపెట్టెలలో చుట్టలుచుట్టుకొని బుసలు కొడుతున్నాయ్ స్నేక్స్, ప్రపంచంలోకెల్లా భయంకరమైన పాయిజన్ స్నేక్స్.

సంభాషణ ఆపాడు షాంగ్ చీ. అతని వ్రేళ్లు మిషన్ బటన్సుపై కదిలాయ్. టెలివిజన్స్‌లో మూడు రాకెట్సు కన్పించటం ప్రారంభించాయ్. వాటి పరిసరాలలో ఉన్న వారంతా ట్రక్కులలో దూరంగా తరలిపోతున్నారు.

ట్రాన్స్‌మిటర్ వేసి ప్రెసిడెంట్‌తో రెండు నిముషాలు మాట్లాడాడు. షాంగ్ చీ ముఖం వెలిగింది. నా వైపుచూసి విషపు నవ్వొకటి నవ్వాడు.

ఐలెండ్‌లో ఉన్న వార్నింగ్ సైరన్సు మ్రోగనారంభించాయ్. దీవిలోని సెక్యూరిటీ అంతా బిల్డింగ్స్‌లోకి చేరుకొంటోంది.

నా గుండెలు దడదడ లాడుతున్నాయ్. నానుదుటిపై నుంచి చెమట ధారగా ప్రవహిస్తూంది. అరనిముషం గడిచింది.

మైక్‌లో కౌంటింగ్ ప్రారంభమైంది. ఆ ముగ్గురిలో ఒకరకమైన టెన్షన్ కన్పిస్తోంది. పాంగ్ చీ వేళ్ళు మిషన్ బటన్స్‌పై బడ్డాయి.

"నైన్... ఎయిట్... సెవన్..." స్పీకర్‌లోంచి కౌంటింగ్ విన్పిస్తోంది.

ఆకుపచ్చనిరంగు బటనుపై వ్రేలుంచాడు పాంగ్ చీ.

అకస్మాతుగా నా దృష్టి ప్రక్కనున్న ఎరుపు రంగు బటన్‌పై నిల్చింది.

బటన్‌పై 'S' అన్న అక్షరం మెరుస్తోంది.

"S అంటే?"...

'స్మాష్...స్మాష్...' పిచ్చిగా అనుకొన్నాను.

'ఎలాగయినా దానిని ప్రెస్ చెయ్యగలిగితే చాలు. నా ప్రాణాలు పోయినా ఆ రాకెట్స్ స్మాష్ చెయ్యాలి. కాని ఎలా?' విపరీతంగా ఆలోచిస్తున్నాను.

"ఫైవ్...ఫోర్...త్రీ..." అరుస్తోంది మైక్ రాక్షసిలా.

ఊపిరి బిగబెట్టి చూస్తున్నాను. పాంగ్ చీ ముఖం బిగుసుకొంది. వృద్ధ పిశాచంలా ఉన్నాడు.

"టూ...వన్...జీరో..."

అంతే, బటన్ నొక్కేశాడు.

చెవులు చిల్లులు పడేంత శబ్దం అయింది. దీవి గట్టిగా కంపించింది.

# 10

రాకెట్స్ ఇంజన్ ప్రేలి ఇంధనం అంటుకొని విపరీతమైన వేగంతో మంటలను క్రిందకు విరజిమ్ముతూ పైకి లేచాయ్.

వికటాట్టహాసం చేసాడు పాంగ్ చీ. టెలివిజన్ స్క్రీన్‌పై కదులుతున్నాయ్ రాకెట్స్. మాటి మాటికీ

తన వాచీ, టెలివిజన్‌ను పరిశీలించడంలో మునిగిపోయాడు సైంటిస్టు.

మొదటి రెండూ ఇండియా రష్యాల పైకని తెలుసు. కాని మూడో రాకెట్ దేనిపైకో అర్థం కాలేదు.

నిముషం గడిచింది. స్క్రీన్‌పై రాకెట్స్ క్రింద కని పిస్తున్న నీలి సముద్రం అదృశ్యమైంది. భూప్రదేశం కన్పి స్తోంది అంతా.

ఇండియా చేరుతోంది మొదటి రాకెట్. పావు గంటలో జరగబోయే విధ్వంస కాండ కళ్ళ ముందు కన్పిస్తోంది.

ప్రతీ అవయవాన్ని అదుపులోకి తెచ్చుకొన్నాను. ఎక్కడలేని తెగింపు వచ్చేసింది. మూర్ఖంగా వక్క ఉరుకు ఉరికి షాంగ్‌చీ దగ్గరకు చేరుకొన్నాను.

అప్రమత్తంగా ఉన్న కల్నల్ ఫైర్ చేసాడు. రెండు గుళ్ళు కుడి భుజంలోనూ మరో రెండు ప్రక్కటెముకల లోనూ దిగబడ్డాయ్.

బాధగా కేక వేసాను. కాలు జరిగింది. విసురుగా వెళ్ళి మెషిన్‌పై పడ్డాను. షాంగ్‌చీ గన్ అందుకొ న్నాడు. కమాండర్ అరుస్తున్నాడు.

అందే దూరంలో ఉంది రెడ్ బటన్. ఊపిరి బిగబెట్టి మెరుపులా చేయిచాచి బటన్‌పై గుద్దేశాను.

నా ప్రయత్నాన్ని ముందే గమనించాడు షాంగ్‌చీ.

'నో' అంటూ గది దద్దరిల్లేలా పిచ్చి కేక పెట్టాడు. కాని ఆలశ్యమై పోయింది.

టెలివిజన్ స్క్రీన్‌పై వాయువేగంతో కదులుతున్న ఆటమిక్ రాకెట్స్ భయంకరమైన విస్ఫోటంతో ఆకాశం లోనే పేలిపోయాయి.

అంతా రెప్పపాటు కాలంలో జరిగిపోయింది. ట్రిగర్ నొక్కాడు మళ్ళీ కర్నల్. గమనించి ప్రక్కకు జరిగాను షాంగ్‌చీ కాళ్లు అడ్డు పడటంతో విసురుగా వెళ్ళి ఒక గాజు పెట్టెపై పడ్డాను.

భళ్ళున బ్రద్దలైంది. ఆలోగా కర్నల్ కాల్చినబులెట్స్ దూసుకెళ్ళి అడ్డొచ్చిన కమాండర్ తల బ్రద్దలు చేసాయ్.

'బుస్' మంటె ప్రక్కనే. అదిరిపడి చూసాను. గోధుమ రంగు త్రాచు పడగపై లేచి బుస కొడుతోంది.

చటుక్కున దాని మెడ పట్టుకొని నా వైపు తిరుగు తున్న కర్నల్ ముఖంపై విసిరాను. ఊహించని ఆ పరిణా మానికి కెవ్వుమన్నాడు వాడు. రెచ్చిపోయిన త్రాచు వాడి ముఖంపై నాలుగైదు కాట్లేసింది.

మైక్‌లో అరుపులు వినిపిస్తున్నాయ్. గది బయట తలు పులు బాదుతున్నారు. నివ్వెరపోయి చూస్తున్నాడు షాంగ్‌చీ. ఎంతో శ్రమపడి తయారు చేసిన ఆటమిక్ రాకెట్స్ ఊహించని పరిణామానికి గురై నాశనం కావటం అతన్ని నిశ్చేష్టుడిని చేసింది.

ఆ అవకాశాన్ని వినియోగించుకున్నాను. ఒక్కంగలో నేలపై కొట్టుకొంటోన్న కర్నల్‌ను చేరుకొని అతని చేతిలోని గన్ లాక్కున్నాను.

గోధుమ త్రాచు కర్నల్ మెడ చుట్టూ మెలికలు తిరుగుతోంది.

తేరుకొంటున్న షాంగ్‌చీ వైపు గురిపెట్టి నిర్దాక్షి ణ్యంగా కాల్చేశాను. కుడి భుజంలో దిగిన బుల్లెట్స్ విప రీతంగా సలుపుతున్నాయ్. రక్తం బాగా స్రవించటంతో కళ్ళు తిరుగుతున్నాయ్.

షాంగ్‌చీ టేబిల్‌పై ఉన్న రెండు బాంబులు జేబులో వేసుకొని తలుపు వైపు పరిగెత్తాను.

డోర్ తియ్యగానే లోనికి జొరబడుతున్న సోల్జర్స్‌ను కాల్చేసి బైటకు చేరుకొన్నాను.

ఈ డెవిల్స్ బ్రిగేడ్ బిల్డింగ్‌లోకి జొరబడక ముందే ఇక్కడి నుంచి పారిపోవాలని నా ఉద్దేశం.

అణ్వాస్త్ర భాగాలు విడి విడిగా కన్పిస్తున్న గది దాటాను. అంత క్రితం రకరకాల మెషిన్స్ ముందు కన్పించిన శాస్త్రజ్ఞులు అయోమయంగా అరుచుకొంటున్నారు. నన్ను చూడగానే అందరి నోళ్ళూ మూతలు పడ్డాయ్. చేతులు జేబుల్లో దూరాయ్. షర్ట్ బటన్స్ రూపంలో ఉన్న మినీబాంబ్స్ వారిపై విసిరాను. ప్రేలుళ్ళతో పాటు వాళ్ళ శరీరాలు తునాతునకలయ్యాయ్.

పరిగెత్తుకొంటూ వెళ్ళి మెట్లు చేరుకొని అండర్ గ్రౌండ్‌లోంచి పైకి వెళ్ళేసరికి సోల్జర్స్ బిల్డింగ్‌లోకి చొచ్చుకొస్తున్నారు. చకచకా బిల్డింగ్ పైకి పరిగెత్తాను అడ్డు వస్తున్న వాళ్ళను కాలుస్తూ.

టెర్రస్ పైకి చేరుకొంటుండగా కొండల వెనకనుంచి సూర్యుడు పైకి లేస్తున్నాడు. మరో రెండు బుల్లెట్స్ నా తొడల్లో దూరాయ్. నాలుగు బటన్ బాంబ్స్ అందుకొని మెట్లపైగా పైకి వస్తున్న సోల్జర్స్ పైకి విసిరి హెలికాప్టర్ దగ్గరకు పరుగెత్తాను.

కాలూ, చెయ్యి పూర్తిగా ఆధీనం తప్పాయ్. ఇంజన్ స్టార్టుచేసి పైకి లేపాను. బ్లేడ్స్ గిర్రున తిరుగుతూ ఆకాశంలోకి లేచింది హెలికాప్టర్.

ఇన్‌స్ట్రుమెంట్ పానల్ వైపు చూస్తూ జేబులోంచి బాంబులు తీసాను.

క్రింద నుంచి సోల్జర్స్ మెషిన్ గన్స్ కాలుస్తున్నారు. 'యాంటీ ఎయిర్ క్రాఫ్ట్ గన్'ను రంగంలోకి తెచ్చారు కాబోలు 'ఢాం... ఢాం...' అంటూ కొండలను అదర గొడుతోంది.

రెండు వేపులా కొండలాటంవలన నేరుగా ముందు కెళ్ళడానికి వీలులేక చుట్టూ చుట్టలు తిరుగుతూ పైకి లేపవలసి వస్తోంది హెలికాప్టర్‌ను.

విఫలయత్నం చేస్తున్నాను ఎయిర్ క్రాఫ్ట్ గన్ బారి నుంచి తప్పించటానికి. బాంబుల నొకసారి ఆప్యాయంగా ముద్దు పెట్టుకొని ఫ్యూజ్ లాగి క్రిందకు విసిరాను. మరో రెండు సెకన్లలో ఏం జరగబోతోందో నాకు తెలుసు.

పళ్ళు బిగబెట్టాను. దృష్టి అంతా ఇన్‌స్ట్రుమెంట్ పానల్ పైనే నిలిపాను.

క్రింద పెద్ద విస్ఫోటం జరిగింది. కిటికీలోంచి చూశాను. మొత్తం ఐలెండ్ అంతా స్మాష్ అయిపోతోంది భయం కరమైన జ్వాలలతో.

తృప్తిగా నిట్టూర్చాను. హెలికాప్టర్ ఐలెండ్ దాటి సముద్రంపై కొచ్చాక గమనించాను అసలు ప్రమాదాన్ని.

బిల్డింగ్ పైనుంచి లేస్తోండగా సోల్జర్స్ కాల్చిన మెషిన్ గన్స్ తాలూకు గుళ్ళు పెట్రోలు టాంకును తొల్చి వేయటంతో పెట్రోలంతా ఎప్పుడో కారిపోయింది.

ఆఖరున మిగిలిన కొద్ది పెట్రోలుతో మరో పాతిక మైళ్ళు ముందు కెళుతుంది.

'నా పని కూడా ఐపోయింది' అనుకొన్నాను దూరంగా 'ఆపరేషన్ నటూనా' వైపు దూసుకొస్తున్న చైనీస్ నావల్ వార్‌షిప్‌ను చూసి.

సముద్రం వైపు కూలిపోతోంది హెలికాప్టర్. పారా చూట్ అందుకొని క్రిందకు ఉరికాను. సముద్రంపై చేరుకోగానే పారాచూట్ గాల్లో కెగిరిపోయింది.

కళ్ళు మూతలు పడుతున్నాయ్. మనస్ఫూర్తిగా దేవుడిని తల్చుకొన్నాను నీటిపై తేలుతూ.

"హేయ్! విజయ్!" పెద్దగా కేక విన్పించింది. ఆశ్చర్యపోతూ కళ్ళు తెరచాను. కొంచెం దూరంలో ఆకు పచ్చని 'సీస్పైడర్' నీటిపై తేలుతోంది.

తలుపు తెరుచుకొని నా వైపు చూస్తూ సంతోషంతో చేతులూపుతున్నాడు సి. బి. ఐ. సెకండ్ ఏజంట్ శైలేందర్. మిశ్రాగారు అప్పుడే నా రక్షణకు ఏర్పాట్లు చేశారన్న మాట.

కదిలే ఓపిక లేక అలాగే వుండిపోయాను. 'సీస్పైడర్' నా దగ్గరకు చేరుకొంది. లోనికి తీసుకొన్నాడు నన్ను శైలేంద్ర. నెమ్మదిగా నీటిలో దిగిపోయింది 'సీ స్పైడర్.'

"హలో బాస్ హౌ ఆర్ యూ?" డ్రైవింగ్ వీల్ ముందు కూర్చున్న బాబీ అడిగాడు విష్ చేస్తూ. "ఫైన్" అన్నాను, భుజంలో బుల్లెట్స్ కలుక్కుమంటుండగా.

కోపంగా చూశాడు శైలేంద్ర నైఫ్ నా జేబ్బులో దింపుతూ.

"బాబీ స్పీడుగా పోనివ్. మరో అరగంటలో చైనీస్ సబ్‌మెరైన్స్ ఈ ప్రదేశాన్ని చుట్టుముడతాయ్ జాగ్రత్త." అన్నాను.

## 174

"డోంట్ వర్రీ గురూ, అవి హాంకాంగ్ నుంచి ఇక్కడికి చేరుకొనేసరికి ఎంత లేదన్నా గంటన్నర పడుతుంది. ఈ లోగా మనం 'జావా' సముద్రం మీదుగా 'సుందా జల సంధి' దాటి హిందూమహాసముద్రం చేరుకొంటాం" అన్నాడు నవ్వుతూ.

తృప్తిగా కళ్ళు మూసుకొన్నాను.

-: ఐపోయింది :-




## (16వ భాగము)

ఆలోచించసాగాను. ఆమెకు మెల్లగా నచ్చజెప్పి, నా కోసం రాకుండా చెయ్యగలిగితే బాగుంటుందనిపించింది. కానీ ఆమె వింటుందన్న నమ్మకం కలగడంలేదు. మరో మారు ప్రయత్నిద్దామని అనుకున్నాను. నా ఆలోచన నాయకుడికి చెప్పాను.

"పిచ్చివాడా? కులం కట్టు తెంపుకొని, నీకోసం అడవిలో ఒంటరిగా అంతసేపు కాచుకునే మనిషి, తన కోరిక తీర్చుకోకుండా వెళ్ళిపోతుందనే అనుకున్నావా? నాకు నమ్మకం లేదు. మా వాళ్ళు మొండిఘటాలు. మనసుకు ఎంతతోస్తే అంతే! ప్రాణాలతీపి, బ్రతుకుపైన ఆశ, వాళ్ళకు అసలు వుండవు." అన్నాను.

"అయితే నన్నేం చెయ్యమంటావ్?" అన్నాను.

"నే చెప్పినట్టు చెయ్యి" నాయకుడు చెప్పాడు.

మరో పదినిముషాలు పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ కూర్చున్నాడు.

"ఇంక బయలుదేరుదామా!" అడిగాడు నాయకుడు.

"ఆఁ!" అన్నాను అయిష్టంగానే.

ఇద్దరం బయలుదేరాం. మా వెంట మరో ఇద్దరు అడవి మనుషులుకూడా కదిలారు. అందరం నడుస్తున్నాం.

అంతకుముందు ఆడమనిషి వుంటానని చెప్పినచోటు దగ్గరకు వచ్చేశాం. దూరంనుంచే చూపించాను నాయకుడికి. మాకెవ్వరూ కనుపించలేదు. ఆమె ఏమయిందాని ఆశ్చర్య పోయాను. మారాక బహుశా పసిగట్టి తప్పించుకు పారి పోయి వుంటుందని ఊహించాను.

అందరం చెట్టుక్రింద నిలుచున్నాం.

"ఇక్కడేనా ఆమె వుంటానంది?" అడిగాడు నాయకుడు.

"అవును" అన్నాను.

నాయకుడు చుట్టుప్రక్కల చూశాడు. నేనూ చూశాను. ఆమెలేదు. లేకపోవడం నాకు ఆనందం కలిగించింది.

ఇద్దరం కొంతసేపు చూసి ఆ తర్వాత మా మకాం వైపు దారితీశాం. మాకు వెనుకగా కొంతదూరంలో నాయకుడి అనుచరులు నడవసాగారు.

"ఆమె విషయం ఇంతటితో ఆపివెయ్యడం మంచిదను కుంటాను" అన్నాను.

"అంటే..." ప్రశ్నార్థకంగా చూశాడు నాయకుడు.

"ఈ విషయం అనవసరంగా వాళ్ళ నాయకుడికి చెప్పి ఆమె ప్రాణాలు తీయించేకంటే ప్రమాదపూరితమైన

ప్రయత్నం ఆపివేయడం గురించి చెప్పాను” అన్నాను.

“అప్పుడు ఆమె మళ్ళీ నీకోసం ప్రయత్నిస్తుంది. ఆమె మూలంగా నువ్వు ప్రమాదంలో ఇరుక్కోవడం నాకిష్టం లేదు. నీ అవసరం మాటటుంచి, నీ స్నేహం నాకు అవసరం. నిన్ను రక్షించుకోనేందుకు ఏమైనా చేస్తాను. ఆమె ప్రాణాలేకాదు. అలాంటివాళ్ళవి మరో పదిమంది ప్రాణాలుపోయినా ఫరవాలేదు” అన్నాడు నాయకుడు ఆవేశంగా.

నాకు ఆనందం కలిగింది.

కనీసం రెండురోజులపాటు ఆగమని బ్రతిమలాడాను. దానికీ అయిష్టంగా తలూపాడు నాయకుడు. అంతలో నా మకాం వచ్చేసింది. నన్నక్కడ వదిలేసి నాయకుడు, తన అనుచరులతో వెళ్ళిపోయాడు.

“నాయకుడు ఆక్కడిదాకావచ్చి లోనికి రాకుండా పోయారేం?” అడిగింది డెల్లా.

ఆమెకు అసలు సంగతి చెప్పడమా మానడమాని ఆలోచించాను. చెప్పడమే మంచిదనితోచింది. వివరంగా జరిగింది చెప్పాను.

“నాయకుడి స్నేహంకన్నా, మీకు ఆ అమ్మాయిప్రేమ ఎక్కువ అవసరం లాగుంది!” అంది అంతా విని డెల్లా.

“అలాంటి మాటలనకు. అనవసరంగా ఒక ఆడదాని ప్రాణాలు తీయించడం ఎందుకని బాధపడుతున్నాను.” అన్నాను.

“కులం కట్టుబాట్లు మరచి, కులంకాని మనిషితో కలుకుదామనుకోవడం పెద్ద తప్పుగాబట్టే నాయకుడు దానికి తగినశాస్తి చెయ్యాలని నిర్ణయించాడు. నువ్వు అనవసరంగా అడ్డంపోయావ్?” అంది డెల్లా.

డెల్లా ఆడది. అంతకన్నా ఎక్కువగా ఆలోచించగల దని నేననుకోలేదు. నాగరికత పెరిగిన సంఘంలో, జరిగే ఘోరాలు, నేరాలు గుర్తు తెచ్చుకుంటే ఆ ఆడమనిషి, చేస్తున్నదానిలో పెద్దతప్పు నాకు కనుపించలేదు. ఆమాట పైకి చెప్పి, డెల్లాతో రభస పెట్టుకోవడం నాకిష్టంలేదు. అందుకే మౌనంగా వుండిపోయాను.

“మనం ఇంక ఈ దీవిలో వుండి లాభంలేదు. త్వరగా వెళ్ళడం మంచిది” అంది డెల్లా.

“ఏం?”

“ఇప్పుడీ లేనిపోని గొడవలు నువ్వు తలపైకెత్తుకుంటు న్నావ్. కర్మకాలి ఆమెతో కలకడం ఎవరన్నా అడవి మనుషులు చూశారంటే ఏం జరుగుతుందో నువ్వే చెప్పావ్. అలాంటిదే జరిగితే నేను ఈ అడవిలో, ఈ మనుషులమధ్య చిక్కి చావల్సివస్తుంది. అలాంటి ప్రమాద పరిస్థితి ఏర్పడకముందే మనం వేరేదారి చూసుకోవడం మంచిది!” అంది డెల్లా.

నేనేం మాట్లాడలేదు అక్కడే వెల్లికిలాపడుకున్నాను. ఆకాశంలో చంద్రుడిన్ని, అతని చుట్టూ మూగివున్న చుక్కల్ని చూడసాగాను. డెల్లా లోపలికి వెళ్ళుతున్నట్లు, అడుగుల చప్పుడునుబట్టి ఊహించాను.

అలాచూస్తూ, రకరకాల ఆలోచనలుచేస్తూ, నాకు తెలీకుండానే నిద్రలోకి జారిపోయాను.

ఉన్నట్టుండి నా చెంపల కేదో చల్లగా తగిలింది. కళ్ళు తెరుద్దామనిపించింది, కానీ రెప్పలు విడివడటం లేదు. నా గుండెలపైన ఏదో అటూ ఇటూ ఆడింది. అదేమయిందీ అర్థం కాలేదు. కానీ కదులుతున్న దండని వూహించాను.

ముక్కుకు ఘాటైన వాసన సోకింది. అది నసాళానికంట గానే నాలో జాగృతమౌతున్న చైతన్యం, తిరిగి మత్తులో కొరిగిపోతున్నట్లయింది. మరుక్షణంలోనే ఏమవుతున్నదీ తెలియలేదు.

కళ్ళు తెరచాను. చూశాను. పైన దట్టమైన ఆకుల్లో అల్లిబిల్లిగా అల్లుకుపోయిన చెట్ల కొమ్మలు కనుపించాయి. ఠక్కున లేచి కూర్చున్నాను. చుట్టూ చూశాను. అడవి మధ్యలో వున్నట్లు తెలుసుకొన్నాను.

ఇంటి దగ్గర పడుకొన్న మనిషిని, ఇక్కడికెలా వచ్చానా అని ఆశ్చర్యపోతున్నంతలో, ఆమె చెట్టు చాటు నుండి రావడం కనుపించింది.

"నువ్వా?" అన్నాను ఆశ్చర్యంగా.

"ఆఁ! నేనే!" అంది నవ్వుతూ.

"నేనిక్కడికెలా వచ్చాను?"

"నువ్వు రాలేదు. ఆకుపసరుతో మైకం కలిగించి, నేనే మోసుకొచ్చాను." అందామె.

"ఇంత దూరం నువ్వే మోసుకొచ్చావా?"

"ఆఁ!"

"ఎవరూ చూడలేదా?"

"మీ గూడెం మనిషిని కాపలా పెట్టినట్టున్నాడే నాయకుడు. వాడు చూశాడు. నన్ను ఆపేందుకు ప్రయత్నించాడు. కానీ నేనే జయించాను" అంది. ఆమె మాటలు నాకు అర్థం కాలేదు.

"ఎలా జయించావ్?"

"నా రహస్యం తెలుసుకున్నాక అతను బ్రతకడం ప్రమాదకరం. అందుకనే చంపేశాను" అందామె.

"చంపేశావా?"

"చెప్పాగా ముందే" అంది మళ్ళీ.

"ఎందుకిలాంటి సాహసం చేశావ్? దీంతో నీ రహస్యం అందరికీ తెలిసిపోతుంది. ఆ తర్వాత నిన్ను చంపుతారు, దానివల్ల నీకు వచ్చేదేమిటి?" అన్నాను.

"అది సరే! ఆ నాయకుడికి నువ్వు నా సంగతి చెప్పావా?" అనుమానంగా అడిగింది.

"లేదే!" అన్నాను.

"చెప్పకుంటే అతను నీ వెంట ఎందుకొచ్చాడు? నన్ను నువ్వు వుండమన్నచోట అంతసేపు ఎందుకాగి చుట్టూ చూశాడు?" అడిగింది.

ఆమె ప్రశ్నలకు సరయిన జవాబు చెప్పడం కష్టమని తెలుసు నాకు. అందుకే ఆలోచించి "ఏమో! నాకు తెలీదు. తెలుసుకోవాలంటే అతన్నే అడుగు" అన్నాను.

"ఇన్నాళ్ళు లేనిదీ, ఇప్పుడే క్రొత్తగా తన మనిషిని నీ మకాం ముందు కాపలా వుంచాడు. వీట్ని బట్టి చూస్తే నన్ను వదిలించుకోవడానికి నువ్వే ఈ ఏర్పాట్లన్నీ చేయించు కొన్నట్లున్నావ్?"

"లేదు! అలాంటిదేమీ లేదు" అన్నాను. ఆమె ఒక హత్య కూడా చేసిందని తెలిశాక భయం కూడా పుట్టింది.

"ఏది ఏమయినా, నువ్వు నాకు కావాలి! ఈ ప్రయత్నంలో నా ప్రాణాలే కాదు, మీ ప్రాణాలు పోయినా నాకు లెఖ్ఖ లేదు. ఎవ్వరూ నన్ను ఆపలేరు" అందామె.

అర్ధరాత్రిపూట వచ్చి, నన్ను మైకంలో తోసి, ఇంత దూరం మోసుకు రాగలిగిన మనిషి, అడ్డమొచ్చిన మనిషిని అమాంతం హత్య చెయ్యగలిగిన మనిషి, ఎంతకయినా తెగించగలదనీ, ఎంత సాహసమైనా చెయ్యగలదనీ, తెలిసి పోయింది.

ఆమె కోరిక తీర్చకుండా అక్కడినుండి తప్పించుకొని పోవడం అసాధ్యం. అలాగని ఆమె కామవాంఛల జ్వాలలు ఆర్పేందుకూ, నాకు మనస్సు రావటంలేదు. మరోమారు నయాన ఆమె జేస్తున్న తప్పు ఎంత ప్రమాదకరమో చెప్పి చూద్దామనిపించింది.

మళ్ళీ ఆ విషయం ఎత్తాను.

ఆమె విసుగ్గా చూచింది నాకేసి. ఆ తర్వాత "ఎందుకిలా మాటల్తో అనవసరంగా కాలం ఖర్చు పెడతావ్! గూడెం వెళ్ళేప్పుడే నా కోరిక తీర్చి వుంటే, ఈ రభస జరిగేదే కాదు! రోజూ ఆ టయిమ్‌కు నీ కోసం అక్కడికొస్తాను. పది నిముషాలు నన్ను సుఖపెట్టు. నీకు ఏ ప్రమాదం రాకుండా చూస్తాను" అంది ఆమె.

ఇక వాదించి లాభం లేదని తేల్చుకున్నాను. యాంత్రికంగా ఆమెను సుఖపెట్టాను. నవ్వి వెళ్ళిపోయింది. నేను దారి వెతుక్కుంటూ అడవికి అడ్డంపడి చీకట్లో, చెట్ల క్రింద నడచుకొంటూ నా మకాం చేరాను. నేను అడుగెట్టేసరికి డెల్లా కూర్చుని వుంది.

"గంటనుంచి చూస్తున్నాను. ఎక్కడికెళ్ళావ్?" అడిగింది డెల్లా.

ఏం చెప్పనూ తోచలేదు.

మాట్లాడకుండా వెళ్ళి ప్రక్కన కూర్చున్నాను.

"ఇంత సేపూ ఏం చేస్తున్నావ్?"

"ఏంతోచక అలా వెళ్ళాను" అన్నాను.

డెల్లా అనుమానంగా చూసింది.

"కాదు! నన్ను వదలిపెట్టి వెళ్ళిపోదామనుకునివుంటావ్. కొంతదూరంపోయాక ఏదో అవాంతరం వచ్చి వుంటుంది.

"ఛా! అదేంలేదు. నిన్నువదలి ఎలా వెళ్తాను?"

"అయితే ఎక్కడికి కళ్యాణ్?" అడిగింది ఘట్టిగా.

అంతకుముందు చెప్పిన మాటే మళ్ళీ చెప్పాను.

"రాజ్! నన్ను వెర్రిదాన్ని చేసి ఆడించాలనుకోకు. మనం ఇన్నాళ్ళు కలిసి కష్టాలుపడ్డాం. నీకు ఎందుకనో ఈ ఆడవి మనుషుల్తో ఈ అడవిలోనే వుండాలన్న కుతూహలం ఏర్పడింది. దానికి కారణాలు నాకు తెలియలేదు. నాకది ఇష్టంలేదు. నన్నెలా వదలించుకోవాలాని దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లున్నావ్. నీ కంత బాధ అవసరంలేదు. నీ దోవన నువ్వు వెళ్ళిపో, నేను ఇవాళే వెళ్ళిపోదలచుకున్నాను" అంది డెల్లా.

"పోతావా? ఎక్కడికి? ఎలాపోతావ్?"

"అది నీ కనవసరం! చాతనయితే నాదేశం వెళతాను, లేకుంటే సముద్రంలోపడి ఛస్తాను" అంది డెల్లాకోపంగా.

ఆమెకు ఏం చెప్పాలో, ఎలా నమ్మించాలో, ఓదార్చాలో అర్థంగాక అయోమయంగా చూస్తూకూర్చున్నాను.

డెల్లా మాట్లాడకుండా పడుకుంది. రెండుసార్లు పిలిచాను. పలకలేదు. నేనూ మెల్లిగా పడుకున్నాను. తెల్లవారింకాకా మేలుకునే వున్నాను. కాలకృత్యాలు ముగించుకొని, "నేను గూడెం వెళుతున్నాను" అన్నాను డెల్లాతో.

"నీ యిష్టం! నాతో చెప్పవలసిన అవసరంలేదు!" అంది కోపంగా.

"ఎందుకు వెళుతున్నానో తెలుసా?" అడిగాను.

"నాకు చెప్పొద్దు!"

"లేదు డెల్లా! నీ మనస్సు కష్టపెట్టడం నాకు అయిష్టం. నువ్వు కోరినట్లే మనం ఒకటి రెండు దినాల్లో ఎక్కడ

నుండి మకాం ఎత్తేద్దాం. దాన్ని గురించి నాయకుడితో మాట్లాడేందుకు వెళుతున్నాను'' అన్నాను.

మాట్లాడకుండా మౌనంగా చూసింది డెల్లా. ఇక ఆమెకు నచ్చచెప్పటానికి ప్రయత్నించినా ఫలితం వుండదన్న అభిప్రాయంతో వెలుపలకొచ్చాను.

గూడెంవేపు నడవసాగాను.

రాత్రి జరిగిన సంఘటన గుర్తుకొచ్చింది, ఆ ఆడమనిషి చాలా ప్రమాదకరమయిన వ్యక్తి. ఆమెనుంచి తప్పించుకోకుంటే, ప్రాణాలు పోవడం ఖాయం. తప్పించుకునేందుకున్నది ఒక్కటే మార్గం. అది ఈ దీవినుండి వెళ్ళిపోవడమే. నాయకుడితో జరిగిందంతా చెప్తే, అతను ఆమెను శిక్షించేందుకు ప్రయత్నిస్తాడు తప్ప, నన్ను వెళ్ళనివ్వడు. అతని సాయం లేకుండా వెళ్ళాలి. ఎలా వెళ్ళడమాని ఆలోచించాను.

ఏదైనా స్టీమరువస్తే బాగుండుననిపించింది. అది వచ్చేదాకా వెళ్ళి సముద్రంలో ఎదురు చూద్దామనుకున్నాను. అక్కడికి నాయకుడి మనుషులు వెతుక్కుంటూ రావచ్చు. తాము సులభంగా చిక్కిపోతారు. వేరే పథకంకోసం ఆలోచించాను. అంతలో గూడెం వచ్చింది.

నాయకుడి ఇంటిముందు అడవి మనుషులంతా నిలబడి వున్నారు. నేను వాళ్ళను తప్పించుకొని వెళ్లాను. నాయకుడు కూర్చుని వున్నాడు. అతని కాళ్ళ దగ్గర అడవి మనిషి శవం వెల్లకింతలా పడివుంది. శవం గుండెలో పొడవుపాటి అమ్ము దిగబడివుంది.

నన్ను చూడగానే నాయకుడు దగ్గరకు రమ్మని చెయ్యి ఊపాడు.

వెళ్ళి నిలుచున్నాను ప్రక్కనే.

"ఏమిటిది? ఎవరు చంపారు అతన్ని?" అడిగాను.

"అదే అర్థం కావటంలేదు. రాత్రి అతను నా వెంట వచ్చాడు నీ మకాంకు. తిరిగివచ్చేటప్పుడు, నీకు రక్షణగా వుండమని కాపలా పెట్టి వచ్చాను" అన్నాడు నాయకుడు.

"నాకు మరి రాత్రిచెప్పలేదే?"

"నీకు తెలీకుండా వుండాలని కావాలనే చేశాను."

"ఎవరు చంపారో తెలిసిందా?"

"తెలీలేదు. కాని ఆ అమ్ము చూశావా? అది మా మనుషులు ఉపయోగించేదే. దాన్నిబట్టి ఎవరో మా గుంపు లోని వాళ్ళే ఈ ఘోరంచేసి వుండాలనిపిస్తుంది. అందర్నీ సమావేశపరచాను. అడిగాను. ఎవ్వరూ ముందుకొచ్చి నేరం ఒప్పుకోవడంలేదు. ఇలాంటి విచిత్రం మా తెగలో పది తరాలనుండి జరగలేదు. ఎవరయినా తప్పుచేస్తే వచ్చి చెప్పుకొని నాయకుడి కాళ్ళపైన పడిపొయ్యే వాళ్లు ఈ మారు అలా జరగకపోవటం వింతగానూ, విచిత్రంగానూ వుంది" అన్నాడు నాయకుడు. ఆ మాటలు చెపుతూంటే, అతని కళ్ళల్లో, కోపం, అవమానం, కొట్టొచ్చినట్లు కను పించాయి.

నాకు తెలుసు అసలేం జరిగిందో, రాత్రి నన్ను పొందా లని వచ్చిన ఆడమనిషే అతన్ని చంపింది. కానీ ఆమెకు ఈ గుంపు వాళ్ళు వాడే బాణం ఎలా దొరికివుంటుందాని ఆలోచించాను.

అప్పుడు గుర్తొచ్చింది, నాయకుడు నా ఆత్మరక్షణ కోసం ఇచ్చిన బాణం అమ్ముల విషయం. ఆ తర్వాత హత్య ఎలా జరిగివుంటుందో ఊహించేందుకు పెద్ద ఆలోచన అవ సరం లేకపోయింది.

రాత్రి జరిగిన దంతా చెప్తే నాయకుడు బహుశా తన గుంపులోని వాళ్ళను అనుమానించడం మానివేసి, ఆ ఆడ మనిషికి తగిన శిక్ష లభించే ప్రయత్నం చేస్తాడను కున్నాను. కానీ అందరి మధ్య నేను అల్లరిపాలు కాక తప్పదు. చెప్పడమా, మానడమాని ఆలోచిస్తూ కూర్చు న్నాను.

శవాన్ని అక్కడినుంచి తరలించమని పురమాయిం చాడు. రాత్రికి అందర్నీ కొండదేవత విగ్రహం ముందుకు రమ్మన్నాడు.

అందరూ వెళ్ళిపోయారు.

"ఈ నేరం ఎవరు చేసిందీ ఎలా తెలుస్తుంది?" అడి గాను.

"రాత్రికి దేవతకు పూజచేస్తాను. ఆమె ముందు ఆకాశ మెత్తున లేచే మంటలు వేస్తాము. ఒక్కొక్కర్నీ మంట లోకితోస్తాం. తప్పుచెయ్యనివాడికి ఏ విధమైన ప్రమాదం గానీ, గాయాలుగానీగావు. అలా గాయాలు అయినవాడే హంతకుడు. వాడ్ని ఆ మంటల్లోనే వేసి దహనం చేస్తాను" అన్నాడు నాయకుడు అక్కసుతో.

విచిత్రంగా తోచింది నాకు. మంటల్లో ఎవరు చిక్కు కున్నా గాయాలు కావడం నిజం. అలాంటప్పుడు అసలు హంతకుణ్ని ఆ పద్ధతిలో గుర్తించటానికి చేసే వీళ్ళ ఘోరమైన పద్ధతి, ప్రయత్నం నన్ను భయకంపితుణ్ణి చేశాయి.

"ఇంతకు ముందెప్పుడన్నా ఈ పద్ధతిలోనే నేరస్తుణ్ణి కనిపెట్టారా?" అడిగాను.

"నా హయాంలో ఇంతదాకా అలాంటి సమస్య గాలేదు. ఇదే మొదటిసారి. కానీ మా గూడెంవాళ్ళు

అనుసరించవలసిన పద్ధతిమాత్రం ఇదే!" అన్నాడు నాయకుడు.

"మంటల్లోకి మనిషి దూకితే శరీరం కాలకుండా ఎలా వుంటుంది?" అడిగాను.

"నిరపరాధిని కాపాడే బాధ్యత మా కొండదేవతకు అప్పగిస్తాను. ఆమె సత్యమే వాళ్ళని కాపాడాలి" అన్నాడు నాయకుడు.

"విచిత్రంగా వుంది" అన్నాను.

"మేమే విచిత్రం మీకు. మా పద్ధతులు విచిత్రంగా గాక మరెలా వుంటాయి. రాత్రికి నువ్వు రా! చూద్దూగాని. మా కొండదేవత ఎంతసత్యమైందో, ఆమె మమ్మల్ని ఎంతగా కాపాడుతూంటుందో తెలుసుకొందువుగాని" అన్నాడు నాయకుడు.

"అలాగే!" అన్నాను.

అప్పుడు గూడా అసలు నిజం చెప్దామనుకొన్నాను. కాని నాయకుడు నన్నూ అనుమానించవచ్చు. లేనిపోని చిక్కుల్లో పడతానని భయమేసింది.

ఆ తర్వాత విస్కీ త్రాగాం ఇద్దరం. మాటలమధ్యలో అన్నాను "త్వరలో వెళ్ళిపోదామనుకుంటున్నాను."

తలెత్తి నావేపు చూశాడు నాయకుడు.

"ఈ విషయం గురించి నువ్వు పదే పదే నాకు చెప్పి ప్రయోజనంలేదు. నా కిష్టమైనప్పుడు అన్ని ఏర్పాట్లుచేసి పంపుతాను" అన్నాడు నాయకుడు కృతనిశ్చయంతో.

ఏం చెప్పినా లాభంలేదని తెలిసొచ్చాక, వుండి ప్రయోజనం లేదని లేచాను వెళ్ళిపోదామని.

"రాత్రికిరా! తప్పకుండా."

"వస్తాను" అన్నాను.

పెట్టనుకూడా తీసుకురా! మన గుంపులోని ఆడమనిషి మొత్తం వస్తుంది” అన్నాడు నాయకుడు.

“చెప్తాను. వస్తానంటే తీసుకొస్తాను” అని లేచాను.

చిక్కటిచెట్ల సందునున్న కాలిబాటన నడుస్తూ ఆలోచించసాగాను. నా పరిస్థితి అడక త్తెరలో పోకలా తయారయింది. ఇంతకుముందు డెల్లా ఒక్కతే ఇక్కడనుండి పారిపోదామని పోరు చేసేది. ఇప్పుడీ అడవిమనిషి నన్ను ఉచ్చులో బిగించింది. కనీసం ఆమెబారినుండి తప్పించుకొనేందు కయినా పారిపోక తప్పదనిపించింది. ఎలా పోవాలి? ఎటు పోవాలి? అన్నవే నా ముందున్న సమస్యలు.

గుడిసెలోకి అడుగుపెట్టి మౌనంగా కూర్చున్నాను.

“ఏమిటలా మౌనంగా వున్నావ్?” అడిగింది డెల్లా.

“మనం పారిపోదాం!” అన్నాను.

“నిజంగా గా?”

“ఆఁ!”

“ఎప్పుడు?”

“ఈ రాత్రికే. ఇంక ఆలస్యంచేసి లాభంలేదు. ఈ రాత్రి దాటిందంటే బహుశా మనమీ దీవినుండి అసలు తప్పించుకోవడం అసాధ్య మనుకుంటాను— అదే ప్రాణాలతో...?” అన్నాను.

“ఎందుకని?” అడిగింది డెల్లా.

“ఆ వివరాలు అడక్కొద్దు. తర్వాత తాపీగా చెప్తాను. మనకు అవసరమయ్యే సామానులు, కొద్దిగా ఆహారం, కాసిని మంచినీళ్లు, విస్కీ, సిగరెట్లు మొత్తం పాక్ చేసి పెట్టు. నీది నాది తుపాకీ కూడా తీసుకెళ్దాం.”

“సరే! నాయకుడికి చెప్పావా?”

"లేదు."

"అతని మనుషులు మనల్ని వెంటాడితే ఏం చెయ్యాలి?"

"తుపాకులు తీసుకెళ్ళేది వాళ్ళ కోసమే."

"అంటే వాళ్ళను కాల్చి చంపడమేనా?"

"అంతకన్నా మరో మార్గం లేదు!" అని సామానులు సర్దేపనిలో మునిగిపోయాను. డెల్లా కూడా నాకు సాయం చెయ్యసాగింది. గంటలోనే మా సర్దడం పూర్తయింది.

చీకటి పడగానే బయలుదేరదలచుకున్నాను. నేను కొండదేవత వద్దకు రాలేదని నాయకుడు పసిగట్టి తన మనుషుల్ని నాకోసం పంపేలోగా, నేను డెల్లా సముద్రంలో అంతకు ముందు దొంగతనం చెయ్యడం కోసం వెళ్ళిన కొండ ప్రాంతాలకు వెళ్ళాలని తీర్మానించుకున్నాను. అంతదాకా పోవడం వరకే నేను ఆలోచించగలిగాను. ఆ తర్వాత ఏమవుతుందన్నదీ, ఏం చెయ్యాలి అన్నదీ నాకు తెలీలేదు. మా భారం భగవంతుడిపైన వెయ్యడంకన్నా చెయ్యగలిగింది కూడా ఏమీ వున్నట్టు తోచలేదు.

వెలుతురు తరిగిపోతూ చీకటి దాన్ని సన్నగా చీల్చుకుంటూ రాసాగింది. డెల్లా, నేనూ మౌనంగా గుడిసె వెలుపల కూర్చున్నాం. మా కిద్దరికీ మొయ్యగలిగినంత బరువున్న రెండు సంచీలున్నాయి. వాటికి తోడు తుపాకీలు కూడా వున్నాయి.

నాకు కొండ దేవత ముందు రాత్రికి జరగబోయే తతంగం గుర్తొచ్చింది. అడవి మనిషిని చంపిన హంతకుణ్ణి ఆ దేవత పట్టి ఇస్తుందన్న వాళ్ళ నమ్మకంలో అర్థం కనుపించకపోయినా, పూర్తిగా కొట్టిపారవేసే స్థితిలో లేను నేను. అందరివంతూ [illegible]

ముందుకు పంపితే, ఆ హత్యకు నేను కారకుణ్ణని ఏదయినా సంకేతం ద్వారా నాయకుడికి తెలుపుతుందేమో ఆమె అన్న భయమే, పారిపోయే ప్రయత్నానికి నన్ను పూర్తిగా పురికొలిపింది.

చీకటి దట్టంగా పేరుకుంది.

సంచీతీసి భుజాన వేసుకొని, తుపాకి ఎత్తిపట్టుకొని, "బయలుదేరు పోదాం!" అన్నాను డెల్లాతో.

నాలాగే డెల్లా కూడా సామాను ఎత్తుకొని బయలుదేరింది. ఇద్దరం మాటా, పలుకూ లేకుండా, చుట్టూ చూసుకుంటూ, నడవసాగాం సముద్రం వైపు. గంట తర్వాత సముద్ర తీరం చేరుకున్నాం.

"అమ్మయ్య!" అన్నాను సముద్రం చూడగానే.

"మనల్ని ఎవరూ చూచినట్లు లేదు" అంది డెల్లా.

"ఈ ప్రాంతాల్లో అడవి మనుషులు సముద్ర దొంగతనాల కోసం వాడే డింగీల్లాంటివి వున్నాయి. వెతికి వస్తాను. నువ్వు ఇక్కడే వుండు" అంటూ సంచీ తీసి క్రింద పెట్టాను.

"ఒంటరిగా వుండాలంటే భయంగా వుంది. నేను కూడా వస్తాను" అంది డెల్లా.

"ఇప్పుడే వచ్చేస్తాను. భయపడవలసిన అవసరంలేదు." అంటూ ధైర్యం చెప్పాను.

అయిష్టంగానే ఆగిపోయింది డెల్లా అక్కడ.

నేను తుపాకీ ఊపుకుంటూ నీళ్ళ అంచునే ముందుకు నడిచాను. ఫర్లాంగు దూరం వెళ్ళాక కనుపించాయి ఇసుకలో కూరుకొని వున్న డింగీలన్నీ. మెల్లగా వాటి మధ్యకు వెళ్ళాను.

అక్కడ కనుపించిన దృశ్యం నన్ను అప్రతిభుణ్ణి చేసి వేసింది. చైతన్యం నశించింది. కళ్ళు బైర్లు కమ్మాయి. నోట మాట రాలేదు.

"ఎందుకలా వణుకుతున్నావ్? ఎవరో కాదు. నేనే!" అందామె డింగీలో కూర్చుని నవ్వుతూ.

"నువ్వా! తెలుస్తున్నావ్. ఇక్కడి కెందుకొచ్చావ్?" అడిగాను.

"నీ కోసం!" అందామె.

"నా కోసమా? ఎవరు చెప్పారు ఇక్కడి కొస్తానని?" అడిగాను కోపంగా.

"ఎవ్వరూ చెప్పలేదు. నేనే చూశాను. వెంటబడి వచ్చాను." అందామె మళ్ళీ నిర్వికారంగా.

నాకేం చెయ్యాలో తోచలేదు. ఆమె మమ్మల్ని వెంటాడి వచ్చింది. ఎప్పట్నుంచి నన్ను గమనిస్తుందో మరి. నా మకాం నుండి బయలుదేరాక వెనుకా ముందూ, చూసుకుంటూనే వచ్చాను నేను. ఏవిధమైన అలికిడీ వినిపించలేదు. అంటే నేను సముద్రం వైపు నడవడం గమనించి, అడ్డదారిన ఆమె డింగీల వద్దకు చేరివుండాలనుకున్నాను.

"మమ్మల్ని వదిలిపెట్టి వెళ్ళిపోవాలని బయలుదేరావా?" అడిగింది ఆమె దిగులుగా.

"అవును. నిజానికి కొన్నాళ్ళు ఇక్కడ వుండి వెళ్దామనుకున్నాను. కానీ నీవల్లే ఇలా వెళ్ళిపోవలసి వచ్చింది. నువ్వు చేసిన ఘోరానికి మా నాయకుడు ఈ రాత్రికి అందరినీ కొండ దేవత ముందు హాజరు పరచాడు" అన్నాను.

"ఇలా వెళ్ళడం నేను ఒప్పుకోను. ఎవ్వరూ చూడ లేని చోట నిన్నూ, నీ పెట్టెను దాచిపెడతాను. మీకు అన్నీ నేను చూస్తాను. నా వెంట రండి" అందామె.

"మమ్మల్ని వదిలెయ్యి. జరిగింది మర్చిపో" అన్నాను నిష్కర్షగా.

"ఇక్కడ్నించి ఈ డింగీలో ఆ కొండదాకా వెళ్ళగలరు' ఆ తర్వాత వెళ్ళలేరు. వెనక్కి వస్తే మీ గూడెంలోని నాయకుడు తన్ను మోసంచేసి పారిపోయినందుకు ఇద్దర్నీ నిలువునా నరికేస్తాడు. అంటే చావు తప్పదు. వెనక్కి రాకున్నా, ఆ కొండపైన రెండ్రోజులు ఉంటారు. చలికి చచ్చిపోతారు. ఎటూ చావు తప్పనప్పుడు, నా మాట విని వెంట రావటం మంచిదిగదా! కనీసం కొన్నాళ్ళ పాటయినా మీకు ఏ భయం లేకుండా బ్రతికే ఏర్పాటు చేయగలను నేను." అందామె వాళ్ళ భాషలోనే.

ఆమెకు శరీరంలో ఏనుగులాంటి బలం తప్ప మెదడులో తెలివి లేదనుకున్న నా అంచనా తారుమారయినందుకు నవ్వులాంటి ఏడుపొచ్చింది.

"నువ్వెన్ని చెప్పినా లాభం లేదు. మేము వెళ్ళి తీర వలసిందే" అన్నాను దృఢమైన నా నిశ్చయాన్ని తెలియ బరుస్తూ.

"ఎలా వెళ్తారో చూస్తాను!" ఆమె కూడా అంది మొండిగా.

"ఆపుతావా?"

"ప్రయత్నిస్తాను. కాదని వెళ్ళావంటే తెల్లారేలోపల మీ నాయకుడ్ని, అతని మనుషుల్ని మొత్తం నీ మీదకు తరుముతాను. నువ్వెటూ ఆ కొండ దగ్గర వుంటావ్. ఆ పైని జరిగేది నువ్వే చూద్దువుగాని," అంది ఆమె.

ఆలోచించాను క్షణంసేపు. ఆమెవి ఉత్త మాటలు కాదు. అనుకున్నది సాధించే తత్త్వం ఆమెది. ఆ విషయం నాకు ముందే ఋజువయి వుంది.

"ఇక్కడే వుండు. నా పెట్ట దూరంగా అక్కడ కూర్చోనుంది. ఆమెతో కూడా మాట్లాడి వస్తాను" అన్నాను.

"అలాగే! వెళ్ళిరా!" అంది.

అక్కడ్నుంచి కదిలాను డెల్లా వేపు.

డెల్లాకీ విషయం చెప్పి ప్రయోజనం లేదని నాకు తెలుసు. ఆమెకు నాపైన ముందునుండే కోపంగా వుంది. ఈ ప్రమాదం నుండి తప్పించుకోవాలంటే ఒకటే మార్గం కనిపించింది. అది ఆమెని హతమార్చడం.

ఆడమనిషి! అన్యాయంగా హత్య చెయ్యడానికి మనస్సు వెనకాడింది. ఆమె ఒక్క ప్రాణం కన్నా, మా రెండు ప్రాణాలు కాపాడుకోవడం మేలని కూడా అనిపించింది. నా దగ్గర తుపాకీ వుంది. దాంతో కాల్చి చంపడం సులభం. అంతకన్నా ఆమె నుండి తప్పించుకోనేందుకు మరో మార్గం కూడా కనిపించలేదు.

"ఇంత సేపయిందేం?" అడిగింది డెల్లా.

జరిగిందంతా చెప్పాను మొదటిసారిగా ఆమెకు. వింటూంటే ఆమెకు నాపై చెప్పలేనంత కోపం రావడం గమనించాను.

"మనకేం దారి?" అడిగింది.

"ఆలోచించాను. ఆమెను చంపడంకన్నా మరో మార్గం లేదు!" అన్నాను.

"వెళ్తూ వెళ్తూ ఒక ఆడమనిషిని హత్య చేసి పోవాల్సిందేనా?" తన అయిష్టం తెలిపింది.

ఆ విషయం గురించి చర్చించి ప్రయోజనం లేదని మానేసి ఆమెను బయలుదేరమన్నాను. సంచీ పుచ్చుకొని బయలుదేరింది. నా సంచీ కూడా ఆమెను పట్టుకో మన్నాను. తుపాకీ సరిచేసి పెట్టుకొన్నాను. సేఫ్టీ కాచ్ రిలీజ్ చేశాను.

ఇద్దరం డింగీల వైపున నడిచాం.

దూరం నుంచే చూశాను. ఆమె అంతకు ముందున్న చోటే నిలబడి మాకేసి చూస్తూ వుంది.

భగవంతుణ్ణి మనస్సులో తలచుకుని, కళ్ళు మూసుకొని, ఆమెకు గురి చూసి ప్రేల్చాను.

వరుసగా ఆరు తుటాలు వర్షంలా ఆమె వేపు పరుగెత్తాయి.

నెత్తురు మడుగులో వుంటుందామె. ఆ దృశ్యాన్ని చూసే ధైర్యంగానీ, తెగింపుగానీ, నాకు లేవు. కళ్ళు ఘట్టిగా మూసుకున్నాను.

"అదిగో ఆమె తప్పించుకుంది!! పారిపోతూంది!!!" అరచింది పెద్దగా.

నా గుండెలు జారిపోయాయి.

హడావుడిగా కళ్ళు తెరచాను. ఆమె దూరంగా కుందేలుకన్నా స్పీడుగా కుప్పిగంతులు వేసుకుంటూ సునాయాసంగా పరుగెత్తుకు పోవడం కనుపించింది.

ఆమె వైపు కురికాను. మరో రెండు రౌండ్లు ప్రేల్చాను. అవీ వ్యర్థమైనాయి. ఆమె ఎప్పుడో మాయమయింది.

తిరిగి వచ్చాను డెల్లా వద్దకు.

"వెళ్ళిపోయింది కదూ?" అడిగింది.

(ఇంకా వుంది)

## సప్లిమెంట్ పోటీ - 12.

92, 93, 94, 95, 96 — అంకెలను తీసుకొని మీకు నచ్చిన వరుసక్రమంలో, ఈ క్రింది గళ్ళను పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డుసైజు తెల్ల కాగితంపై వ్రాసి, దానితో 70 పైసల స్టాంపులు జతపరిచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేరేటట్లు పంపండి.

| | | | | |
|---|---|---|---|---|
| | | | | |

మా ఆఫీసులో సీలుచేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఏడాదిపాటు 'సప్లిమెంట్' ఉచితంగా పంపుతాం. ఫలితాలు నవంబర్ '75 నెల మాసపత్రికలో చూడండి.

## ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంటు" ముఖచిత్రాలు పరిశీలించండి. రెండింటికి సంబంధం ఉండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని, చక్కటి వ్యాఖ్యలు ఒక పోస్టు కార్డుసైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 10 వ తేదీ లోపు మాకు చేరేట్లు పంపండి. 'హోమ్ డెలివరీ సభ్యులు తమ సభ్యత్వము నెంబరు వ్రాస్తేచాలు. సభ్యులు కానివారు తమవాఖ్యలతో 30 పైసలు స్టాంపులుపంపాలి.

మాకు నచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రూ. 20 లు నగదు బహుమతి పంపుతాము. ఫలితాలు వచ్చే నెల మాసపత్రికలో చూడండి.

## మీరే ఎన్నుకోండి ?

ఈ "సప్లిమెంటు"లో మీకు బాగా నచ్చిన నవల పేరును ఒక పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల10 వ తేదీ లోపు మాకు పంపండి. హోమ్ డెలివరీ సభ్యులు తమ నెంబరు తప్పక వ్రాయాలి. ఇతరులు తమ జవాబుతో ఈ కూపన్ క త్తిరించి పంపాలి. ఉత్తమ నవలకు రూ. 116 లు బహుమతి. —ఎడిటర్

## 60

"ఎవరి కోసం? ఎవరి కోసం? ఈ ప్రేమ మందిరం" పాడుకుంటున్నాడు సుబ్బారావ్ తన ఇంట్లో పడుకొని.

"మున్సిపాల్టీ వాళ్ళకోసం! పన్ను కట్టలేదట. ఎవరొచ్చారో చూడు" విసురుగా వినబడింది తండ్రి కంఠం వీధిలోంచి.

* * *

సెట్‌లోంచి విసురుగా వచ్చింది ప్రఖ్యాతి నటీమణి శ్రీవాణి. "ఏమండీ! హీరోగారు బాగా తాగారు." కోపంగా అంది డైరక్టర్‌తో.

"క్షమించమ్మా. సహజత్వం కోసం మేమే తాగించాం. ఏమైనా అసభ్యంగా ప్రవర్తించారా ఆయన?"

"అది కాదండీ, అరగంట నుంచి చూస్తున్నా! ఆ స్థంభాన్నే గట్టిగా కౌగలించుకొని ఏడుస్తున్నారు ఆయన!"

* * *

ఓ రోజు విశ్వనాథం నాదగ్గర కొచ్చేడు.

"ఒరేయ్! నిన్న సైకిల్ మీద గాంధీ నగరం వెడుతుంటే డాబా మీద కూర్చొని ఓ అందమైన అమ్మాయి శూన్యంలోకి చూస్తూ కనబడిందిరా! ఆమె నెలాగైనా ప్రేమించాలి. ఏదైనా సలహా ఇవ్వరా!" అడిగాడు అర్థింపుగా.

నేను ఓ నిముషం ఆలోచించి "ఈ రోజుకూడా అటు వైపు వెళ్లు. ఆమె నిన్ను చూసేదాకా ఆగి ఓ నవ్వు విసిరెయ్‌। ఆమె కూడా నవ్వితే పచ్చ దీపం వెలిగినట్లే। అప్పుడు రా। తర్వాత ఏం చెయ్యాలో చెబుతాను." అన్నాను.

మర్నాడు విశ్వనాథం ఒగర్చుకొంటూ నా రూమ్‌కి వచ్చేడు.

"ఏరా? నువ్ నవ్వగానే ఆ అమ్మాయి కూడా నవ్విందా?" ఆతృతగా అడిగాను.

"నవ్వింది. కాస్సేపేం ఖర్మ. ఓ పావుగంట—విరగబడి నవ్వింది. ఆ అమ్మాయి పిచ్చిదట।" అన్నాడు విశ్వనాథం ఆముదం తాగిన మొఖం పెట్టి.

—ముద్దా సురేష్, కాకినాడ.

## 61

క్రొత్తగా క్లినిక్ తెరిచిన డాక్టరు సూరిబాబు దగ్గరకు, అందమైన అబ్బాయిలు అమ్మాయిలు వచ్చారు.

డాక్టర్. అబ్బాయినుద్దేశిస్తూ ఇలా అన్నాడు: మీరు తీసుకొచ్చినావిడ్ని పూర్తిగా పరీక్ష చేసాను, మీకో గుడ్ న్యూస్ చెప్పేముందు మీ పేర్లు తెల్సుకోవాలని వుంది.

అబ్బాయి:- నా పేరు శ్యాంకుమార్.

డాక్టర్:- మీ ఆవిడగారి పేరు?

అబ్బాయి:- శారద.

డాక్టర్: (నవ్వుతూ) కంగ్రాచ్యులేషన్సు మిష్టర్ శ్యాంకుమార్‌గారూ। మిసెస్ శారదాశ్యాంకుమార్‌గారు, త్వరలోనే మీకో పాపాయిని అందివ్వబోతున్నారు.

అబ్బాయి:-(కందగడ్డలా తయారయిన మొహంతో) సారీ డాక్టర్‌గారు! యీవిడ నా మిసెస్‌గాదు, నా చెల్లెలు, కుమారి స్వరూప రాణి!

* * *

ఒక స్టేజి మీద గంభీరమైన ఉపన్యాసం దంచుతున్నాడో పెద్ద మనిషి. "యీ దేశం కోసం నే నేమైనా చేస్తాను ఏమైనా యిస్తాను."

అంతే, జనంలో కల్లోలం బయలుదేరింది. ఈలలు, చప్పట్లు కొయ్, కొయ్, అరుపులు.

ఉపన్యాసమిస్తున్న పెద్ద మనిషి రెచ్చిపోయాడు. "మీరు మనుషులు కాదు పశువులు." అరిచాడు, మైకు బ్రద్దలయ్యేలా.

అధ్యక్ష స్థానంలో వున్న మరో పెద్ద మనిషి నెమ్మదిగా యిలా అన్నాడు. "స్వజాతాభిమానం బొత్తిగా లేదండీ వాళ్ళకు!!"

* * *

డిటెక్టివ్ కాంతారావ్ ట్రైన్‌లో ప్రయాణిస్తూన్నాడు. సీరియస్‌గా డిటెక్టివ్ నవల చదువుతున్న ప్రక్క వ్యక్తిని, ఆ నవల పేరేంటని అడిగాడు.

అమ్మాయి-ఆత్మహత్యంటూ ముఖ చిత్రం చూపించాడు.

వెంటనే కాంతారావిలా అన్నాడు, "ఆ అమ్మాయి చని పోవటానికి కారణమెవరో తెలుసా?"

"ఆమె భర్త" అని సమాధానమిచ్చాడా యువకుడు.

"నో, నేనే కారణం. ఆ నవలా రచయితను నేనే కనుక!"

—రాం-సూరి, తిమ్మరాజు పేట.

## 62

ఒక ప్రయాణీకుడు రైలు పెట్టెలో గుర్రుపెట్టి నిద్ర పోతున్నాడు. ఒక్క కుదుపుతో రైలు ఆగడంతో మెలుకువ వచ్చింది. ప్రక్క ప్రయాణీకుణ్ణి అడిగి చూశాడు, "ఎందు కంది రైలు ఆపు చేశారు," అని.

ప్రక్క ప్రయాణీకుడు:- మనకి ఎదురుగా కూర్చున్నావిడ పెట్టెలోంచి కిందకు దూకేసింది.

మొదటి ప్రయాణీకుడు:- ఎంత పని చేశారండీ! కనీసం గొలుసైనా లాగి వుండవలసింది, ఆవిడ దూకగానే.

ప్రక్క ప్రయాణీకుడు:-లాగేసే వాణ్ణే. కాని ఆ గొలుసు కాస్తా దూకేటప్పుడు ఆవిడ మెడలోనే ఉండి పోయింది. పట్టు దొరకలేదు.

* * *

కొత్తగా శిక్ష పడ్డ ఇద్దరు ఖైదీలని ఒకే సెల్‌లోకి పంపారు.

మొదటి ఖైదీ:- నీకెన్నాళ్లు శిక్ష పడింది?

రెండవ ఖైదీ:- రెండేళ్లు, మరి నీకో?

మొదటి ఖైదీ:- మూడేళ్లు, నీ పక్క తీసుకెళ్లి ఆ గుమ్మం దగ్గరాగా వేసుకో!

రెండవ ఖైదీ:- నేనే ఎందుకు వేసుకోవాలి? నువ్వే వేసుకోవచ్చుగా?

మొదటి ఖై:-. ఎక్కడున్నా మనం క్యూ పద్ధతి మర్చి పోగూడదు. పాలదగ్గరా సినిమా హాలు దగ్గరా, కిరసినాయిలు దగ్గరా. అన్ని చోట్ల మనం క్యూ పాటిస్తున్నామా లేదా? ఇక్కడా అంతే. నాకంటే సంవత్సరం ముందు వెళ్ళి పోయే

వాడివి. అందుచేత సెల్ గుమ్మం దగ్గర కూడా క్యూలో ముందు నువ్వే ఉండాలి. అంతవరకూ వెంటిలేటరు ఊచలు లెక్క పెడుతూ కాలం గడపవలసిన వాణ్ణే నేను.

* * *

చిన్న కథల మాస పత్రిక కార్యాలయానికి ఒక రచయిత తన నవల పట్టుకొచ్చాడు. ప్రింటుచేసుకోమని. ఎడిటరుగారు ఎన్నోవిధాల చెప్పి చూశారు, ఆ నవల తమ పత్రికకు పనికి రాదని, రచయిత తన నవలను ఆకాశానికెత్తి పొగి డేసుకుంటున్నాడు. ఎడిటరు గారికి వళ్లు మండింది.

ఎడిటరు:- అదంతా వప్పుకుంటానయ్యా బాబూ! కాని, నా పత్రిక మరో పది కాలాలుండాలని నా కోరిక. ఏం చెయ్య మంటావు చెప్పు?

రచయిత:- ఆ మాట ముందే చెప్ప కూడదా సార్! పది కాలాలేం ఖర్మ? పది పేజీలకు సరిపడే మేటరు పెంచి ఇస్తాను, ప్రింటు చేసుకోండి!

—'భారవి', చిక్కడపల్లి.

## 63

స్కూల్ నుండి వచ్చి ఏడుస్తున్న కొడుకుని అడిగింది తల్లి.

"ఏం బాబూ, ఏడుస్తున్నావు?"

"మేష్టారు కొట్టారమ్మా!"

"ఎందుకు కొట్టారు?"

"జపాన్ ఎక్కడుందో. అడిగారు, నాకు తెలియ దన్నాను."

"ఇకనుంచైనా ఎక్కడ ఏది పెట్టావో బాగా జ్ఞాపక ముంచుకో!" అంది తల్లి వంటింట్లోకి నడుస్తూ.

* * *

ఒక రైతు తను క్రొత్తగా కొన్న గుర్రం మీద పోతూ, దారిలో తానెరిగిన డాక్టరు కనబడితే పిలిచి ఎక్కించాడు. కొంత దూరం వెళ్ళిన తరువాత ఆ గుర్రం వారిద్దరిని క్రింద పడతోసి, ఎటో పారిపోయింది.

"ఏమయ్యా చల్లగా వెళ్ళిపోతున్న నన్ను పిలిచి ఈ దిక్కుమాలిన గుర్రంమీద ఎక్కించావు. ఏమిటి నీ ఉద్దేశ్యం?" అన్నాడు కోపంగా డాక్టర్, విరిగిన నడ్డివి చేత్తో పట్టుకుని మూలుగుతూ.

"ఇటువంటి గుర్రం ఎక్కాక నాతోపాటు ఒక డాక్టరు ఉండడం మంచిదని నాకు తోచిందయ్యా." అన్నాడు వినయంగా రైతు.

—పి. నాగేశ్వరరావు, బరంపురం.

## 64

"షాజహాన్, ముంతాజ్ కోసం తాజ్‌మహల్ కట్టాడు. నీ కోసం నన్నేం కట్టమంటావ్?" ఛలోక్తిగా అడిగాడు ప్రియుడు.

"ఏమిటీ! నాకప్పుడే సమాధి కట్టాలను కున్నారా!" అంటూ విసవిసా వెళ్ళిపోయింది ప్రియురాలు.

* * *

"ఏరా! అన్ని సబ్జెక్టులోనూ నీకు ముప్పయి యైదు మార్కులకు తక్కువ వచ్చాయే!" అని ప్రశ్నించాడు తండ్రి.

"నాదేం తప్పులేదునాన్నా! మరేమో, మాష్టారుకు ముప్పయైదు పైన ఒంట్లు రావట!" అన్నాడా పుత్రరత్నం.

—చిన్న శివసుబ్రహ్మణ్యం, నెల్లూరు.



